ఉషాకిరణ్ మూవీస్



# ప్రతిఘటన



నిర్మాత: రామోజీరావు స్క్రీన్‌ప్లే: దర్శకత్వం: కృష్ణ

# గూండాయిజం పై తిరుగుబాటు
# ఉషాకిరణ్ మూవీస్ 'ప్రతిఘటన'

తాను గడ్డి తిని మనకు పాలిస్తుంది ఆవు. అందుకే అది తల్లిలాంటిది. కాబట్టే మనం గోమాత అంటాం. ఆ పాలు తాగి పశువులా మారతాడట మినిషి. ఇదంతా ఎందుకు చెప్తున్నానంటే ఈ సమాజంలో నేడు తల్లిలాంటి గోవునూ, గోమాతలాంటి తల్లినీ వధించే పశువులు కూడా ఉన్నారని చెప్పడానికే "...అదేమిటీ?" అంటారా...?ఇప్పుడు కొన్ని పాత్రలు పరిచయం చేస్తాను. అప్పుడది అంతేనని ఒప్పుకుంటారు...సరేనా"

...అడుగో మాటల్లోనే వస్తున్నాడే!... ఆ యువ కుమారరత్నం పేరు సత్యమూర్తి. లాయరుగా వెలగబెడుతున్నాడు సత్యమూర్తికి



ఏదసత్యమో ఏది సత్యమో తెలుసు కానీ సత్యాన్ని సత్యం అని ఒప్పుకునే సత్తాలేదు. ఇంచుమించు ఓ చదువుకున్న దద్దమ్మ. ధనము, హోదా – దుర్మార్గం – దౌర్జన్యం వున్నవాళ్ళ పలుకుబడికి భయపడి తన కళ్ళముందు తనకే ఘోరమైన అన్యాయం జరుగుతున్నా ఎదిరించలేని బెదురుగొడ్డు. భార్య అభిమానాన్ని బజారుపాలు చేసుకున్న పిరికిపంద. లాయర్ సత్యమూర్తి భార్య ఝాన్సీ. పేరుకుదగ్గ ధైర్యవంతురాలు. కొత్తగా ఆ ఊరికి బదిలీ అయివచ్చిన తెలుగు లెక్చరర్. సంఘంలోని దురాచారాలను, స్త్రీలపట్ల జరిగే దౌర్జన్యాలను, విద్యార్థుల అక్రమశిక్షణను ఎదిరించి తాను నివశించే పరిసర వాతావరణాన్ని శాంతినిలయంగా తీర్చి దిద్దాలని, తద్వారా స్త్రీ జాతిలో నవ చైతన్యం తీసుకురావాలనీ, సార్వజనీనమైన సమాన హక్కులను ఆచరణలో పెట్టించాలనీ దీక్షాకంకణం కట్టుకున్న ఆదర్శ మహిళ ఝాన్సీ. భర్త సత్యమూర్తికి భార్య ఝాన్సీకి ఆలోచనాసరళిలో నక్కకూ నాగలోకానికీ ఉన్నంత తేడా వుంది. ఈవిడ పనిచేసే కాలేజీకి ఒక్కసారి వెళ్ళొద్దాం పదండి! చూశారా... అక్కడ వరండాలో నిలబడి ఆడపిల్లల్ని, ఉపాధ్యాయినులను అల్లరి పెట్టి, మానసికంగానూ, శారీరకంగానూ నానాహింసలూ పెడుతున్నారే ... వారే రేపటి పౌరులు; వారే రేపటి దేశాధినేతలు; ఈ రిరౌడీలకు తొత్తులు; గూండాయిజానికి ఊపిరితిత్తులు. వారికి తల్లీ తండ్రీ, అక్కాచెల్లీ, గురువు దైవం తేడాల్లేవు. ఆ కామెర్ల కళ్ళలో అన్నీ కామవాంఛలే. ప్రేమకీ కామానికీ తేడా తెలీని మూర్ఖులు. అందుకే దివ్యాశయ మూర్తి ఝాన్సీని కూడా అనరాని అశ్లీల పదాలతో అనేకసార్లు అవమానించారు. అవన్నీ సహించి వారిని సక్రమ



మార్గంలో నడపాలనే ప్రయత్నం ఆమె విడనాడకుండానే అనవరతం పోరాడు తోంది. ఫలితం తెరమీద చూద్దాంలెండి. వీరందరి వెనుకావున్న అసలుసిసలు నరరూప రాక్షసుడు, గోముఖవ్యాఘ్రం, మేకవన్నెపులి అయిన వ్యక్తినిచూపిస్తాను. నిశ్శబ్దంగా చూడండి!...అతనే ఈ వూరి ఖూనీకోరు కాశేశ్వరరావు. అతన్నందరు రౌడీలూ ముద్దుగా 'కాశీ' అని పిలుచు కుంటారు. తనకు ఎదురుతిరిగినవాళ్ళ తలలు నరికిస్తాడు. కుల, మత, వర్ణ, వర్గ విచక్షణ లేకుండా అందరి రక్తాన్నీ మంచి నీళ్ళప్రాయంగా తాగి గడ్డికరిపిస్తాడు. తలచుకుంటే ఆ ఊళ్ళో అందరి తలలూ నరికి పొలిమేరల్లో తోరణాలు కట్టిస్తాడు. ఆయన పక్కనే ఉన్నాడే ... ఆయన పేరు లాయర్ మహాలింగం. కాశీగారికి న్యాయసలహాదారు. కాకికి- కోయిలకు తేడాలేదని, రెండూ తెల్లగానే వుంటాయని ఒప్పించగల వాక్చాతుర్యంగల దిట్ట. గుడినీ గుళ్లో లింగాన్నీ వేర్వేరుగా మింగ డానికి టైంలేక రెంటినీ ఒకేసారి మింగ గల సమర్థుడు మహాలింగం. మరి ఆయన పక్కనున్నవాళ్లెవరూ? అందులో రాజకీయ



నాయకుడిలా కన్పిస్తున్నాడే – ఆయనేమో మంత్రి కాశియ్య. ఢిల్లీలో కూర్చుని రౌడీ రాజులకు రాజకీయ రంగు పులిమి ప్రజా సేవకులుగా, నాయకులుగా చిత్రించి మిగిలిన రాజకీయనాయకులతో రౌడీలకు మద్దతునిప్పించగల నేర్పరి. ఆయన అండ చూసుకునే రౌడీ 'కాశీ' విచ్చలవిడిగా హత్యలు చేస్తాడు.

ఇక్కడ మరో మంచి పాత్రను పరిచయం చేయడం మరచిపోయాను. ఈయన పేరు ప్రకాష్. ఝాన్సీకి క్లాస్ మేట్. ఈ ఊళ్లోనే సబిన్స్పెక్టర్‌గా వుంటున్నాడు. నీతికి నిజాయితీకీ, ధర్మానికి వృత్తి ధర్మానికి మరో పేరుగా రూపొందినమహోన్నతాశయాలుమూర్తీభవించిన వ్యక్తి. ఇవీ ముఖ్యపాత్రలు!! ఒకానొక సందర్భంలో రౌడీ కాశీని



యస్.ఐ. ప్రకాష్ అరెస్టుచేసి జైల్లో పెట్టాడు. ఈ విషయం తెలిసిన మంత్రి కాశియ్య తన పలుకుబడినంతా ఉపయోగించి విద్యార్థులతో సమ్మెలు చేయించి, ఊరేగింపులు లేవదీసి, ప్రజానాయకులు, రాజకీయ నాయకులతో నిరాహారదీక్షలు చేయించి, రౌడీ కాళిని జైల్లోంచి విడుదల చేయిస్తాడు. జైల్లోంచి బయటికొచ్చిన కాళీ–ప్రకాష్‌పై కక్షకట్టి అతన్ని నట్టనడిరోడ్డులో పట్టపగలు హత్య చేస్తాడు. అది కళ్ళారా చూసిన ఝాన్సీ కాళిపై పోలీసు రిపోర్టిస్తుంది. దాన్ని ఉపసంహరించుకోమని కాళీ–సత్యమూర్తిని పిలిచి వార్నింగిస్తాడు. సత్యమూర్తి బతిమాలినా ఝాన్సీ అందుకు అంగీకరించదు. కాళీ స్వయంగా ఝాన్సీ ఇంటికొస్తాడు. సత్యమూర్తి భార్యను కాళీ కాళ్ళమీదపడి క్షమాపణ చెప్పమంటాడు. ఆమె ఎదురుతిరిగింది. కాళీకి ఒళ్ళు మండింది. తన రౌడీల సహాయంతో ఆమెను నడిబజార్లో నిలబెట్టి పట్టపగలు వివస్త్రను చేస్తాడు. అదంతా కళ్లారా చూస్తూ వూరూ వాడా అందరూ నిస్సహాయులై నిలబడిపోతారు. ఈ విషయం తెలిసిన గూడెంలోని నాయకురాలు నాగమ్మ వెళ్లిపోతున్న కాళిని తెగతిట్టిపోసి, ఆ వీధిలోని పెద్దలను నిప్పుల్తో మొఖాన చెరిగేసి ఝాన్సీని తనింటికి తీసుకుపోతుంది. కొన్నాళ్ళకు ఆ ఊరి ఎన్నికల్లో రౌడీ కాళీ అభ్యర్థిగా హైకమాండు నిర్ణయిస్తుంది.

ఈ విషయం తెలిసిన ఝాన్సీ పూలమాలతో అతనింటికి వెళ్లి అతన్ని సత్కరించి, అతని తరపున ఎన్నికల ప్రచారంచేస్తానని హామీ ఇచ్చి వచ్చింది.ఆ విషయంలో నాగమ్మకుఎక్కడలేని కోపం వచ్చింది. ఇంట్లోంచి వెళ్లిపొమ్మని గెంటేసింది .ఝాన్సీ ఎన్నికల ప్రచారం ముమ్మరంగా చేసింది. వివస్త్రను చేసిన వాడికి ఓటేయమని సిగ్గులేకుండా అడుగుతోందని ఎందరో ఝాన్సీని నిందించారు. ఇంతమంది ఆడిపోసుకున్నా అభిమానం చంపుకుని అవమానించిన వ్యక్తిని గెలిపించమని ప్రచారం చేయడంలో ఝాన్సీ ఆశయమేమిటి? ఆమె కూడా రౌడీల రాజ్యాన్నే సమర్థిస్తోందా? ఎవరెన్ని రకాలుగా ఆలోచించినా...రౌడీ కాళేశ్వర రావే ఘనవిజయం సాధించాడు. ఓటర్లు విచక్షణాజ్ఞానం లేని నాటుసరుకులా? మరెలాగెలిచాడు...గూండాయిజం, రౌడీయిజం, అవినీతి, అక్రమాలు, అన్యాయాలు, దురాగతాలు, దౌర్జన్యాలు తమకు అండదండలుగా పెట్టుకుని ప్రజాసేవకుల పేరుతో రాజకీయనాయకుల ముసుగులో గద్దెకెక్కిన పెద్దల్ని చూస్తే మీకే అర్థమౌతోందికదా! కానీ అలాంటివాళ్ళను ఎదుర్కోవడం ఒక్క ఝాన్సీకే తెలిసింది.

ఈ సమాజంలో ఝాన్సీలు అవతరించినప్పుడు అమానుషత్వం అంతంగాక మరేమౌతుంది. ప్రతివ్యక్తీ తన కర్తవ్యాన్ని గుర్తెరిగి తోటివ్యక్తుల కూడగట్టుకుని అత్యాచారాలను, దురాచారాలను ప్రతిఘటించాలి. అందుకేం చేయాలి? ఉషాకిరణ్ మూవీస్ 'ప్రతిఘటన' మీ సందేహానికి సమాధానమిస్తుంది. మనోధైర్యం, ఆత్మవిశ్వాసంగలిగి, అన్యాయం అక్రమాలపట్ల అసహ్యాభావంగల ప్రతి ఒక్కరూ చూడవల్సిన చిత్రం 'ప్రతిఘటన'. సంఘాన్ని నవచైతన్య పథంవైపు నడిపించే ఆశయరథం– 'ప్రతిఘటన'.

చంద్రమోహన్, విజయశాంతి, చరణ్ రాజ్, పి.యల్. నారాయణ, డా. రాజశేఖర్, వేలు, కాకినాడ శ్యామల, వై. విజయ, జానకి, సుమంగళి, భీమేశ్వరరావు, నర్రా వెంకటేశ్వర రావు, వరలక్ష్మి, బేబీ మహాలక్ష్మి మున్నగు వారు నటించిన ఈచిత్రానికి సంభాషణలు: యం.వి.యస్. హరనాథరావు; పాటలు: వేటూరి సుందరరామమూర్తి; సంగీతం: చక్రవర్తి; కెమేరా: నవకాంత్; కళ: భాస్కర రాజు; కూర్పు: గౌతమ్‌రాజు; నృత్యాలు: శేషు; నిర్మాణ నిర్వహణ: అట్లూరి రామారావు; కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం: టి. కృష్ణ నిర్మాత: రామోజీరావు. మయూరి విడుదల.



కృష్ణ,



చక్రవర్తి,



హరనాథరావు,



నవకాంత్



ఉషాకిరణ్ మూవీస్

# ప్రతిఘటన




నిర్మాత: రామోజీరావు స్క్రీన్‌ప్లే·దర్శకత్వం: కృష్ణ

# చతుర

సంపుటి: 8     అక్టోబర్ 1985     సంచిక: 9

## ఈ నెల సమగ్ర నవల

తన బీద జీవితానికి యూనివర్సిటీ చదువు అందని మానిపండు లాంటిదే అనుకుని నిస్పృహతో క్రుంగిపోతున్న అతనికి వూహించని విధంగా కొండంత అండ లభించి అతని కలలను నిజం చేసింది. అయితే...

ఉన్నత విద్యకు, సంస్కృతికి నిలయమైన ప్రాంగణాన్ని, మేధావులకు, సంస్కారానికి నెలవుగా పరిగణించే ఆ విశ్వవిద్యాలయాన్ని ఓ...

# దండకారణ్యం

...గా భావించేలా అతన్ని మార్చిన సంఘటనలేమిటి? అతను భావించినట్టు - ఆ అరణ్యంలో సభ్యత, సంస్కారం, నైతిక విలువలు, మానవత్వం పుష్కలంగా వున్నట్లు చూపరులను భ్రమింపజేస్తున్నాయా? వాస్తవానికి అవన్నీ కేవలం కాంచన మృగాలేనా? అక్కడివన్నీ మారీచమాయలేనా?

## వీరపత్ని వీణాపాణి

తన లేఖినితో, రంగుల కలలా ఎందరినో ఆకర్షించే యూనివర్సిటీ జీవితాన్ని నూతన కోణం నుంచి విశ్లేషించిన 'దండకారణ్యం' ఈ నెల చతుర సమగ్ర నవల!

ముఖచిత్రం : ఎస్. శివన్నారాయణ

# రచయితలకు ఆహ్వానం

# విచిత్ర ప్రపంచం

## కాగితపు ఇంధనం

పాత న్యూస్‌పేపర్లని తూకానికి అమ్ముకోవచ్చనే సంగతి అందరికీ తెలుసు! వాటిని తిరిగి కాగితపు పరిశ్రమలో ముడి పదార్థంగా వుపయోగిస్తారనేది వారికి తెలియకపోవచ్చు! అయితే పశ్చిమ జర్మనీలోని మ్యూనిచ్ నగరంలోగల 'ది ఫ్రెడరిక్ స్కోయిఫెన్ రీసెర్చి సెంటర్' పాత పేపర్లని ఇంకా మెరుగైన పద్ధతిలో ఉపయోగించవచ్చునని కనుగొంది. ఆ సంస్థకు చెందిన శాస్త్రవేత్తలు ఒక కిలో న్యూస్‌ప్రింట్‌ని పావుకిలో 'ఎథనాల్'గా మార్చే విధానాన్ని కనిపెట్టారు.

బ్రెజిల్‌లో ఇప్పటికే 'బాగస్సే' అనే చెరుకు పిప్పివంటి పదార్థం నుంచి 'ఎథనాల్' తయారుచేస్తున్నారు. దానికి పెద్దగా ఖర్చు అవదు. అందువల్ల బ్రెజిల్‌లో ఎథనాల్‌ని మోటారు వాహనాలకు ఇంధనంగా వాడుతూ పెట్రోలు దిగుమతులను తగ్గించారు.

'ఫ్రెడరిక్ స్కోయిఫెన్'కి చెందిన శాస్త్రవేత్తలు మొదట్లో మూడు వేర్వేరు కాయగూర రకాలనుంచి మోటారు వాహనాలకు పెట్రోలుకు బదులుగా వుపయోగించే ఇంధనాన్ని తయారుచేసేందుకు ప్రయత్నించారు. సెల్యులోజ్ కంటే ముందు వాళ్లు బీట్‌రూట్, ఆహార ధాన్యాలు, బంగాళాదుంపలపై పరిశోధన జరిపి మిగిలిన రెండింటికంటే ఆహార ధాన్యాలనుంచి 'ఎథనాల్' తయారు చేయడం ఎక్కువ లాభకరమని కను



గొన్నారు. ఆ విధంగా తయారైన ఎథనాల్ నుంచి జనించే శక్తి, దాన్ని తయారుచేసేందుకు అవసరమైన శక్తి కంటే చాలా అధికం. కాని ఆహార ధాన్యాల నుంచి ఉత్పత్తిచేసే ఎథనాల్ పెట్రోల్‌కంటే లాభకరమేమీకాదు. ధాన్యాలనుంచి 1 గేలను ఎథనాల్‌ని తయారుచేసేందుకు 4 డాలర్లు ఖర్చవుతుంది.

పనికిరాని కాగితపు సెల్యులోజునుంచి ఉత్పత్తి చేసిన ఎథనాల్ ఇతర విధాలుగా తీసిన ఎథనాల్ కంటే ఎక్కువ లాభదాయకమని తర్వాత కనుగొన్నారు. ఆ పద్ధతిలో 1 లీటర్ ఎథనాల్ ఉత్పత్తికి 1 జెర్మన్‌మార్కు-అంటే నాలుగున్నర రూపాయలు మాత్రమే ఖర్చవుతుంది. ఇది పెట్రోలు, డీజిల్ కంటే చవకైనది. జర్మనీలో చెత్తకుండీల్లో పారేసే పనికిరాని కాగితాన్నంతా ఎథనాల్ ఉత్పత్తికి వినియోగిస్తే అక్కడ అవసరమైన ఇంధనంలో 10 శాతం ఎథనాల్ ఆ విధంగా ఉత్పత్తి చేయవచ్చునని అంచనా వేయబడింది!

## క్రేజ్!

స్టాంపుల సేకరణ, పుస్తక పఠనం, సంగీతం సర్వసాధారణంగా చాలామందికి వుండే హాబీలే! అయితే విద్యా గురువాయూరప్పన్ అనే ఆమెకి ఓ వింత హాబీ వుంది. ఆ హాబీ ఏమిటంటే, క్రికెట్ ఆటగాడు సునీల్ గవాస్కర్ గురించి పత్రికల్లో ఏం ప్రచురించినా ఆ కటింగులు సేకరించడం. గత పదేళ్ళనుంచి అవిధంగా సేకరించినవాటిని చక్కటి ఆల్బమ్‌గా తయారుచేసి, దానికి గవాస్కర్ నుంచి ప్రశంసల్ని కూడా అందుకుందామె.

"మా కుటుంబమంతా గవాస్కర్ అభిమానులమే. అతను సెంచరీ సాధించినప్పుడల్లా స్వీట్స్ తయారుచేసి ఇరుగు పొరుగువాళ్ళకి పంచడం మాకలవాటు. నేను 10 ఏళ్ళ వయసునుంచీ గవాస్కర్ గురించి ఏ సమాచారం దొరికినా సేకరించనారంభించాను. ఎవరింటికైనా వెళ్ళినప్పుడు ముందు పాత పత్రికలు, పేపర్లు తీసి గవాస్కర్ గురించి రాసిన వ్యాసాలేమైనా వున్నాయేమో చూసేదాన్ని. పాత పేపర్ల దుకాణంలో గవాస్కర్ గురించి రాసిన



వేమైనా కనబడితే వెంటనే అవి కొనేసే దాన్ని" అంటూ తన సేకరణ గురించి చెబుతోందామె.

విద్య తాతగారైన నటరాజ అయ్యర్‌కి డాన్ బ్రాడ్ మన్ అంటే ఎనలేని అభిమానం.ఆ విధంగావంశపారంపర్యంగా విద్యకి క్రికెట్ పై అభిమానం పుట్టుకొచ్చింది.

విద్యకు 1984 జనవరిలో వివాహమైంది. ఆమె భర్త కూడా క్రికెట్ అభిమానే! పెళ్ళయ్యాక విద్యభర్తతోకాపురానికి సింగపూరు వెళ్ళిపోయినా తన సేకరణను మాత్రం అలాగే కొనసాగిస్తోంది. ఈమధ్య ఆస్ట్రేలియాలో జరిగిన పోటీలో ప్రపంచకప్పును గెలుచుకున్నపుడు గవాస్కర్ సింగపూర్ మీదుగా భారతదేశం తిరిగొచ్చాడు. అపుడు సింగపూర్‌లో విద్య తనఆల్బమ్‌ని గవాస్కర్‌కి చూపించి మొదటిపేజీలో అతని ఆటోగ్రాఫ్ తీసుకుంది!

## కోటి రూపాయల రోగి!

అది అమెరికాలోని మియామీ నగరం!

అక్కడి మియామీ విశ్వవిద్యాలయానికి చెందిన స్కూల్ ఆఫ్ మెడిసిన్ భవనంలో ఓ గదిలోని రోగి పరిస్థితి సీరియస్‌గా వుంది. అతని శ్వాస క్రమబద్ధంగా లేదు. ఓ అప్రెంటిస్ డాక్టరు స్టెతస్కోపుతో రోగి హృదయ చలనాన్ని పరీక్షచేశాడు. తర్వాత రోగి బెడ్‌కివున్న మీటను నొక్కితే దగ్గిరలోని బోర్డుపై రోగి కేసు హిస్టరీ అంతా కనబడింది. అప్రెంటిస్ డాక్టరు మరికొన్ని మీటలునొక్కి రోగి కొత్త ఎక్స్-రే, కార్డియోగ్రాములను చూసి ఆ రోగి రోగానికి సంబంధించి ఓ నిర్ధారణకొచ్చాడు.

ఆ రోగి పేరు హార్వే! అతను ఎన్నో రకాల హృద్రోగాలతో బాధపడుతున్నాడు.ఎలక్ట్రికల్ బోర్డుమీద కనబడిన వివరాలనుబట్టి, హార్వే హృదయంలో ఒక వాల్వు వదులయిందని, దాని ఫలితంగా ఊపిరితిత్తుల్లోకి రక్తం కారడంతో అది రోగి హృదయచలనాన్ని దెబ్బతీసిందని, హార్వేపై తక్షణమే ఎమర్జెన్సీ ఆపరేషన్ నిర్వహించాల్సి వుంటుందనీ డాక్టర్ చెప్పాడు.

కాని, ఆ తర్వాత రోగిగురించి ఎవరూ పట్టించుకోలేదు. ఎందుకంటే అదంతా అప్రెంటిస్ డాక్టర్ రోగనిర్ణయం ఎలా చేస్తాడో పరీక్షించేందుకు జరిపిన తతంగం గనుక! హార్వే తక్కిన రోగుల్లాంటివాడు కాదు.అతను సైన్సు సృష్టించిన అద్భుతం. అతను మనిషినిపోలిన మరమనిషి! అమెరికాలో వైద్యంలో శిక్షణపొందుతున్నవారికి 'హార్వే' ఎంతో ఉపయోగపడుతున్నాడు. హార్వేని శాస్త్రవేత్తలు, డాక్టర్లు తమ సమిష్టికృషితో సృష్టించారు. వైద్య విద్యార్థులకి, వృత్తిలో ఉన్న డాక్టర్లకి, హృద్రోగాలకు సంబంధించి సరిగ్గా రోగ నిర్ధారణ చేయడంలో మంచి అనుభవం కల్గించే ఉద్దేశంతో హార్వేని సృష్టించారు. వివిధ కంప్యూటర్ ప్రోగ్రాములద్వారా హార్వేలో 50 రకాల హృద్రోగాలను నింపారు.

అప్రెంటిస్ డాక్టర్లకి ఓ రకమైన హృద్రోగాన్ని చూడటం లేదా పరీక్ష చేయ దలచుకున్నప్పుడు అదే రకమైన హృద్రోగం గల రోగి దొరకకపోవచ్చు. అలాంటప్పుడు ఆ రోగాన్ని హార్వేలో సృష్టించి ఆ విధంగా రోగంగురించి వాళ్లు





బాగా అర్థంచేసుకునేట్టు చేస్తారు. హార్వేని రోజంతా మెలకువగానే వుంచవచ్చు. మానవ శరీరాన్ని పోలి వుండే 'హార్వే యంత్రాన్ని' రోగిలా పడకపై పడుకోబెట్టి వుంచుతారు. హార్వే అంగాలన్నీ ఎలక్ట్రానిక్, ఎలక్ట్రో మెకానికల్ డివైసెస్ వల్ల అంతా మానవ అవయవాల్లానే పని చేస్తాయి. వివిధ ప్రోగ్రాములు రికార్డు చేసిన టేపులు, కేసెట్లు హార్వే కడుపులో



అమర్చడంద్వారా వేర్వేరు రోగాల లక్షణాలు కల్పిస్తారు. ఓ మీట నొక్కితే ఆ రోగానికి సంబంధించిన సమాచారమంతా హార్వే పడకదగ్గరలో వుండే బోర్డు మీద కనబడుతుంది.

హార్వే చర్మం ప్లాస్టిక్‌తో చేయబడింది. ఆ యంత్రాన్ని రూపొందించడంలో మూలపురుషుడయిన హార్వే అనే శాస్త్రవేత్త పేరునే దానికి పెట్టారు. హార్వే 1967లో ఆ విధమైన యంత్రరూపంలోని రోగి గురించి ఆలోచించి, కొన్నేళ్ళ తర్వాత 3-4 రోగాలను ఇమడ్చగల యాంత్రిక రోగిని సృష్టించడంలో సఫలమయ్యాడు. తర్వాత ఆ యంత్రాన్ని 50 రోగాల వరకూ నిలిపేటట్టు రూపొందించారు. యంత్ర రూపంలోని రోగి రూపకల్పనకి డాక్టర్ హార్వేకి 10ఏళ్లు పట్టగాదాని కోసం 2 కోట్ల రూపాయలు ఖర్చయింది.

ఆ విధంగా తయారైన మరమనిషిని ఒక సంవత్సరంపాటు శాస్త్రవేత్తలు క్షుణ్ణంగా తనిఖీ చేశాక ప్రస్తుతపు మోడల్ తయారైంది. మెస్మర్ అండ్ డిమాన్ అనే వ్యాపార సంస్థ కోటి రూపాయల ఖర్చుతో 'హార్వే'ని తయారు చేసింది. ఈనాడు అమెరికాలోని ఆస్పత్రులు, వైద్య కళాశాలల్లో హార్వేకి ఎంతో డిమాండు వుంది!

## వింత ప్రపంచం

**లండన్‌లో కూడా నిరుద్యోగ సమస్య**

ఉషాకిరణ్ మూవీస్

# ప్రేమించు పెళ్ళాడు

రామోజీరావు • వంశీ

గణేష్ పాత్రో • ఇళయరాజా • యం.వి.రఘు • శేషు • అనిల్ మల్నాడ్ • భాస్కరరాజు

నిర్వహణ: అట్లూరి రామారావు



# మురికిని నిర్మూలిస్తుంది
# బట్టలను కాపాడుతుంది







సూపర్ పవర్
## రీగల్
డిటర్జెంట్ సబ్బు

తయారీదార్లు
షా వాలెస్




మాత్రమే!

అధికమే! బ్రిటిష్ యువకులు ప్రతి అయిదుగురిలోనూ ఒకరు మాత్రమే ఉద్యోగస్తులు. లండన్‌లో 'గ్రూప్ ఫైవ్' అనే నిరుద్యోగుల సంస్థ ఇటీవల ఒక వింత ప్రపంచాన్ని సృష్టించి, ఆవిధంగా నిరుద్యోగ సమస్యను పరిష్కరించాలని నిర్ణయించుకుంది.

వెయ్యి ఎకరాల ప్రదేశంలో నెలకొల్పే ఆ వింత ప్రపంచపు నిర్మాణానికి 200 మిలియన్ల డాలర్లు ఖర్చవుతుందని అంచనా. దానివల్ల 3,200 మందికి సంవత్సరం పొడుగునా పని, మరో 800 మందికి సీజన్‌వారీగా పనివుంటుంది.

ఈ వింత ప్రపంచం అమెరికాలోని 'డిస్నీవరల్డ్'లా వినోదం అందించేదిగా వుండదు. అది చూడవచ్చినవారికి నేటి సమాజాన్ని మార్చేసే శాస్త్రీయ పరిణామాల్ని, ఆవిధంగా భవిష్యత్తులో ఏర్పడనున్న సమాజం గురించి తెలియజెప్పి వారిని విజ్ఞానవంతుల్ని చేస్తుంది. ప్రతి వెయ్యిమంది విజిటర్లకి ఏడుగురు గైడ్లు చొప్పున తోడువుండి అంతా తిప్పి చూపిస్తారు. మనిషికి 15 డాలర్ల ప్రవేశ రుసుము వుంటుంది.



దానిలో 10 వేలమంది పట్టే ఆటల స్టేడియం, సాంస్కృతిక కార్యక్రమాలకై 30 వేల మంది ప్రేక్షకులకు సరిపోయే ఆడిటోరియం వుంటాయి. బ్రహ్మాండమైన ఆకారంలో మానవ దేహపు మోడల్ ఒకటి వుంటుంది. ప్రేక్షకులు దానిలో తిరుగుతూ దేహంలోని వివిధ భాగాలు ఎలా పనిచేస్తుంటాయో తెలుసుకోగలరు.

ఈ "వింత ప్రపంచం" లో గుండ్రంగా తిరుగుతుండే డిస్కో-స్టేజి, పాప్ సంగీతానికో స్టేజి, అతి పెద్ద నక్షత్రశాలలను నిర్మించేందుకు కూడా అనేక కమిటీలను ఏర్పరచారు. లండన్‌కి 30 మైళ్ళ దూరంలో నిర్మించతలపెట్టిన ఈ ప్రాజెక్టు వద్దకు ప్రేక్షకులను తీసుకు వెళ్ళే లింకు రోడ్లకే మిలియన్ డాలర్లు ఖర్చవుతుంది.

ఈ వింత ప్రపంచం నిర్మాణాన్ని 1983లో ప్రారంభించాలనుకున్నారు. కాని బ్రిటన్ పౌరులు, రాజకీయనాయకులు అది అతి విలాసవంతమైన, ఖర్చు దండగ వ్యవహారమని పేర్కొంటూ తమ వ్యతిరేకతను తెలిపారు. అందువల్ల ప్రభుత్వం వింత ప్రపంచపు నిర్మాణానికి అనుమతి నిరాకరించింది!







సాయంత్రం...

ఆరు గంటలు కావస్తోంది. కాలగర్భంలో మరో పగలు విలీనమై పోతోంది. అస్తమించబోయే సూర్యుడు... అసంఖ్యాకమైన జీవితానుభవాలను గడించిన వృద్ధుడిలా వున్నాడు. పడమటి ఆకాశం తగలబడిపోతున్నట్లు ఎర్రగా నిగనిగమంటోంది.

ఆకాశంలో గమ్యమంటూ లేకుండా ఎటో తేలిపోతున్న తెల్లమబ్బులు... శూన్యంలోకి ఎగరేసిన దూదిపింజల్లా వున్నాయి. ఆహార సముపార్జన అవాళ్టికి ముగించి గూళ్ళకు చేరుకుంటున్న పక్షుల సంకీర్ణ ధ్వనులతో ప్రకృతి ప్రతిధ్వనిస్తోంది.

అదో విశాలమైన చెరువు. ఆ చెరువులో ఓ వేపు పశువులూ, మరోవేపు గొర్రెలూ విచ్చలవిడిగా సంచరిస్తూ పచ్చగడ్డి మేస్తున్నాయి. ఎవరో నేలమీద పాదరసాన్ని ఒలకబోసినట్లుగా... ఆ చెరువులోని కొద్దినీళ్లు సాయంకాలపు ఎండకు తళతళ మెరుస్తున్నాయి.

ఆ నీటి అంచున గుంపులు గుంపులుగా కూర్చుని, చేపలనూ, పురుగులనూ చటుక్కున ముక్కులతో పట్టి దిగమింగుతున్న కొంగలు...

చెరువులోని పచ్చగడ్డిని కడుపారా మేస్తున్న గేదెల వీపులపై కూర్చుని కొన్ని కాకులు కావుకావున అరుస్తూ... గేదెల ఒంటిమీదుండే పుళ్ళనుపొడుచుకు తింటూ నడుస్తున్న చరిత్రను నిరూపిస్తున్నాయి.

ఆ చెరువులోని నీటి అంచున వరసగా వున్న బొరియల వద్ద చేరి... కొందరు పిల్లలు ఎండ్రకాయల్ని పడుతున్నారు. మరికొందరు హుషారుగా బిళ్ళంగోడు ఆడుతున్నారు. ఇంకొందరు పిల్లలు చంకల్లో బుట్టలు పెట్టుకుని తిరుగుతూ.... పేడముద్దల్ని ఏరుకుంటున్నారు.

సూర్యుడు పడమటి కొండల చాటుకు జారుకున్నాడు. ప్రకృతిపై పరుచుకున్న వెలుతురు అంతరించిపోతోంది. ఏకచ్ఛత్రాధిపత్యంగా రాజ్యమేలడానికి చీకటి చిందులువేస్తూ ముందుకు వస్తోంది. అక్కడక్కడా ఆకాశంలో వెండిపువ్వుల్లా చుక్కలు మెరుస్తున్నాయి.

చీకటి పడటంతో...

అంతవరకు ఆ చెరువులోని గడ్డిని కడుపారా మేస్తున్న ఆవులు, గేదెలు, గొర్రెలు ఇంటికి తిరుగుముఖం పట్టాయి. వాటితో పాటు వాటిని కాసే కుర్రాళ్ళు కూడా తిరుగుముఖంపట్టారు. ఆ గుంపు చివరన ఒక యువకుడు మెల్లగా నడుస్తున్నాడు.

సుమారు ఇరవై రెండేళ్లు! ఒంటిపై మాసిన బనియనూ, ఓ గళ్ళ లుంగీ, భుజంమీద ఒక టవలూ, కొద్దిగా పెరిగిన గడ్డం....! చిందరవందరగా పడివున్న జుట్టు... అంతులేని నైరాశ్యాన్ని నింపుకున్నట్టుగా అగుపించే కళ్ళు... ఇది ఆ యువకుని రూపం.

కుడిచేత్తో ఓ కర్రను పట్టుకుని... దారి తప్పి అటూ ఇటూ వెళ్ళే పశువుల్ని అదిలిస్తూ మెల్లగా నడుస్తున్నాడతను. ఆ పశువుల కాళ్ళతొక్కిడితో లేచిన ఎర్రమట్టి పొగలా వ్యాపిస్తోంది. అప్పటికే పొలం పనులను పూర్తిచేసుకున్న రైతులు ఇంటి ముఖం పట్టారు.

"సారథీ!"

ఎవరో తనను పిలవటంతో చటుక్కున తలెత్తి చుట్టూ కలయచూశాడతను. అల్లంతదూరాన పొలం గట్టుమీదగా తన వేపే నడిచివస్తున్న పంతులు మాధవరావు




కన్పించాడు. తెలుగు పంతులు మాధవరావు అంటే సారథికి ఎంతో అభిమానం...అమితమైన గౌరవం.

"అదేమిటి మాస్టారూ! చీకటి పడుతున్నా ఇంకా ఈ పొలం గట్లమీదే తిరుగాడుతున్నారు? సాయంకాలపు మీ షికారు కార్యక్రమం ఇంకా పూర్తి అయినట్టు లేదే" అన్నాడు మెల్లగా నవ్వుతూ సారథి.

"నీ కోసమే వస్తున్నా"

"నా కోసమా?"

"అవునోయ్...నీ కోసమే. ఇకనుంచి నీకు ఈ పశువుల్ని మేపే బాధ లేదు. హాయిగా రెండేళ్ళపాటు యూనివర్సిటీలో చదువుకోవచ్చు. నీకు ఎం.ఎ.లో సీటు వచ్చింది. మధ్యాహ్నం పోస్టుమన్ కన్పించి నీ ఇంటర్వ్యూ కార్డిచ్చాడు" మాధవరావు తన చొక్కా జేబులోంచి ఆ కార్డును తీసి సారథికిచ్చాడు.

ఆ కార్డుని అందుకుని చూసిన సారథి ఆ క్షణంలో పొంగిపోయాడు. సామ్రాజ్యాలను జయించిన చక్రవర్తిలా ఆనందడోలికల్లో అతడి హృదయం ఊగిసలాడింది.

కానీ...

తనేమిటో తన జీవితమేమిటో తన స్థానమేమిటో గుర్తుకురాగానే తను కేవలం ఒక పరాన్నజీవనే సంగతి స్మృతిపథంలో మెదలగానే అతడి ఆనందమంతా నిప్పుల మీదపడ్డ నీటిబొట్టులా ఆవిరైపోయి అస్థిత్వాన్ని కోల్పోయింది.

"ఈ మాట చెప్పడానికేనా మాస్టారూ మీరు నాకోసం ఇంతదూరం వచ్చింది?" నిరాశగా అన్నాడు సారథి.

"అదేమిటి సారథీ! ఎంతో సంతోష కరమైన విషయం చెబితే అలా అంటా వేమిటి?"

"మాస్టారూ! హైస్కూల్లో నేను మీ వద్ద చదువుకునే రోజుల్లో అనంతామాత్యుడు రాసిన 'భోజరాజీయం'లో 'గోవ్యాఘ్రసంవాదము' అనే పాఠం చెప్పారు. ఆ పాఠంలో 'చులకన జలరుహ తంతువు' అనే పద్యాన్ని బాగా వివరించి చెప్పారు...మీకు గుర్తుందా?" అడిగాడు సారథి మాధవరావు వేపు చూస్తూ.

"ఆఁ.. .ఆ గుర్తుంది"

"ఆ పద్యాన్ని నేనిప్పటికీ మరచి పోలేదు. తల్లిలేని బిడ్డ ఈ ప్రపంచంలో అన్నిటికన్నా చులకన అని ఆ పద్యం యొక్క సారాంశం. అనంతామాత్యుడెంత గొప్పవాడు! తల్లిలేని బిడ్డని ఈ సమాజం ఎంత చులకనగా చూస్తుందో చాలా చక్కగా చెప్పాడు"

మాధవరావు బదులు చెప్పలేదు.

"నేను తల్లిలేనివాడినే కాదు మాస్టారూ! తండ్రి కూడా లేనివాడిని. పరుల పంచన చేరి బతుకుతున్న వాడిని. పరాన్నభుక్కుని. నాలాంటివాడికి యూనివర్సిటీలో చేరి ఉన్నతమైన చదువులు చదువుకునే అవకాశం వుంటుందా మాస్టారూ?" మెల్లగా నవ్వుతూ అడిగాడు సారథి.

అతడా మాట అనడంతో ఒక్కసారి తన గుండెల్లో ఎవరో చేయిపెట్టి కెలికి నట్లయింది మాధవరావుకు. ఆ మాట వెనుక సారథి హృదయంలో గూడు కట్టుకున్న వేదన, సంవత్సరాల తరబడి అతడి గుండెలో ఘనీభవించిన వ్యధ... నిస్సహాయత – ఇవన్నీ మాధవరావుకు తెలియనివేమీకాదు.

"నీ జీవితమంతా ఈ మారుమూల పల్లెలో గడిచిపోడానికి వీల్లేదు సారథీ!

# ప్రకృతి చెప్పే పాఠాలు...





ప్రకృతి నుంచి మనం నేర్చుకోదగ్గవి ఎన్నో ఉన్నాయి. కొద్ది కొద్దిగా కూడబెట్టి దాన్నే పెద్ద మొత్తంగా చేసే నేర్పు కూడా అందులో ఒకటి. ఈ సూత్రాన్ని ఆచరణలో పెట్టడానికి మార్గదర్శి మీకు తోడ్పడుతుంది. చిన్న చిన్న మొత్తాలలో పొదుపుచేసి పెద్ద మొత్తం పొందే అవకాశాలు మీ అందుబాటులో ఉంచుతుంది.

అంతేకాదు, రెండు దశాబ్దాల వ్యాపారానుభవం ఉన్న మార్గదర్శి మీరు పొదుపుచేసే మొత్తాలకు పూర్తి భద్రత సమకూరుస్తుంది. లాభసాటి డివిడెండ్లు కూడా వరుసగా ఆ మొత్తాలకు తోడవుతూ ఉంటాయి. మార్గదర్శిలో పొదుపు భవిష్యత్తుకు మదుపు అని లక్ష మందికి పైగా ఇప్పటికే గ్రహించారు. మరి, మీ మాటేమిటి ?

**డబ్బు కోసమేనా మీ చింత - మార్గదర్శి వున్నది మీ చెంత!**




## మార్గదర్శి

చిట్ ఫండ్ ప్రైవేటు లిమిటెడ్

మార్గదర్శి హౌస్, అబిడ్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

**శాఖలు:** ● అబిడ్ సెంటర్, హైదరాబాద్ ● లక్డీకాపూల్, హైదరాబాద్ ● చిక్కడపల్లి, హైదరాబాద్ ● అమీర్‌పేట, హైదరాబాద్ ● కాబ్రా కాంప్లెక్స్, ఎమ్.జి.రోడ్, సికిందరాబాద్ ● బిసెంట్ రోడ్, విజయవాడ ● బందరు రోడ్, విజయవాడ ● మెయిన్ రోడ్, గుంటూరు ● మెయిన్ రోడ్, కాకినాడ ● ఇన్నీసుపేట, రాజమండ్రి ● నెహ్రూ రోడ్, కర్నూలు ● మెయిన్ రోడ్, విశాఖపట్నం ● జె. పి. ఎన్. రోడ్, వరంగల్, ● వైరారోడ్, ఖమ్మం

నువ్వు తప్పకుండా యూనివర్సిటీకి వెళ్ళి చదువుకోవాలి. అక్కడెందరో తెలివైన విద్యార్థులు, పండితులు ఉంటారు. వాళ్ళ సాంగత్యంలో నువ్వొక గొప్పవాడివి కావాలి. అదే నేను కోరుకునేది"

"నాకంత అదృష్టమెక్కడిది మాస్టారూ! నా జీవితమంతా ఇదిగో...ఈ పశువుల సాంగత్యంలోనే గడిచిపోతుందేమో. దరిద్రుడికి ఆశలుండకూడదు మాస్టారూ! నాకు ఎం.ఏ చదవాలనే అభిలాష, అందుకు తగిన అర్హతలున్నా ఆ అవకాశం మాత్రం లేదు"

"అలా ఎందుకనుకుంటున్నావు?"

"నన్ను ఎం.ఏ.లో చేర్పించడానికి మావయ్య ఏమాత్రం ఒప్పుకోడు. అసలు నేను ఎం.ఎకి అప్లయ్ చేసినట్లు మావయ్యకి తెలియదు. ఆయనకు చెప్పకుండా అప్లయ్ చేశాను. చెప్పివుంటే నన్ను అప్లయ్ చెయ్యనిచ్చేవాడు కాదు. నేను యూనివర్సిటీకెళ్ళడం జరిగే పనికాదు"

"ఈ విషయంగా నువ్వు నిరుత్సాహపడకు. ఎలాగైనా ఈ విషయంలో మీ మావయ్యని ఒప్పించే పూచి నాది" అన్నాడు మాధవరావు హామీఇస్తూ.

"లాభం లేదు మాస్టరూ! ఈ విషయంలో మీరు ఓటమిని అంగీకరింపక తప్పదు. మీ ప్రయత్నం వృథా" అన్నాడు సారథి మెల్లగా నవ్వుతూ.

"ప్రతిదానికీ ఇలా నిరాశగా మాట్లాడ్డం నీకు బాగా అలవాటైపోయింది సారథీ!"

"ఏ మనిషైనా ఆశాజీవిగా బతకాలంటే ... దానికో ఆలంబనంటూ వుండాలి మాస్టారూ! కానీ ఏ ఆలంబనా లేని నాలాంటివాళ్ళు నిరాశగా కాక ఇంకెలా మాట్లాడగలరు?"

"నీతో మాట్లాడ్డం నావల్లా కాదోయ్. ప్రతి దానికీ ఏదో ఓ అడ్డుపుల్ల వేసి ఎదుటి మనిషి నోటిని మూయించేస్తావు" అన్నాడు మాధవరావు చిరునవ్వు నవ్వుతూ.

"మీ మాట నేనెప్పుడూ ఇంతవరకు కాదనలేదు...ఇప్పుడు కాదనను. ఇంతకూ నన్నేం చెయ్యమంటారో చెప్పండి మాస్టారూ" అన్నాడు సారథి.

"ఏమీ చెయ్యనవసరం లేదు. మీ మావయ్యకి నువ్వు ఎం.ఏ.లో చేరే విషయం గురించి ఓసారి చెప్పు చాలు. తర్వాత నేను కూడా ఆయనతో మాట్లాడుతాను"

"ఆయనకు చెప్పడమెందుకు? ఆయనకు ఈ విషయం చెప్పకుండానే... ఆయన చెప్పబోయే మాటల్ని నేను ముందే ఊహించి చెప్పెయ్యగలను"

"అలా కాదు సారథీ! మాటవరుసకైనా నువ్వు మీ మావయ్యని అడగాలి కదా. అడిగి చూడు...ఆయన కాదంటే తర్వాత ఆలోచిద్దాం" అన్నాడు మధవరావు.

"మజ్జిగ పొయ్యడానికే మహా బాధపడ్డ మనిషి...గంపెడు సంతోషంతో గడ్డ పెరుగును దానం చెయ్యగలడా! ఇంటర్మీడియట్ చదువుతానంటే డబ్బు ఖర్చుఅయిపోతుందని నన్ను కాలేజీకి పంపించని మావయ్య...ఇప్పుడు నన్ను యూనివర్సిటీకి పంపిస్తాడనుకోవడం కేవలం భ్రమ"

"అని ఎందుకనుకోవాలి? ఏది ఏమయినా ... మీ మావయ్యను నువ్వో మాట అడగడం మంచిది. అడిగాక అందుగాయన ఏమంటాడో నాకు చెప్పు. కాదంటే ... నేనాయన్ని ఒప్పించే

ప్రయత్నం చేస్తాను"

"అలాగే మాస్టారూ! మీరింతగా చెప్తుంటే కాదంటానా? నా ఎం.ఏ. చదువు విషయంగా నేను తప్పకుండా మావయ్యని అడుగుతాను. నేను ప్రతిదీ అడగడం... దానికాయన కాదనడం నా పసితనం నుండి చూస్తున్నాను"

"నీకు యూనివర్సిటీలో ఇంటర్వ్యూ సోమవారం ఉదయం పదిన్నరకు. ఇవాళ బుధవారం. ఇంకా అయిదు రోజులుంది. ఇంటర్వ్యూ అంటే ఏమీ వుండదు. ఊరకే ఊరూ, పేరూ అడిగి ఎం. ఏ. అడ్మిషన్ ఫీజు కట్టెయ్యమంటారు...అంతే" అంటూ పొలాల వేపు నడక సాగించాడు మాధవరావు.

సీతాపురం మరీ చిన్న పల్లెటూరూ కాదు. అలాగని టౌన్ అనడానికి కూడా వీల్లేదు. ఆ ఊళ్ళో పోస్టాఫీసుంది. అక్కడికొచ్చే ఉత్తరాలు రన్నర్ యొక్క దయాదాక్షిణ్యాల మీద అందజెయ్యబడుతుంటాయి. ఆ వూళ్ళో ఎప్పుడు ఎలా కూలిపోతుందో చెప్పలేని ఓ సినిమా టెంటు కూడా వుంది.

ఆ సినిమా టెంట్‌లో పాతిక సంవత్సరాల క్రితం విడుదలయిన సినిమాలు ఆడిపోతుంటాయి. ఒక్కోసారి అందులోని తెరమీద బొమ్మలు కనిపించకుండానే మాటలూ,పాటలూ విన్పిస్తుంటాయి.ఒక్కోసారి మాటలూ పాటలూ ఆగిపోయి బొమ్మలు మాత్రం కన్పిస్తూ పెదవులు కదిలిస్తుంటాయి.

ఆ వూళ్ళోని హైస్కూలు చాలా చిన్నది. ఆ హైస్కూల్లోనే మాధవరావు తెలుగుపంతులుగా ఉద్యోగంచేస్తున్నాడు. పది సంవత్సరాల క్రితం మాధవరావు ఆ స్కూల్‌కు బదిలీపై వచ్చాడు. ఇప్పటి వరకు మళ్ళీ ఆయనకు ఎక్కడికీ ట్రాన్స్‌ఫర్ రాలేదు.

మాధవరావు పనిచేసే హైస్కూల్లోనే సారథి మామయ్య సాంబశివరావు లెక్కల మాస్టారుగా పనిచేస్తున్నాడు. ఆయనకు విపరీతమైన డబ్బు పిచ్చి. పాడి పంటలమీద బోలెడంత ఆదాయం వస్తుంది. ప్రతినెలా జీతం వస్తుంది. ట్యూషన్స్ చెప్పి బోలెడంత సంపాదిస్తున్నాడు. అయినా సాంబశివరావుకు తృప్తిలేదు. సుఖం అంతకన్నా లేదు. ఎంత డబ్బున్నా తృప్తి అనేది లేకపోతే మనిషి సుఖంగా హాయిగా జీవితాన్ని గడపలేడనే వాస్తవం సాంబశివరావుకు బొత్తిగా తెలియదు.

ధనవ్యామోహం భయంకరమైనది. అది అనుబంధాలను తెంపేస్తుంది. అభిమానాలను,అనురాగాలను పాతాళానికి తొక్కేస్తుంది. మానవత్వాన్ని నిర్దయగా కాలరాచేస్తుంది. ఈ ధనవ్యామోహమే సాంబశివరావుకూ సారథికీ మధ్య దూరాన్ని సృష్టించింది.

మాధవరావు స్వభావం సాంబశివరావు స్వభావానికి పూర్తిగావిరుద్ధమైంది. మనిషికి కావలసింది డబ్బుకాదు గుణం – అనే అభిప్రాయం గలవాడాయన. ఒకే స్కూల్లో చాలాకాలంనుండి పనిచేస్తుండటంవల్ల ఇద్దరి మధ్య కొంత సన్నిహితం వుంది.

మాధవరావుకు సారథి అంటే అభిమానం. అందుకు కారణం..చిన్నప్పటి నుండి సారథి చదువులో చురుకైనవాడు కావడమే. మాధవరావువల్లే సారథికి చిన్నతనం నుండి తెలుగు సాహిత్యంపై మంచి అభిరుచి ఏర్పడింది. తనకేదైనా అర్థం కాకుంటే మాధవరావు చేత చెప్పించుకునేవాడు సారథి.

రాత్రి తొమ్మిది గంటలవుతోంది.




కోదండ రామాలయంలోని దీపం ఆఖరి శ్వాసను పీల్చుకుంటోంది. ఆలయం ముందు భాగంలో ఏపుగా పెరిగిన వేప చెట్టు ధ్యానంలో మునిగిపోయిన ఋషిలా చలనరహితంగా వుంది.

అంతవరకు ఆ గుడి వరండాలోని తిన్నెపై కూర్చునివున్న సారథి మెల్లగా లేచాడు. తువ్వాలును విదిలించి భుజంమీద వేసుకుని అక్కడినుండి కదిలాడు. తనకు ఎం.ఏలో సీటువచ్చినసంగతి మావయ్యతో ఎలా చెప్పాలని ఆలోచిస్తున్నాడు.

మెల్లగా ఇంటి ప్రాంగణంలోకి అడుగు పెట్టిన సారథికి వరండాలో వాలుకుర్చీలో పడుకుని పుస్తకం చదువుకుంటున్న సాంబశివరావు కనిపించాడు. పశువుల ముందు గడ్డిపడేసి,లేగదూడల్ని జాగ్రత్తగా కట్టేసి మెల్లగా వరండాలోకి వచ్చి నిల బడ్డాడు సారథి.

తన యూనివర్సిటీ చదువు గురించి చెబితే మావయ్య ఏమంటాడో. మాట మాత్రమైనా చెప్పకుండా ఎం.ఏకి అప్లయ్ చేసినందుకు బహుశా తనపై మండిపడ వచ్చు. కోపంతో తనను తిట్టనూవచ్చు. ఎలా ప్రారంభించాలో సారథికి బోధ పడటంలేదు.

"ఆవులముందు గడ్డిపడేశావా?" పుస్తకంలోని పేజీలు తిప్పుతూ అడిగాడు సాంబశివరావు.

"వేశాను" చెప్పాడు సారథి.

"ఆ దూడల్ని జాగ్రత్తగా కట్టేశావా లేదా? రాత్రుల్లో అవి పగ్గాలు తెంపుకుని పాలు తాగేస్తున్నాయి"

'జాగ్రత్తగానే కట్టేశాను' అనే అర్థం వచ్చేలా తల ఆడించాడు సారథి.

"అన్నట్టు ...ఆ తెల్లావు ఇంకెన్ని దినాల్లో ఈనొచ్చు?" ప్రశ్నించాడాయన సారథి వేపు చూసి.

"ఇంకో రెండు మూడు దినాల్లో ఈనొచ్చు" జవాబు చెప్పాడు సారథి.

"అవుల్ని ఏ చెరువులోనో, ఏ చేసు లోనో తోలేసి...నువ్వు పుస్తకం చదువుతూ కూర్చుండిపోతావు. కాస్త ఒళ్ళు దగ్గర పెట్టుకుని ఆ తెల్లావు ఎప్పుడు ఈనుతుందో ఓ కంట జాగ్రత్తగా కని పెడుతూ వుండు" పాలేరును హెచ్చరించే వాడిలా సారథిని హెచ్చరించాడు సాంబశివరావు.

'అలాగే' అన్నట్టు తల ఆడించాడు సారథి. ఇద్దరి నడుమ రెండు క్షణాలు మౌనంగా దొర్లాయి.

"మావయ్యా!" పిలిచాడు సారథి.

ఆ పిలుపుతో పుస్తకంలోంచి తలెత్తి సారథి వేపు ప్రశ్నార్థకంగా చూశాడు సాంబశివరావు.

"నాకు... నాకు ఎం.ఏలో సీటు వచ్చింది" తలదించుకుని మెల్లగా చెప్పాడు సారథి.

"ఎం.ఏకి నువ్వెప్పుడు అప్లయ్ చేశావు?" సాంబశివరావు కనుబొమలు ముడివడ్డాయి.

"నెలరోజుల క్రితం"

"నాతో చెప్పలేదేం?"

సాంబశివరావు నోటినుండి ఆ ప్రశ్న దూసుకువస్తుందని సారథికి తెలుసు. అయినా ఆ ప్రశ్నకు బదులు చెప్పడం సారథికి ఇష్టంలేదు.

"అప్లయ్ చేసే ముందు... మాట మాత్రమైనా నాతో చెప్పనివాడివి ... ఇప్పుడు సీటొచ్చినప్పుడు మాత్రం నాతో చెప్పడమెందుకు?'' సాంబశివరావు కంఠంలో కాఠిన్యం ధ్వనించింది. అది సారథి గ్రహించకపోలేదు.

"యూనివర్సిటీలో చేరి రెగ్యులర్‌గా ఎం.ఏ చదవాలనుకుంటున్నాను'' అన్నాడు సారథి.

"తప్పకుండా చదువు. నీ బాబు సంపాదించి ఇచ్చిపోయినది ఏమైనా వుంటే...అందులోని దబ్బును హాయిగా ఖర్చు పెట్టుకుంటూ ఒక్క ఎం.ఏ కాదు-పిహెచ్‌డి కూడా చేసుకో...నాకేం అభ్యంతరంలేదు" సారథి వేపు చూస్తూ వెటకారంగా అన్నాడు సాంబశివరావు.

అతడన్న ఆ మాట సారథి గుండెను అగ్నికణంలా స్పృశించింది. అయినా సారథి పెద్దగా బాధపడలేదు. బుద్ధి తెలిసి నప్పటినుండి ఆ ఇంట్లో అలాంటి మాటల్ని భరిస్తూనే వున్నాడు. అవమానాలతో అతడి హృదయం బాగా రాటు తేలి పోయింది.

"మావయ్యా! మా నాన్నె నాకు ఒక నిధి అంటూ ఇచ్చిపోయుంటే...ఇప్పుడు నాకీ గతి ఎందుకు పడుతుంది? సిగ్గూ శరం లేనివాడిగా నేనెందుకిలా మిగిలి పోతాను?'' అన్నాడు సారథి సాంబశివ రావు వేపు చూస్తూ.

అంటే ఏమిట్రా నీ ఉద్దేశం? మా ఇంట్లో వుండటంచేత నువ్వు సిగ్గూ శరం లేనివాడివై పోయావన్న మాట. అప్పటికి నిన్ను ఈ ఇంట్లో మేమేదో రాచి రంపాన పెట్టేస్తున్నట్టు. అంతేరా... దిక్కులేనివాడవని ఆదరిస్తే..."

"ఇప్పుడవన్నీ ఎందుకు మావయ్యా! నేను ఎం.ఏ చదువుతానన్నాను. ఇష్టముంటే చదివిస్తానను! లేకుంటే వీలు కాదని ఒక్క మాట చెబితే సరిపోతుందిగా'' అన్నాడు సారథి సాంబశివరావు వేపు సూటిగా చూస్తూ.

ఆ ఒక్క మాటతో సారథి తనపట్ల అంతులేని నిర్లక్ష్యాన్ని ప్రకటించినట్లు... ఆ చూపులో తన మీద అనంతమైన నిరసనను వెల్లడించినట్లు సాంబశివరావుకెందుకో అన్పించింది. తన ఇంట్లో తల దాచుకుని తన మోచేతికింది నీళ్లు తాగుతూ బతికే అనాథ వెధవకు ఇంత అహంభావమా - అనుకుంటూ రెచ్చిపోయాడాయన.

"గతి లేకపోయినా గర్వానికేమీ తక్కువలేదు. సిగ్గులేనివాడిలా నా ఇంట్లో పడుండటమెందుకు? వెళ్ళిపోయి ఆత్మాభిమానం వున్న మగాడిగానే ఎక్కడైనా బతుకు. నీ కాళ్ళపై నువ్వు నిలబడి చదువుకో"

ఎన్ని మాటలన్నా సారథి ఇంకా ఆ ఇంట్లో వున్నాడంటే... కారణం అతడికి ఆత్మాభిమానంలేక కాదు. ఎంత ఆత్మాభిమానం వున్నా ... కొన్ని కొన్ని పరిస్థితులలో మనిషి అభిమానం, రోషాలను చంపుకోలేకపోతే ప్రపంచంలో బతకడం కష్టమని సారథి చిన్నప్పుడే తెలుసుకున్నాడు.

"అసలు నువ్విప్పుడు ఎం.ఏ చదవకుంటే నష్టమేమిటి?" అన్నాడు సాంబశివరావు.

"లాభనష్టాల సంగతి గురించి నేను ఆలోచించడంలేదు మావయ్యా"

"నువ్వెందుకు ఆలోచిస్తావు? అసలు నీకు ఒక్క రూపాయి సంపాదించడం తెలిస్తేగా"

"తెలియదు...నేను అసమర్థుడిని"

"ఆ సంగతి ఇప్పుడు తెలిసిందా నీకు?"

"ఇప్పుడు కాదు...ఈ ఇంట్లోచాలా ఏళ్ళక్రితమే ఆ సంగతి తెలుసుకున్నాను"

"అసమర్థుడికి చదువెందుకు?"




"చాలామంది అసమర్థులూ, తెలివి తక్కువ దద్దమ్మలు కూడా చదివేస్తున్నారు గనుక"

సారథి ఆ మాట సాంబశివరావునే ఉద్దేశించి అన్నాడు. అయితే ఆ మాటలోని అంతరార్థం ఆయన గ్రహించలేదు. గ్రహించి వుండి వుంటే...సారథిని ఆయన వెంటనే మెడబట్టి బయటకు గెంటేసి వుండేవాడు.

"అసలు నీ ఇంటర్మీడియెట్, బి.ఏ ప్రయివేటు చదువులకు నేనెంత డబ్బు తగలేశానో నీకు తెలుసా?" ప్రశ్నించాడు సాంబశివరావు.

"ఏమో...నేనెప్పుడూ లెక్కపెట్టుకోలేదు"

"నీ డబ్బయితేగా లెక్కపెట్టుకోపడానికి"

"నువ్వు లెక్కల మాస్టారివి మావయ్యా! నీకు తెలిసినంత బాగా నాకు లెక్కలు తెలియవు"

సారథి అన్న ఆ మాట సాంబశివరావుకు కొరడా దెబ్బలా చురుక్కున తగిలింది.

"ఒరేయ్! నా చెల్లెలి కొడుకువని ఏదో దయతలచి నా ఇంట్లో నీకు చోటిచ్చాను. ప్రయివేటుగానైనా నిన్ను బి.ఏ వరకు చదివించాను. తల పొగరుగా మాట్లాడితే నీకి ఇంట్లో ఉన్న ఈ కాస్త చోటు కూడా దక్కదు"

సారథి మౌనం వహించాడు.

"ఇక నీకోసం నేను ఒక్క రూపాయి కూడా ఖర్చు పెట్టలేను. నీకు ఇష్టముంటే నా ఇంట్లో వుండు. లేకపోతే ఎక్కడికైనా వెళ్ళిపో. అసలు నీకు తిండి పెట్టవలసిన బాధ్యత, నిన్ను చదివించవలసిన బాధ్యత నాకేముంది?'' అంటూ సారథిని చాలా చులకనగా మాట్లాడసాగాడు సాంబశివరావు.

సారథి బదులు మాట్లాడలేదు. ఒక్కసారి సాంబశివరావు వేపు సూటిగా చూసి....అక్కడినుండి పశువుల కొట్టంలోకి వెళ్ళిపోయాడు సారథి. ఆ చూపులోని అసహ్యాన్ని ఏదైనా కొలతబద్దతో కొలవ గలిగితే.... అది ఆకాశంకన్నా అధికం. మౌనమే అసహ్యాన్ని ప్రకటించేందుకు ఉత్తమ సాధనం.

ఆ పశువుల కొట్టంలో నులకమంచం మీద పడుకున్నాడు సారథి. గాడిలో వేసిన పచ్చగడ్డిని గబగబా తింటున్నాయి పశువులు. నోరులేని ఆ మూగజీవులే సారథికి సన్నిహితులు.

ఎండు తాటి పట్టలతో కప్పబడిన ఆ పశువుల కొట్టమే అతని శయనమందిరం.

* * *

ఉదయం ఎనిమిదిగంటలు కావస్తోంది. కోదండరామాలయం వరండాలోకూర్చుని ఆవాళ్టి న్యూస్‌పేపర్ చదువుకుంటున్నాడు మాధవరావు. సరిగ్గా అప్పుడే సద్ది తాగేసి చేయి కడుక్కుని, చేతికున్న తడిని పైగుడ్డతో తుడుచుకుంటూ వీధిలోకి వచ్చాడు సారథి.

సారథిని చూడగానే 'ఇలారా' అన్నట్టుగా చేయి విసిరాడు గుడి వరండాలో కూర్చున్న మాధవరావు. ఆయన అలా పిలవగానే గుడివేపు నడిచాడు సారథి. మాధవరావు తనను ఎందుకు పిలుస్తున్నాడో సారథికి తెలుసు.

ఆ వరండాలో ఒక్క మాధవరావు తప్ప ఇంకెవ్వరూ లేరు. సారథి మెల్లగా అక్కడికి చేరుకుని ఆయనకు కుడిచేతి వేపు కూర్చున్నాడు.

"ఏం సారథీ! నీ ఎం.ఏ. విషయం

మీ మావయ్యను అడిగావా?" ప్రశ్నించాడు మాధవరావు.

అడిగాను అన్నట్టు తలాడించాడు సారథి.

"ఏమన్నాడు?"

"ఏమంటాడు. కళ్లు మూసుకుపోయినవాళ్లేమంటారో అదే అన్నాడు"

''అంటే...?"

"ఏదో చెల్లెలి కొడుకని నాపై దయతలచి తన ఇంట్లో చోటిచ్చాడట. నేను గతిలేని వాడినట. ఇప్పటికే నా ప్రయివేటు చదువులకు బోలెడంత డబ్బు తగలేశాడట. ఇకపై నాకోసం ఒక్క రూపాయి కూడా ఖర్చు పెట్టడట. ఇష్టం లేకుంటే తన ఇంట్లోంచి వెళ్లిపొమ్మన్నాడు" అంటూ తన మావయ్యకు మధ్య జరిగిన తతంగం గురించి వివరంగా చెప్పాడు సారథి.

"మీ మావయ్యని ఎం.ఏ చదువు సంగతి గురించి అడగమని నీకు సలహా ఇవ్వకుండా వుండివుంటే బాగుండేది సారథీ''నొచ్చుకున్నాడు మాధవరావు.

"పోనీలే మాస్టారూ! పెద్దవాళ్లెప్పటికీ చెడవాళ్లు కాదు" అన్నాడు సారథి నవ్వేస్తూ.




నాలుగు రోజులు గడిచాయి. ఆవాళ ఆదివారం. మసనటిరోజు ఉదయమే సారథికి యూనివర్సిటీలో ఎం. ఏకి ఇంటర్వ్యూ వుంది. యూనివర్సిటీలో రెగ్యులర్ క్యాండేట్‌గా ఎం.ఏ చదివే అదృష్టం తనకు లేదనుకున్నాడు సారథి. అందుకే ఆ విషయం గురించి ఆలోచించడం మానేశాడు.

సాంబశివరావు భార్య పేరు అనసూయమ్మ. డబ్బు సంపాదన విషయంలో అనసూయమ్మ భర్తకంటే రెండాకులు ఎక్కువే. ఆ చుట్టు పక్కల ఇళ్లల్లో వుండే కొంతమందికి ఆమె ఆవుపాలు అమ్ముతుంది. ఆ పాలను చూస్తే నీళ్లలో పాలు కలిపారా, పాలలో నీళ్లు కలిపారా అనే సందేహం వస్తుంది.

అనసూయమ్మంటే ఆ వూళ్లో చాలా మందికి భయం. అందుక్కారణం... ఆవిడ పోట్లాటకు గానీ దిగిందంటే తెరిచిన నోరు ముయ్యకుండా తిట్లలో పునరుక్తి దోషం లేకుండా అనర్గళంగా అరగంటపాటు తిట్టెయ్యగలదు.

అనసూయమ్మ ఎవరితోనైనా పోట్లాటే పెట్టడం ఆపేసిందంటే భయంకరంగా వీస్తున్న హోరుగాలి హఠాత్తుగా ఆగిపోయినట్టనిపిస్తుంది. అందరి ముందూ పులిలా ప్రవర్తించే సాంబశివరావు భార్య ముందు మాత్రం పిల్లి. ఆయన సంపాదించే ప్రతిపైసా భార్యకు అప్పజెప్పవలసిందే.

సారథి సాంబశివరావుకు మేనల్లుడు. అంతేగానీ అనసూయమ్మకు మాత్రం ఏమీ కాదు. తన వేపునుండి బంధుత్వం కాదు గనుక ఆమె సారథిని చాలా చులకనగా చూస్తుంది. పనిమనిషికి చెప్పినట్లు ఇంట్లో చిన్న చిన్న పనులు కూడా సారథికిచెప్పి చేయించుకుంటూ ఉంటుంది.

సాయంత్రం నాలుగు గంటలు కావస్తోంది. అనసూయమ్మ ఇంటి

పరంపాలో కూర్చుని బియ్యంలోని రాళ్ళను ఏరుతూ వుంది. ఆమె నోరు మాత్రం మిషన్‌లా ఆడుతూవుంది. ఆమెకు తాంబూలం వేసుకునే అలవాటు ఎక్కువ. రోజుకు కనీసం పది పర్యాయాలైనా ఆమె తాంబూలం వేసుకుంటుంది.

అందుకే వాళ్ళ ఇంటి పరండా ముందు భాగంలో అక్కడక్కడా ఆమె ఉమ్మేసిన తాంబూలం ఉమ్మి ఎండిపోయి ఎర్రగా మరకలు మరకలుగా వుంటాయి. శ్రీకృష్ణుడి చేతిలో ఎప్పుడూ పిల్లనగ్రోవి ఉన్నట్లు అనసూయమ్మ బొడ్లో నిరంతరం ఒక సంచి వేలాడుతూ వుంటుంది.

ఆ సంచిలో తాంబూలానికి సంబంధించిన తమలపాకులూ, పక్కలూ మొదలైన సర్వసామగ్రి సమగ్రంగా ఎప్పుడూ వుంటుంది. ఆ సామగ్రితో పాటు తన ట్రంకు పెట్టెకు చెందిన తాళంచెవుల గుత్తి, కొన్ని సత్తు నాణేలూ ఆ తిత్తిలోనే తలదాచుకుంటూ ఉంటాయి.

"అత్తయ్యా!"

ఆ పిలుపుతో చటుక్కున తలెత్తి చూసిన అనసూయమ్మకు ఎదురుగా సారథి కన్పించాడు. ప్రశ్నార్థకంగా చూసిందామె సారథి వేపు. అతడి ముఖం ఆందోళనతో నిండి ఉండటం అనసూయమ్మ గ్రహించకపోలేదు.

"మావయ్యలేడా ?" అనసూయమ్మ వేపు చూస్తూ మెల్లగా అడిగాడు సారథి.

"లేడు" హైస్కూల్ అబ్బాయి పరీక్షలోరాసే ఆబ్జెక్టివ్ టైప్ ఆన్సర్‌లా జవాబు చెప్పిందామె.

"ఎక్కడికెళ్ళాడు?"

"తెలియదు. ఏమిటి మీ మావయ్యతో అంత అర్జంటు పని?" అడిగింది అనసూయమ్మ.

చెప్పడానికి తటపటాయించాడు సారథి.

"అత్తయ్యా ! మన తెల్లావు..."

"మన తెల్లావు? ఈనిందా..."

"లేదు"

"మరి?"

"మన తెల్లావు...చచ్చిపోయింది"

ఆ మాట సారథి చెప్పగానే అనసూయమ్మ ఒక్క క్షణం...మునిశాపంతో శిలా రూపం ధరించిన రాకుమారిలా స్తంభించింది...మళ్ళీ వెంటనే తేరుకుంది.

"ఏమిట్రా నువ్వు చెప్పేది? మన తెల్లావు చచ్చిపోయిందా? నిజంగానా?"

నిజమే అన్నట్టు తలాడించాడు సారథి.

"ఎందుకు చచ్చిపోయింది చెప్పరా... చెప్పు? అది చచ్చిపోయిందా నువ్వు చంపేశావా? అయ్యో భగవంతుడా! వీడు బంగారంలాంటి ఆవును పొట్టనపెట్టుకున్నాడు. నా కొంపను గుల్లచేశాడురో నాయనో" అంటూ అనసూయమ్మ దిక్కులన్నీ ప్రతిధ్వనించేలా కేకలు వెయ్య సాగింది.

అంతవరకు ఆ వీథిలో ఆవరించివున్న ప్రశాంతత అనసూయమ్మ అరుపులతో పటాపంచలైపోయింది. ఆమె కేకలు విని చుట్టుపక్కల ఇళ్లల్లో వున్నవాళ్ళంతా ఆ ఇంటివద్దకు పరుగులతో వచ్చారు.

సరిగ్గా అప్పుడే పొలం చూడ్డానికి వెళ్ళిన సాంబశివరావు కూడా వచ్చాడు.

అప్పటికే ఆ ఇంటిముందు జనంగుంపు చేరిపోయారు. అనసూయమ్మ నోరు మున్సిపాలిటి సైరన్‌లా మోగుతోంది. ఆమె గొంతు విన్న మాధవరావు కూడా పరుగులాంటి నడకతో అక్కడికొచ్చాడు. నేరం మోపబడిన నిర్దోషిలా బిక్కముఖం వేసుకుని నిలబడ్డాడు సారథి.





"సారథీ! మీ అత్తయ్య చెప్పేది నిజమేనా?" సూటిగా అడిగాడు సాంబశివ రావు.

"ఆవు చచ్చిపోయిందన్నమాట నిజమే. కానీ దానిని చంపింది నేను కాదు"

"ఇంకెవరు?"

"ఎవరూ చంపలేదు మావయ్యా! అదే చచ్చిపోయింది. యాకిరిమిట్టదగ్గర గడ్డి మేస్తూ కాలుజారి పక్కనే వున్న నీళ్ళులేని బావిలో బండమీద పడిపోయింది. చాలా ఎత్తునుండి పడటంవల్ల వెంటనే చచ్చి పోయింది. ఈ మాట చెప్పడానికే నేను పరిగెత్తుకుంటూ వచ్చాను"

"అబద్ధం. వీడే ఆ ఆవును ఆ బావిలోకి తోసేసివుంటాడు" అంది అనసూయమ్మ.

"అన్యాయంగా మాట్లాడకత్తయ్యా! ఆవును నేనెందుకు బావిలోకి తోస్తాను? నాకేమైనా పిచ్చా?"

"పిచ్చికాదు...కసి. నిన్ను ఎం.ఏ. చదువుకు పంపించలేదని మాపై నీకు కసి. అందుకే...అందుకే నువ్వు ఇంత పని చేశావు. బంగారంలాంటి ఆవును చంపే శావు"

"నేనంత నీచుణ్ని కాను. మీకలాంటి అనుమానం ఏదయినా వుంటే...నాతో పాటే పశువుల్ని మేపే పిల్లలు చాలామంది వున్నారు. అడిగి తెలుసుకోండి"

"వెధవపనికి సాక్ష్యం కూడానా" అన్నాడు సాంబశివరావు సారథిని కొర కొర చూస్తూ.

"అంటే...అంటే ఆ ఆవుని నేనే చంపానని నువ్వు కూడా నమ్ముతున్నావా మావయ్యా...వద్దు మావయ్యా! మీకిష్టం లేకుంటే ఇంట్లోంచి గెంటెయ్యండి. కానీ ఇలాంటి పాపపు పనులు మాత్రం నామీదికి నెట్టకండి. నేను ఏ పాపమూ ఎరుగను" అలా అంటుంటే సారథి కళ్ళలో కన్నీళ్లు తిరిగాయి.

"అల్పత్వం ఎంతటి పాపిష్టిపనైనా చెయ్యడానికి వెనుకాడదు" అన్నాడు సాంబశివరావు.

"నేనేం అల్పుడిని కాను"

"అవును...మహా ఉన్నతుడివి"

"నా ఔన్నత్యం నాకుంది"

"నీ ఔన్నత్యం తెలుస్తూనే వుందిలే"

"నా ఔన్నత్యమే కాదు..మీ ఔన్నత్యం కూడా ఈ ఊళ్లో అందరికీ తెలుసు" సూటిగా అన్నాడు సారథి.

"ఏవిట్రా కూశావ్?" అంటూ సారథిపై చెయిచేసుకోడానికి సాంబశివ రావు చెయ్యి ఎత్తాడు.

"సాంబశివరావుగారూ ... తొందర పడకండి" అంటూ చేయిపట్టుకుని వారించాడు మాధవరావు.

"విన్నారా మాధవరావుగారూ వాడన్న మాట. తప్పు వాడిది కాదండీ! చెల్లెలి కొడుకని దయతలచి ఇంట్లో చోటిచ్చి తిండి పెడుతున్నాను. నాది...నాదండి తప్పు. అసలు నా చెల్లెలు ఎందుకు చచ్చి పోయిందో తెలుసాండి? ఈ దరిద్రుడిని ప్రసవించి"

సారథి మౌనం వహించాడు.

"వీడు పుట్టి నా చెల్లెల్ని చంపేశాడు. బతికి మమ్మల్ని చంపుతున్నాడు. వీడి తల్లితోపాటు వీడూ చచ్చివుంటే మాకు ఈ తిప్పలుండేవి కావు. వీడు దరిద్రుడండి. వీడు కాలుపెట్టిన ఏ కొంపా బాగుపడదు. ఆవు బావి దరివద్ద మేస్తుంటే వీడేం చేస్తు న్నట్టు? వీడి కారణంగానే సూడిఆవు చచ్చింది"

సారథి ఏమీ మాట్లాడలేదు.

వీడి తల్లి చస్తే తండ్రి దేశాలుబట్టిపోతే

నేను పెంచి పెద్దచేశానండీ వీణ్ని. కానీ ఏం లాభం? వీడికి ఆ కృతజ్ఞత కూడా లేదు. ఇవాళ నా ఔన్నత్యాన్ని గురించి మాట్లాడేస్థాయికి వచ్చాడు వీడు. ఇలాంటి నీచుడిపై దయ చూపడం నిజంగా మహా పాపమండీ...మహాపాపం''

అనసూయమ్మ సారథిని శాపనార్థాలు పెడుతోంది. చచ్చిపోయిన ఆవు గుర్తు కొస్తుంటే ఆమె కడుపు అగ్నిగుండంలా మండిపోతోంది. దాని చావుకు సారథి కారణం కాదనుకోడానికి ఆమె మన సొప్పడంలేదు.

సాంబశివరావు నీచంగా మాట్లాడు తున్నా, అనసూయమ్మ శాపనార్థాలు పెడుతున్నా సారథి మాత్రం ఉలక కుండా పలకకుండా బెల్లంకొట్టిన రాయిలా నిలబడిపోయాడు. పది నిముషాల్లో ఆ ఇంటిముందు గుంపు చేరినవాళ్ళంతా వెళ్ళిపోయారు. న్యాయమూర్తి మరణశిక్ష విధిసే ముద్దాయి వేపు నిస్సహాయంగా చూసే పోలీస్ జవాన్‌లా... సారథి వేపు ఒక్కసారి సానుభూతి నిండిన కళ్ళతో చూసి అక్కడినుండి వెళ్ళిపోయాడు మాధవరావు.

ఆ రాత్రి...

పశువుల కొట్టంలోని నులకమంచం మీద ఒంటరిగా పడుకున్నాడు సారథి. అతడి హృదయంలోలాగే బయటంతా అంధకారం. ఎంతగా ప్రయత్నించినా సారథికి అవాళ బొత్తిగా నిద్రరావడం లేదు.

ఏకాంతం అనేది అతనిపట్ల వేదనకు పర్యాయపదంగా పరిణమించింది. ఒక రోజులో అతడు ప్రశాంతంగా వుండే క్షణాలకన్నా అశాంతిగా వుండే క్షణాలే అధికం. అనసూయమ్మ, సాంబశివరావు అవాళ సాయంత్రం మాట్లాడిన మాటలు సారథి గుండెల్లో బరిసెపోట్లు పొడుస్తు న్నాయి.

సున్నితమైన మనస్సును కలిగి వుండటం కొందరి పాలిట నిజంగా మహా శాపం. పాశవిక ప్రవృత్తి కలిగిన మనుషుల మధ్య సున్నిత మనస్కులు అనుభవించే నరకయాతన భయంకరంగా వుంటుంది. అది వర్ణనాతీతం. సారథి బుర్రలో ఎన్నో ఆలోచనలు పరిభ్రమిస్తు న్నాయి.

"వీడి తల్లితోపాటు వీడూ చచ్చి వుంటే మాకు ఈ తిప్పలుండేవి కావు" సాంబశివరావు అన్న ఆ మాట సారథి. గుండెల్లో రాచపుండులా రగులుతోంది.

నిజమే...తన తల్లితోపాటు తనూ పోయింటే ఇప్పుడు తనకిన్ని బాధలూ, అవమానాలూ వుండేవికావు. మావయ్య అన్నట్టు తనను పోషించి చదివించవలసిన బాధ్యత ఆయనకేముంది? మావయ్యకూ తనకూ మధ్య ఉన్న సంబంధమేమిటి? ఆయనకు తను కేవలం ఒక మేనల్లుడు మాత్రమే...అంతే!

మనుషులు ప్రతి విషయంలోనూ దృష్టిని అలవరుచుకున్న ఈ ఆధునిక నాగరికతా కాలంలో ... అనుబంధాల సమాజంలో... ఆర్థిక సంబంధాల ఆధి పత్యంతో నడుస్తున్న ఈ వ్యాపార ప్రపంచంలో ... మావయ్యకూ తనకూ గల సంబంధం ఏపాటిది? చాలా స్వల్పమైన సంబంధం.

తన పుట్టుకకు కారకుడైన తండ్రి తనను దిక్కులేనివాడిగా మిగిల్చాడు. ఒక తండ్రిగా తనపట్ల బాధ్యతలను పూర్తిగా విస్మరించి దేశాలుబట్టిపోయాడు. తండ్రి విస్మరించిన బాధ్యతలను మేన





మామ మాత్రం ఎందుకు స్వీకరింప గలుగుతాడు?

ఆ తండ్రీ ఈ మేనమామా వీళ్ళ ఇద్దరూ భిన్న కాలాలకూ, భిన్న సమాజా లకూ సంబంధించినవాళ్ళు కాదు. వీళ్ళిద్దరూ...ఆర్థిక సంబంధాల హోరు గాలిలో అనుబంధాలూ, అనురాగాలూ, రక్తసంబంధాలూ గడ్డిపోచల్లా ఎగిరి పోతున్న ఒకే సమాజంలో సమకాలికులై జీవించినవాళ్ళు.

పుట్టినప్పటినుండి ఇప్పటివరకు తను ఏ బంధుత్వానికీ నోచుకోలేదు. ఈ ప్రపంచంలో తన జీవితం ఒక వెలిసి పోయిన రంగు. చిద్విలాసపు సృష్టి సంగీతంలో తన బతుకు ఓ తెగిపోయిన రాగం. మహాలయ అమావాస్య చీకట్ల మధ్య తను గమ్యం తెలియని ఒక అంధుడైన పాంథుడు.

తన జీవితానికర్థం... పరమార్థం కేవలం అవమానాలూ, అవహేళనలూ, నిర్భరమైన బానిసత్వం ... ఇంతేనా? అరటి ఆకుమీది మంచు బిందువులా ఈ ఇంట్లో తన స్థానం క్షణక్షణానికీ దిగజారి పోతూనే వుంది· వీళ్ళ భవిష్యత్తులోనైనా తనను ఓ మనిషిగా చూడగలరనే నమ్మకం బొత్తిగాలేదు.

తన ఆత్మాభిమానాన్నీ, వ్యక్తిత్వాన్నీ అడుగడుగునా చంపుకుంటూ.... ప్రతి నిముషం అవమానాలను భరిస్తూ... నీచంగా... బానిసలా ఈ ఇంట్లో తను ఇలా బతకవలసిందేనా? తనకూ మన సుంది. అభిమానముంది. ఒక వ్యక్తిత్వ ముంది. అయినా వాటిని తను కాపాడుకో లేకపోతున్నాడు.

తన అభిమానాన్ని తను బహిర్గతం చేసుకోలేడు. ఎంత నీచంగా మాట్లాడినా మావయ్యపై తిరగబడలేడు. అత్తయ్య చేసే అవమానాలను, ఆవిడ మాట్లాడే చులకన మాటలను తను ఎదుర్కోలేడు. తనో పిరికివాడు...అసమర్థుడు.

'జీవిత ప్రవాహం ప్రచండవేగంతో వెళ్ళిపోతూవుంది. అందులో ఎవరి సంస్కారాన్నిబట్టి వాళ్ళు తమ సుఖం కోసం పోట్లాడుకుంటున్నారు. ఇదొక మహాసంగ్రామం. ఇందులో పిరికివాళ్ళకు, అసమర్థులకు చోటులేదు'- అనే మాటలు హఠాత్తుగా సారథికి గుర్తుకు వచ్చాయి. ఈ మాటలు తనకు కూడా వర్తిస్తాయా? ఈ సంగ్రామంలో తనలాంటివాళ్ళకు స్థానమే లేదా??

ఈ ఘర్షణలోకి .... ఈ జీవన సంగ్రామంలోకి దిగబడకుండా తనబోటి వాళ్ళు దూరంగా నిలబడి గుడ్లప్పగించి చూస్తూ ఉండిపోవలసిందేనా? తనలాంటి వాళ్ళు ఈ ప్రపంచంలో జీవించేందుకు అనర్హులా??

ఇవాళ తెల్లావు బావిలోపడి చావడానికీ, తనకూ సంబంధమేలేదు. దాని చావుకు తను కారకుడు కాదు. అయినా తనే కారకుడైనట్లు అత్తయ్య, మావయ్య కలిసి తనను నానా మాటలన్నారు. అందరి ముందూ నీచంగా తిట్టారు.

నిజానికి ఆ ఆవును ఇన్నాళ్ళుగా తనే మేపాడు. దానికి బుట్టమేత పెట్టడం,కుడితి నీళ్ళు తాపించడం నీళ్ళతో కడగడం మొదలైన పనులన్నీ తనే చూశాడు. ఆ నోరులేని జీవితో తనకున్నంత దగ్గర సంబంధం మరెవ్వరికీలేదు. దాని చావుకు నిజంగా బాధపడింది తనొక్కడే.

అర్ధరాత్రి దాటిపోయింది. నిద్రపట్టని వెలియైన సారథి ఆ నులకమంచం మీద అటూ ఇటూ పొర్లుతూ..తన జీవితం

గురించి ఆలోచిస్తూనే ఉన్నాడు. ఊరంతా నిద్రాదేవి ఒడిలోకి జారిపోయి విశ్రాంతి తీసుకుంటోంది.

భూగోళంమీద బోర్లించిన నల్లటి కప్పులావున్న ఆకాశంలోంచి..ఓ ఉల్క హఠాత్తుగా జిగేలున వెలిగి రాలిపోయింది. సరిగ్గా సారథి బుర్రలో అప్పుడే తళుక్కునఓ ఆలోచన మెరుపులా మెరిసింది. వెంటనే నులకమంచం మీదినుండి కిందికి దిగి వీధిలోకి వచ్చాడు.

తన జీవితానికి సంబంధించి అతడొక బలమైన నిర్ణయం తీసుకున్నాడు సారథి. తను తీసుకున్న నిర్ణయం...అన్ని విధాలా సమంజసమైనదేనని అతనికి అన్పించగానే ఆ చీకట్లో మెల్లగా అడుగులు వేసుకుంటూ అయిదు నిము షాల్లో మాధవరావు ఇంటిముందురు వచ్చి నిలబడ్డాడు.

తన ఇంటి తలుపుమీద ఎవరో బాదిన చప్పుడు విన్పించడంతో..మాధవరావుకు మెలకువ వచ్చింది. బెడ్‌మీదినుండి పైకి లేచి, లైట్ వేసి, మత్తుగా కళ్లు నులుము కుంటూ..తలుపు గడి తీసిన మాధవరావు ఆశ్చర్యపోయాడు. వాకిలిముందు సారథి.

"ఏమిటి సారథీ! ఇంత రాత్రివేళ..."

"ఇంత రాత్రివేళ..మీతో ఓ ముఖ్యమైన పనిపడి వచ్చాను మాస్టారూ"

"ఏమిటబ్బా..అంత ముఖ్యమైన పని? ఉదయం చూసుకోవచ్చుగా"

"సూర్యుడుదయించేసరికి నేనీ వూళ్ళో ఉండను మాస్టారూ" అన్నాడు సారథి.

"ఆఁ...వూళ్ళో వుండవా? ముందు లోపలికి వచ్చి కూర్చో" లోనికి పిలిచాడు మాధవరావు.

ఆయనలా పిలవగానే సారథి లోపలికి వచ్చి అక్కడేవున్న ఓ కుర్చీలో కూర్చు న్నాడు.

"మాస్టారూ! నా మాటమీద మీకు విశ్వాసముందా?" అడిగాడు సారథి.

"ఎందుకొచ్చింది నీకా అనుమానం?"

బదులు చెప్పలేదు సారథి.

"సారథీ! ప్రతి మనిషిమీద అప నమ్మకం ఏర్పరచుకునేంత సంస్కార హీనుణ్ని కాదు నేను. ఎదుటి మనిషిని మనం నమ్మడం నమ్మకపోవడమనేది కొంతవరకు మనం అలవరుచుకున్న సంస్కారం మీదకూడా ఆధారపడి వుంటుంది"

"మీ సంస్కారాన్ని నేను ఎప్పటికీ సందేహించను మాస్టారూ" సారథి అన్నాడు.

"చూడు సారథీ! నీ స్వభావమేమిటో, నీ వ్యక్తిత్వమేమిటో నాకు బాగా తెలుసు. నిన్ను పొగుడుతున్నానని అనుకోకుంటే ఒక్కమాట చెబుతాను. నిన్ను విశ్వ సించని రోజున నేను ఈ ప్రపంచాన్నే విశ్వసించను"

మాధవరావు ఆ మాట అంటుంటే సారథి మనసు ఆనందంతో పులకరించి పోయింది.

"మీరు నాకో సాయం చెయ్యాలి మాస్టారూ" అన్నాడు సారథి తల వంచుకుని.

"తప్పకుండా"

"నాకో రెండొందలు డబ్బు కావాలి"

"ఎందుకూ?"

"నేనీ వూరు వదిలిపోతున్నాను"

"ఎక్కడికి?"

"యూనివర్సిటీలో ఎం.ఏ.లో చేరడానికి. మా మావయ్యకు నేను బరువు కాదలుచు కోలేదు. ఎం.ఏలో చేరి ట్యూషన్స్ చెబుతూ డబ్బు సంపాదించి మీ అప్పు తీర్చేస్తాను"





"నేను అప్పుగా ఇస్తేగా నువ్వు తీర్చ డానికి. నాకింకా వ్యాపారదృష్టి అలవడ లేదు సారథీ! సరే....ఇప్పుడే వస్తా" అంటూ హాల్లోంచి లోపలి గదిలోకి వెళ్ళిన మాధవరావు ఇనుపబీరువా తాళంతెరిచాడు.

ఆ హాల్లో టేబుల్‌మీదున్న పెన్ను అందుకున్నాడు సారథి. అక్కడేవున్న ఓ నోట్‌బుక్‌లోంచి రెండు కాగితాలను చించుకుని..తను ఇంట్లోంచి వెళ్ళిపోతు న్నట్టు తెలియజెప్పడానికి సాంబశివ రావుకు ఉత్తరం రాయసాగాడు సారథి.

"మావయ్యా! ఇంకో అరగంటలో నేను మీ ఇంటిని వదిలిపెట్టి వెళ్ళిపోతు న్నాను. ఇన్నాళ్ళు నాకు మీ ఇంట్లో తల దాచుకోడానికి చోటిచ్చారు. నా కడుపుకు అంత అన్నం పెట్టారు. అందుకు మీకు కృతజ్ఞతలు చెప్పవలసిన అవసరం నాకు ఏమాత్రమూ లేదు.

ఎందుకంటే..ఒక పాలేరుకన్నా నేను ఎక్కువగానే మీ ఇంట్లో శ్రమపడ్డాను. మీకు ఊడిగం చేశాను. నా శ్రమను నువ్వు రూపాయల్లోకి మార్చి ఒక్కసారి పద్దు చూశావంటే మీరే నాకు ఋణపడి ఉంటారు. సిగ్గూ, ఆత్మాభిమానాలు ఉన్న మగాడిగా నన్ను ఇంట్లోంచి వెళ్ళిపోయి బతకమన్నావు.

అందుకోసమే వెళ్ళిపోతున్నాను. డబ్బు సంపాదించని నన్ను అసమర్థుడి వన్నావు. కానీ మావయ్యా...సమర్థతకు తార్కాణం డబ్బు సంపాదన కాదు. ఈ దేశంలో డబ్బును సునాయాసంగా సంపా దించడానికి లక్ష మార్గాలున్నాయి. నువ్వు కూడా సంపాదిస్తున్నావు. నీదీ ఓ సంపాదనేనా?

స్కూల్లో పిల్లలకు అర్థమయ్యేలా నువ్వు లెక్కలు చెప్పడంలేదు. వాళ్ళకి మాత్రం అర్థం కాకూడదనే నీ కోరిక. కారణం-క్లాసులో అర్థమైతే పిల్లలు మళ్ళీ నీదగ్గరకు ట్యూషనుకురారు. వాళ్ళు రాక పోతే మీ ఖజానాలు నిండవు. మావయ్యా! నువ్వు చేస్తున్న పనికీ, వ్యభిచారానికీ ఏమైనా భేదంవుందేమో ఆలోచించు. నీలాంటి టీచర్లు ఈ వ్యవస్థలో కోకొల్లలు.

ఎవడు తప్పుచేసినా క్షమించవచ్చు. కానీ భావితరపు నిర్మాతలు కావలసిన పిల్లలకు..విద్యను బోధించే విషయంలో అధ్యాపకుడు తప్పుచేస్తే ఎవరూ క్షమించ కూడదు. నీలాంటి అధ్యాపకుడు ఒక్కడు తప్పుచేస్తే వందమంది పిల్లల జీవితం నాశనమైపోతుంది.

నైతిక విలువలను విస్మరించి స్వార్థంతో ఒక అధ్యాపకుడుగా నువ్వు చేస్తున్న నేరం... అన్నివిధాలా ఉరిశిక్షకు అర్హమైనది. క్లాసుపుస్తకాలను కొనుక్కునే స్తోమత కూడా లేని పేదపిల్లలు నీకు వందలిచ్చి ట్యూషన్లు పెట్టుకోగలరా? ట్యూషన్లు చెప్పడం నేరమని నేను అనను.

కానీ అధ్యాపకుడిగా శక్తివంచన లేకుండా క్లాస్‌లో పాఠం చెప్పు. చెప్పినా అర్థంకాని తెలివితక్కువ పిల్లలెవరయినా వుంటే అప్పుడు వాళ్ళకు ట్యూషన్స్ చెప్పు. నీకు చదువు చెప్పిన మీ గురువులు ఆనాడు నీలాగే స్వార్థంతో విద్య బోధించి వుంటే నువ్వీ స్థాయికి వచ్చేవాడివేమో ఆలోచించు.

నేను దరిద్రుడినని, నేను ఏ ఇంట్లో కాలు పెడితే ఆ ఇల్లు నాశనమైపోతుందని అన్నావు. మీ ఇంట్లో పెట్టిన కాలును తీసేస్తున్నాను. కనుక మీ ఇల్లు ఇక నాశనం కాదనుకుంటాను. డబ్బే జీవితం అనుకునే నీకు... జీవితమంటే నువ్వను కొన్నది కాదనే విషయం తప్పక తెలిసె

వస్తుంది.

ఇట్లు
సారథి"

"ఏమిటి సారథీ! రాస్తున్నావు?" అడిగాడు లోపలి గదిలోంచి వచ్చిన మాధవరావు.

"నేను ఇంట్లోంచి వెళ్ళిపోతున్నట్లు మా మావయ్యకు వుత్తరం" చెప్పాడు సారథి.

"తీసుకో" అంటూ తన చేతిలోని డబ్బును సారథికి అందించాడు మాధవ రావు.

"మూడొందలిచ్చారు మాస్టారూ! నేను అడిగింది రెండొందలే" అన్నాడు సారథి డబ్బు లెక్కపెట్టి.

"ఫర్వాలేదు...వుంచు. అసలీ డబ్బు నీకు సరిపోదనుకుంటాను. హాస్టల్ ఫీజులు కూడా కట్టాలిగా"

"నా దగ్గర అయిదొందలు వుంది"

"అయిదొందలా... ఎక్కడిది?"

"వేపగింజలూ, కానగ గింజలూ, చేలల్లో దొరికిన వేరుసెనక్కాయలూ-- ఇవన్నీ సేకరించి ఇంట్లోవాళ్ళకి తెలియకుండా అప్పుడప్పుడు కుప్పయ్య శెట్టికి అమ్మి కొంత డబ్బు సంపాదించాను మాస్టారూ! నా జీవితంలో ఇంతవరకు మిగిలించుకున్న డబ్బు మొత్తం ఇదే" అన్నాడు సారథి.

"నీకు ఇంటర్వ్యూ రేపు వుదయమే గదా. నువ్వు వెంటనే బయలుదేరాలి. లేకుంటే ఇంటర్వ్యూ టైమ్‌కు వెళ్ళలేవు. ఇంత రాత్రివేళ బస్సులుండవేమో?"

"లారీలు బోలెడన్ని వెళుతుంటాయి"

"సరే... జాగ్రత్తగా వెళ్ళు. నువ్వెళు తున్నది టౌన్‌లోకి. అక్కడ ప్రతి పైసా ఆలోచించి ఖర్చుపెట్టాలి. నా దగ్గర తీసుకున్న డబ్బు గురించి ఆలోచించకు. కష్టపడి చదువుకో. అదే నేను కోరుకునేది"

"అలాగే మాస్టారూ!"

"చూడు సారథీ! యూనివర్సిటీ అంటే అదొక రంగుల ప్రపంచం. అక్కడెన్నో ఆకర్షణలు మనల్ని ప్రలోభపెడుతుం టాయి. కానీ ఏ ప్రలోభాలకూ మనం లొంగకుండా మన పరిధిల్లో మనము వుండాలి. హద్దులు మీరకూడదు"

"అలాగే"

"యూనివర్సిటీలో చేరిన తర్వాత నువ్వు అసలు అక్కడికెందుకు వెళ్ళావో ఆ విషయం నువ్వెప్పుడూ మరిచిపో కూడదు. జీవితం ఒక్కసారి జారిపోతే ఇక ఎన్నటికీ అది తిరిగిరాదు. పురోగమనమే దాని లక్షణం"

జాగ్రత్తగా వింటున్నాడు సారథి.

"యూనివర్సిటీలో మంచి లైబ్రరీ వుంటుంది. అందులో చాలా పుస్తకాలు వుంటాయి. తీరిక దొరికినప్పుడల్లా లైబ్రరీకి వెళ్ళి హాయిగా చదువుకో. మనిషికి మంచి పుస్తకానికి మించిన తోడు మరొకటిలేదు"

"అలాగే మాస్టారూ!"

"సారథీ! యూనివర్సిటీలో రకరకాల మనస్తత్వాంగలవాళ్ళుంటారు. అందరి మధ్య ఎలాగో సర్దుకుంటూ, అపాయకర మైన వ్యక్తులకు దూరంగా వుంటూ నీ పనేదో నువ్వు చేసుకోవాలి. నువ్వు బాగా చదువుకుని గోల్డ్‌మెడలిస్ట్‌వి కావాలి. మంచి మార్కులు తెచ్చుకుంటే నీకు రీసెర్చిలో సీటొస్తుంది. నెలకు ఏడెనిమిది వందలు ఫెలోషిప్ కూడా వస్తుందట. నువ్వు గొప్పవాడివైతే ఆనందపడేవాళ్ళలో నేను ప్రథముడిని" అన్నాడు మాధవ రావు.





"మాస్టారూ! మీరు చెప్పినట్లు నేనెప్పుడూ నా కర్తవ్యాన్ని విస్మరించను. ఏ ఆకర్షణకూ ప్రలోభపడకుండా నా పరిధిలో నేనుంటాను. తీరిక దొరికితే తప్పకుండా లైబ్రరీకి వెళ్ళి చదువుకుంటాను" అన్నాడు సారథి.

"నాకు తెలుసు సారథీ! జీవితం గూర్చి నీకు ఇంకొకరు చెప్పవలసిన పనిలేదు. నీ అంతట నువ్వే గ్రహించగలవు. అయినా నీపై అభిమానంతో ఇన్ని మాటలు చెప్పకుండా వుండలేకపోయాను. అన్నట్టు అడగడం మరిచాను...నీకున్నది ఒక జత బట్టలే గదూ?" అడిగాడు మాధవరావు.

అవునన్నట్టు తలాడించాడు సారథి. వెంటనే మాధవరావు గబగబా లోపలి గదిలోకి వెళ్ళి బీరువా తీసి ఒక షర్టూ, ప్యాంటూ తీసుకుని రెండు నిమిషాల్లో తిరిగొచ్చాడు. ఆయన చేతిలోని బట్టల వేపు ప్రశార్థకంగా చూశాడు సారథి.

"ఒక జత బట్టలతో ఆ యూనివర్సిటీలో ఎలా తిరుగుతావు? ఇవిగో...ఈ బట్టలు కూడా తీసుకో"

"మాస్టారూ! ఆ బట్టలు..."

"మా పెద్దబ్బాయివి.వాడికి కావాలంటే మళ్ళీ కుట్టిస్తాన్లే. ముందు నువ్వు వీటిని తీసుకో. టైమవుతోంది... తొందరగా బయలుదేరు మరి" అంటూ మాధవరావు బలవంతంగా ఆ బట్టలను సారథి చేతుల్లో పెట్టాడు.

"మాస్టారూ! అయినవాళ్ళు వుండీ.... నేను అనాథనయ్యాను. కానీ ఏ సంబంధమూ లేని మీరు నాపై ఇంతటి అభిమానం..." సారథి గొంతు సన్నం చేసింది.

"సారథీ...మనం మనుషులం! మన మధ్య అంతకన్నా మించిన సంబంధం వుండనవసరం లేదు" అంటూ సారథి భుజంపై చెయ్యివేసి కొంత దూరం వచ్చి వీడ్కోలు చెప్పాడు మాధవరావు.



3

ఉదయం ఏడు గంటలు కావస్తోంది. లారీ లోంచి దిగి...కుడిచేత్తో సూట్ కేస్ పట్టుకుని కొంతదూరం నడిచివచ్చి బస్టాండుకు ఎదురుగా వున్న రోడ్డుమీద చివరగా నిలబడ్డాడు సారథి. సూట్ కేస్ లోపల ఓ జత బట్టలూ, సర్టిఫికెట్లూ, కొన్ని పుస్తకాలూ ఉన్నాయి.

అటూ ఇటూ వేగంగా తిరుగుతున్న ఆటోలతో, రిక్షాలతో ఆ రోడ్డు అంత ఉదయాన్నే బాగా రద్దీగా వుంది. ఆ రోడ్డుకు ఇరువేపులా హోటళ్లూ..టీకొట్లూ.. మరుగుతున్న పాలు.. అద్దాల్లోపల తినుబండారాలు.. ఝుమ్మని మూగుతున్న ఈగలు.. గల్లా పెట్టెలోకి దూరుతున్న చిల్లర డబ్బులు...

ఆ పరిసరాలను చూస్తుంటే...నిశ్చలమైన సరోవరం లాంటి జనపథం నుండి.. జలపాతం లాంటి పట్టణంలోకి వచ్చి పడినట్లన్పించింది సారథికి. రాత్రంతా లారీలో జాగరణ చెయ్యడం వల్ల.. నిద్రలేక అతడి కళ్ళు మండుతున్నాయి.

"రిక్షా కావాలా సార్?" రిక్షాను తీసుకొచ్చి సారథి ముందు నిలబెట్టి అడిగాడు

రిక్షావాలా.

"అక్కర్లేదు" అన్నాడు సారథి.

"ఎక్కడికెళ్ళాలండీ?" మరో ఆటో వాడు ఆత్రుతతోవచ్చి అడిగాడు సారథిని.

"దగ్గరే...ఆటో వద్దు"

"సార్...కూలి సార్ కూలి" సారథి చేతిలోని సూట్ కేస్ వేపు ఆశగా చూశాడు పదేళ్ళ కుర్రాడు.

జీవన సమరాన్ని తిలకించాలంటే ఒక్క బస్టాండు దగ్గరికి వస్తేచాలు. ఎక్కడికో వెళ్ళవలసిన పనిలేదు. నిద్ర లేచింది మొదలు మనిషికి ఒకటే పరుగు.

రోడ్డుమీదే నిలబడి.... చొక్కా జేబు లోంచి ఇంటర్వ్యూ కార్డును చేతికి తీసు చూశాడు సారథి.ఇంటర్వ్యూ పదిన్నరకు. ఇంకా మూడు గంటలకంటే ఎక్కువే వ్యవధి వుంది. అంతవరకు తనెక్కడ వుండాలి?

ఈ వూళ్ళోగానీ, యూనివర్సిటీ హాస్టల్లోగానీ తనకు తెలిసినవాళ్ళెవరూ లేరు. ఇంటర్వ్యూకి సూట్ కేస్‌తో ఇలాగే వెళ్తే....అబ్బే ఎబ్బెట్టుగా వుంటుంది. తన అవతారం చూసినవాళ్ళంతా పగలబడి నవ్వుకుంటారు.

'నవ్విపోదురుగాక నాకేటి సిగ్గు?' అనుకోడానికి వీల్లేదు. పోనీ ఏదైనా లాడ్జిలో రూం తీసుకుంటే...అమ్మో! ఉన్న కాస్త డబ్బూ ఇలా హరించుకు పోతే...ఈ పట్టణంలో తనకెవరు సాయం చేస్తారు?

పైగా తను ఇంటి నుండి బయలు దేరేముందు.. ప్రతిపైసా ఆలోచించి ఖర్చు పెట్టమని, జాగ్రత్తగా వుండమని మాస్టారు తనను హెచ్చరించారు కూడా.

ఏంచేయాలోపాలుకపోక సారథి అలా ఆలోచనలలో పడిపోయాడు. ఇంతలో ఓ యువకుడు సారథికి దగ్గరగా వచ్చి నిలబడి 'ఎక్స్‌క్యూజ్ మీ సార్' అని వినయంగా అన్నాడు. ఆ యువకుడి వేపు సారథి ప్రశ్నార్థకంగా చూశాడు.

"యూనివర్సిటీకి వెళ్ళాలంటే ఎటు వేపు వెళ్ళాలి?" అడిగాడా యువకుడు.

"తెలియదండీ! నేనూ ఈ వూరికి కొత్త. మీలాగే నేనూ యూనివర్సిటీకి వెళ్ళాలి" అన్నాడు సారథి.

''అయితే మనిద్దరి గమ్యం ఒక్కటే అన్నమాట" అంటూ నవ్వాడా యువకుడు.

"కొంపదీసి నాలాగా మీరూ ఎం.ఏలో చేరడం కోసం రాలేదుగదా"

"ఎవరి కొంప తీసి రాలేదండీ! కొంప తియ్యకుండానే ఎం. ఏలో చేరడానికి వచ్చాను"

"భలే జోకేసారే'' అంటూ సారథి ఆ యువకుడి మాటకు పకపక నవ్వేశాడు.

"ఇంతకూ ఎం. ఏ ఏ బ్రాంచ్‌లో చేరడానికి వచ్చారు?'' ప్రశ్నించాడా యువకుడు.

"తెలుగు లిటరేచర్"

"తెలుగు లిటరేచరా?''

"అవును...ఏం?"

"ముందు తమ చేయి కలపండి గురువుగారూ! నా పేరు రాజు. నేనూ తెలుగు లిటరేచర్‌లో జాయినవడాని కొచ్చాను" అంటూ చేయి ముందుకు చాపాడు రాజు.

"నా పేరు సారథి" అంటూ సారథి కూడా రాజుతో కరచాలనం చేశాడు.

"వెరీగుడ్! ఒకే గూటి పక్షులం... గూడు చేరకముందే కలుసుకున్నాం. క్షమించండి గురువుగారూ''

"ఎందుకు?"

"మిమ్మల్ని కూడా పక్షుల్లో కలిపి సందుకు''

"భలేవారండీ మీరు''

"ఆల్ రైట్... ఈ శుభ సమయంలో మనం హోటల్లోకెళ్ళి వేడివేడిగా రెండు టీలు కొట్టేసి... ఆ తర్వాత యూనివర్సిటీకి వెళ్దాం రండి'' అంటూ రాజుముందుకు నడిచాడు.

సాంబశివరావు, అనసూయమ్మ సారథిని తిట్టిన తిట్లతోనే ఆ రాత్రి అతని కడుపు నిండిపోయింది. అన్నం తినడానికి కూడా సారథికి సయించలేదు. నిద్రలేని కారణంగా కళ్ళతో పాటు ఆకలికి కడుపు కూడా మండుతోంది సారథికి. అందుకే రాజు వెంట హోటల్లోకి ప్రవేశించాడు సారథి.

"ఇంతకూ మీదే వూరన్నారు?" సర్వర్ తెచ్చిన టీ గ్లాస్ అందుకుంటూ అడిగాడు సారథి.

"ఏ వూరూ అన్లేదు" అన్నాడు రాజు.

"పోనీ ఇప్పుడనండి"

''నేను దేశద్రిమ్మరిని గురువుగారూ! ఓచోట పుట్టాను. మరోచోట పెరిగాను. ఇంకోచోట చదువుకున్నాను. సెటిల్ అయ్యింది మాత్రం మరో చోట"

"ఏమిటో గురువుగారూ! మీరు చెప్పేది నాకేం అర్థం కావడంలేదు. సరే.. సిగరెట్ కాల్చండి" అంటూ టేబుల్‌పై తన వద్దనున్న గోల్డ్‌ఫ్లాక్ పాకెట్‌ను సారథి ముందుకు తోశాడు రాజు.

"అలవాటు లేదండీ"

"వాట్? అలవాటు లేదా? పోనీ డ్రింక్స్‌లాంటివేమన్నా...?" నవ్వాడు రాజు

"అదికూడా లేదు"

"పోనీ... పేకాట"

తల అడ్డంగా ఆడించాడు సారథి.

"లాభం లేదు గురువుగారూ! ఎవరో గానీ మిమ్మల్ని బాగా చెడగొట్టేశారు. బాగుచెయ్యడం కష్టమే"

రాజు మాటలకు సారథి నవ్వకుండా వుండలేకపోయాడు. సర్వర్ ఇచ్చిన టీ బిల్‌ను బలవంతంగా సారథి చేతిలోంచి లాక్కున్నాడు రాజు. అయిదు నిముషాల్లో వాళ్ళిద్దరూ హోటల్లోంచి బయటపడి రోడ్డు మీదకొచ్చారు.

"మీరు నేరుగా యూనివర్సిటీకి వెళ్తారా?" రాజు వేపు చూస్తూ అడిగాడు సారథి.

"అవును. మరి... మీరు?"

"నేను ఇంటర్వ్యూ టైంకొస్తాను"

"ఏం...ఈ లోగా వూళ్ళో ఎవర్నైనా కలవాలా?"

"అదేం లేదు. నాకు యూనివర్సిటీ హాస్టల్లో ఎవరూ తెలిసినవారు లేరండీ"

"అందుకని?''

"ఏదైనా లాడ్జిలో దిగి కాలకృత్యాలూ అవీ ముగించుకుని ఇంటర్వ్యూ టైంకి వద్దామనుకుంటున్నాను" అలా అనుకోక పోయినా పైకి మాత్రం అన్నాడు సారథి.

"లాడ్జిలో ఎందుకు గురువుగారూ! డబ్బు దండగ. మీరు నాతో రండి... యూనివర్సిటీ హాస్టల్లో ఓ గది మన కోసం ఎదురు చూస్తూ వుంటుంది" అన్నాడు రాజు.

"అబ్బే... ఎందుకులెండి"

"మీరు మొహమాటుపడు తున్నట్టున్నారు. చూడండి గురువుగారూ! మొహమాటమనేది మనిషిని ప్రపంచంలోకి ప్రవేశించనీయకుండా అడ్డుతగిలే ముళ్ళ కంచెలాంటిది. ఎలా వుంది మన కొటేషన్?" అన్నాడు రాజు.





పకపకా నవ్వేశాడు సారథి.

"మీరింకేం మాట్లాడకండి గురువు గారూ! నా వెంట హాస్టల్‌కి రండి..అంతే" అంటూ దూరంగా వున్న ఓ రిక్షా వాడిని రమ్మన్నట్టు చేయి విసరాడు రాజు.

"ఎక్కడికెళ్లాలి సార్?" రిక్షావాడి ప్రశ్న.

"యూనివర్సిటీ హాస్టల్‌కి...ఇద్దరం. ఎంత కావాలి?" ప్రశ్నించాడు రాజు.

"అయిదు రూపాయలివ్వండి సార్"

"ఆఁ...అ యి దు రూ పా య లా? ఎందుకయ్యా..హాస్టల్ ఇక్కడ దగ్గరేగా. మూడు రూపాయలిస్తాం" అన్నాడు రాజు.

"గిట్టదు సార్" అంటూ వెళ్లిపోయాడు వాడు.

"రాజుగారూ! మీకు యూనివర్సిటీ హాస్టల్ ఎంత దూరంలో ఉండేది కూడా తెలిసే నన్ను మొదట్లో ఎటు వెళ్లాలండీ అని అడిగారు...ఎందుకని?" అడిగాడు సారథి.

"నాకు హాస్టల్ తెలుసునని మీకెవరు చెప్పారు?"

"మీరే. ఇందాక రిక్షా వాడితో అన్నారుగా-హాస్టల్ ఇక్కడికి దగ్గరేనని"

"ఓస్..అదా! వట్టిదే గురువుగారూ! అలా మాట్లాడకుంటే... రిక్షా వాళ్ళు మనల్ని కళ్యాణకట్టలో గొరిగినట్టుగా గొరిగేస్తారు" అన్నాడు నవ్వుతూ రాజు.

ఇంతలో మరో రిక్షావాడు వచ్చాడు. నాలుగు రూపాయలకు బేరంకుదిరించుకుని ఇద్దరూ రిక్షా ఎక్కారు. పావుగంటలో రిక్షా యూనివర్సిటీ కాంపౌండ్‌లోకి ప్రవేశించి రీసెర్చ్ స్కాలర్స్ బ్లాక్ ముందు ఆగింది.

రిక్షావాడికి డబ్బులిచ్చేసి సూట్‌కేసులు అందుకుని సారథి, రాజు హాస్టల్లోకి ప్రవేశించారు. ప్రతి గదికీ వెలుపల తలుపు మీద ఆ గది నెంబరు పెయింట్‌తో వేయబడి వుంది. ఆ నంబర్లు చూసుకుంటూ ఓ గది ముందు ఆగాడు రాజు.

"ఇదే గురువుగారూ మన గది" అంటూ జేబులోంచి తాళం తీసి తలుపు తీశాడు రాజు.

"ఇది రీసెర్చ్ స్కాలర్స్ వుండే హాస్టల్. మా పక్క వూరబ్బాయి ఈ గదిలో వుంటూ ఫిజిక్స్‌లో రీసెర్చ్ చేస్తున్నాడు. ఇప్పుడతను మా వూళ్లో వున్నాడు. నేను ఎం.ఏ అడ్మిషన్ కోసం వస్తుంటే... తన గదిలో వుండమని రూం కీ ఇచ్చాడు" చెప్పాడు రాజు.

"రూం చాలా బాగుంది" సారథి అన్నాడు.

"రీసెర్చ్‌స్కాలర్స్ అంటే మేధావులు గదా. మరి మేధావులకు మంచి గదులు లేకపోతే బావుండదుగదా"

ఆ గది కాస్త విశాలంగానే వుంది. ఒక ఐరన్ కాట్, ఓ కుర్చీ, ఓ టేబులూ, ఒక బుక్‌షెల్ఫూ, అటాచ్డ్ బాత్‌రూం, లావెట్రీ...అన్ని సౌకర్యాలున్న ఆ గది సారథికి బాగా నచ్చింది. రీసెర్చ్‌స్కాలర్స్ అంటే పెద్దవాళ్లు గనుక వాళ్ళ గదులన్నీ కూడా ఇలాగే ఆధునికంగా వుంటాయి కాబోలు అనుకున్నాడు సారథి.

"మనం అడ్మిషన్ ఫీజు కట్టేసిన పిదప హాస్టల్ ఆఫీసుకెళ్ళి అప్లికేషన్ పెట్టుకోవాలి. వాళ్ళు మనకు హాస్టల్ సీటిచ్చి రూం అలాట్ చేసే సరికి రెండ్రోజులవుతుందట. మావూరిఅబ్బాయి చెప్పాడు. హాస్టల్లో మనకు రూం అలాట్ చేసేవరకు మన మజిలీ ఇక్కడే" అన్నాడు రాజు.

"మనకిచ్చే గదులు కూడా ఇలాగే



వుంటాయా?" అడిగాడు సారథి.

"ఇవి సింగిల్ రూమ్స్ గురువుగారూ! మనకు ఇచ్చే రూమ్స్ కూడా ఇలాగే వుంటాయి. కానీ ఇన్ని సౌకర్యాలు ఉండ వట. పైగా ఒక్కో రూంలో ఇద్దర్ని అలాట్ చేస్తారట. సరే...ముందు మనం కాలకృత్యాలు తీర్చుకుందాం"

అరగంటలో ఇద్దరూ ముఖాలు కడుక్కొని స్నానాలు ముగించారు. ఫ్యాన్ గాలికింద కూర్చునివుంటే సారథికి గాల్లో తేలిపోతున్నట్టుగా వుంది. బద్ధకం పూర్తిగా వదిలిపోయి మంచి హుషారు వచ్చింది. సర్టిఫికెట్స్ వున్న ఫైళ్ళను పట్టుకుని ఇద్దరూ హాస్టల్లోంచి బయట పడ్డారు.

ఆ రీసెర్చ్ స్కాలర్స్ హాస్టల్‌కు పక్కనే మరికొన్ని భవనాలున్నాయి. అవి కూడా హాస్టల్ భవనాలే. అందులో ఫస్టియర్, ఫైనలియర్ చదివే స్టూడెంట్స్ వుంటారు. ఉమెన్స్ హాస్టల్ మాత్రం అక్కడికి దూరంగానే వుంది.

"తొందరగా నడవండి గురువుగారూ"

"అంత అర్జంటేమిటి?"

"ఆకలి దంచేస్తోంది. కడుపు మండి పోతోంది. అర్జంటుగా ఏదైనా మెయ్యాలి" అన్నాడు రాజు.

"మెయ్యడమేమిటి?"

"గడ్డి. అంటే దానర్థం మనం పశువులని కాదు. ఈరోజుల్లో హోటళ్ళలో పెడు తున్నది అదేగా. ఇంతకూ యూనివర్సిటీ క్యాంటీన్ ఎక్కడుందో తెలియదు"



అంటూ ఎదురుగా వస్తున్న ఓ యువకుడి
అడిగాడు రాజు.

“నేరుగా వెళ్ళి ఎడంవేపు తిరగండి”
అంటూ అతడు క్యాంటిన్‌వు దా
చూపెట్టాడు.

అయిదు నిముషాల్లో క్యాంటిన్‌కి చే
రున్నారు ఇద్దరూ. కిటికీదగ్గర ఖాళీగావున్న

ఓ టేబుల్ ముందుకూర్చున్నారు. క్యాంటీన్ చాలా రద్దీగా వుంది. గోలగోలగా వుంది.

రకరకాల రంగుల చీరలు... ఆ చీరలు దాచలేని అందాలవేపు దొంగతనంగా చూస్తున్న యువకులు...ఫాషన్లూ, పాత జోకులూ బలవంతపు నవ్వులు...కొంటె చేష్టలు..కామెంట్లూకాలిపోతున్న సిగరెట్లూ వక్కపొడిపొట్లాలూ...ఇంకా ఎన్నెన్నో.

మాధవరావు చెప్పినట్లు యూనివర్సిటీ ఓ రంగుల ప్రపంచమేనన్పించింది సారథికి. ఇక్కడ రకరకాల వ్యక్తులు విభిన్న మనస్తత్వాలూ, తెలివైనవాళ్ళూ, తెలివితక్కువవాళ్ళూ, లెక్చరర్లు, రీడర్లు, ప్రొఫెసర్లు, మేధావులు శాస్త్రజ్ఞులు....

ఇందరిమధ్య తను రెండేళ్లు జీవించబోతున్నాడు. అలా అనుకోగానే సారథి హృదయమంతా ఆనందంతో నిండిపోయింది. రెగులర్ క్యాండెట్‌గా యూనివర్సిటీలో చదవాలనే కోరిక తీరుతున్నందుకు అతని సంతోషానికవధులు లేవు.

"యూనివర్సిటీలో చదువుకునే ఛాన్సు రావడం గొప్ప అదృష్టమే. మీరేమైనా చెప్పండి గురువుగారూ! ఒక మానవుడి చీకటి జీవితంలో స్టూడెంట్ లైఫ్ అనేది నిజంగా వెన్నెల రాత్రి. ఎలావుంది మన కొటేషన్?" అన్నాడు రాజు.

ఇంతలో సర్వర్ రెండు ప్లేట్లలో టిఫిన్ తీసుకువచ్చి వాళ్ళ ముందుంచాడు. ఆ క్యాంటీన్‌లో కూర్చునివున్న అమ్మాయిల జడల్లోంచి వ్యాపిస్తున్న మల్లెపూల పరిమళంతో కిచెన్‌రూంలోంచి వస్తున్న దోసెలవాసన ఢీకొంటోంది. రాజు, సారథి ప్లేట్సు అందుకుని టిఫిన్ తినసాగారు.

"గురువుగారూ...గురువుగారూ! ఆ సీన్ చూడండి" అంటూ రాజు ఉన్నట్టుండి టిఫిన్ తినడం ఆపి సారథిని తన ఎడం చేత్తో పొడిచి సైగచేశాడు.

తల పైకెత్తి చూశాడు సారథి.

వాళ్ళకు కొంతదూరంలో ఓ టేబుల్ దగ్గర చుట్టూ కూర్చుని కొందరబ్బాయిలూ, అమ్మాయిలూ టీలు తాగుతున్నారు. వాళ్లలో ఓ అబ్బాయి పచ్చరంగుచీర కట్టుకున్న అమ్మాయి చెవి పట్టుకుని సరదాగా గిల్లుతున్నాడు. మిగిలినవాళ్లు నవ్వుతున్నారు.

"ఏయ్ గోపీ! ఏమిటిది? ముందు చెవిని వదలవోయ్" అంటోంది ఆ పచ్చరంగు చీర.

"అంత సులభంగా వదిలిపెడతానా బుజ్జీ! ముందు సారీ చెప్పు" అంటున్నాడా అబ్బాయి.

ఆ క్యాంటీన్‌లో కూర్చున్న వాళ్ళందరూ వాళ్ళవేపు వింతగా చూస్తున్నారు. నవ్వుకుంటున్నారు. అయినా వాళ్లు సిగ్గుపడటంలేదు. పైగా అమ్మాయిలతో క్లోజ్‌గా వుండటమనేది అందరికీ చేతకాదన్నట్టు ఆ అబ్బాయి గర్వంగా ఫీలయిపోతున్నాడు.

ఛీ.... సిగ్గులేకుండా... ఇంతమంది ముందు. నిజంగా వీళ్లు మనుషులేనా? యూనివర్సిటీలో ఉన్నత విద్యనభ్యసిస్తూ వీళ్లు అలవరుచుకున్న సంస్కారం ఇదా? సరదాగా స్త్రీ పురుషులు ఉండటం తప్పు కాదు. కానీ ఇంత బహిరంగంగా...

"గురువుగారూ! చంద్రమతిని చదవేస్తే ఉన్నమతి కూడా పోయిందట. అలా వుంది వీళ్ళ వరస. ఇంత ఫార్వర్డ్‌గా ఉండాలంటే ఇక్కడ వీలుపడదు. ఇది అమెరికా కాదు సుమా...ఆంధ్రదేశం" అన్నాడు రాజు నవ్వుతూ.

"స్త్రీ పురుష తారతమ్యం అనేది





ఒకటుంది. మీరన్నట్టు ఆ తారతమ్యాన్ని తోసివెయ్యడానికి ఇది అమెరికా కాదు. పాశ్చాత్యుల సంస్కృతికీ, మన సంస్కృతికి తేడావుంది" అంటూ బేసిన్ దగ్గరకు వెళ్ళి చెయ్యి కడుక్కున్నాడు సారథి.

టిఫిన్ కార్యక్రమం ముగిసిపోగానే ఇద్దరూ క్యాంటిన్‌లోంచి వెలుపలికొచ్చారు.

యూనివర్సిటీ క్యాంటిన్‌కు దక్షిణం వేపు మెయిన్ బిల్డింగ్ వుంది. ఆ మెయిన్ బిల్డింగ్‌లో అడ్మిషన్ కార్యక్రమం జరుగు. తోంది. సారథి, రాజు మెయిన్ బిల్డింగ్ వద్దకువచ్చి ఎం.ఎకిఇంటర్‌వ్యూజరిగే రూం తెలుసుకుని ఇద్దరూ ఆ రూంలోకి వచ్చి ఓచోట కూర్చున్నారు.

ఆ రూంలో ఇంటర్‌వ్యూకి వచ్చిన వాళ్ళు సుమారు ముప్పయిమందివుంటారు. ఇంకా ఇంటర్‌వ్యూలు ప్రారంభం కాలేదు. ఎవరో ఇద్దరు ముగ్గురు పెద్దవాళ్ళు ఆ గది లోకి వచ్చి అందరి సర్టిఫికెట్లను వెరిఫై చేస్తున్నారు.

"ఇంటర్‌వ్యూ అంటే ఇది కేవలం వట్టిదేలెండి! అప్లయ్‌చేసిన ప్రతిఒక్కరికీ అడ్మిషన్ ఇస్తారు. తెలుగు ఎం.ఏ కదా. దీనికి పెద్ద డిమాండ్ వుండదు. ఇందులో చేరేవాళ్ళంతా ఇంకే బ్రాంచ్‌లోనూ సీటు దొరకనివాళ్ళని అర్థం" అన్నాడో యువకుడు.

"మీరూ ఆ బాపతేనా?" అడిగాడు సారథి.

"అబ్బే...నేనుఆ బాపతు కాదులెండి. నాకు తెలుగు సాహిత్యంపట్ల అభిరుచి ఎక్కువ. నాకు వేరే బ్రాంచ్‌లో సీటు వచ్చినా నేనీ తెలుగులోనే చేరుతున్నా నంటే...కారణం తెలుగుమీద నాకున్న అభిమానం. అసలు నాకు చిన్నప్పటి నుండి..."

అడ్డూ ఆపూ లేకుండా ఆ యువకుడు తెగ వాగేస్తున్నాడు. సారథి, రాజు కూర్చున్న బెంచీలోనే ఆ యువకుడూ కూర్చున్నాడు. అతను చెప్పేది వాళ్ళు ఎవరూ వినడంలేదు. అసలతడు ఎవరితో మాట్లాడుతున్నాడో సారథికి అర్థం కావడంలేదు.

అతడి వాగుడును భరించలేక తలను రెండు చేతులతో గట్టిగా పట్టుకున్నాడు రాజు. అయినా రాజు బాధను గ్రహించే స్థితిలో లేడా యువకుడు.

తెలుగు సాహిత్యంపట్ల తనకు ప్రత్యేక మైన అభిమానం వున్నట్టు, అందులోనూ ఆధునిక సాహిత్యంలో తనకు గొప్ప అభినివేశంవున్నట్టు ఆ యువకుడు సొంత డబ్బా మితిమీరి వాయించుకుంటున్నాడు. తనకు పుష్కలమైన విమర్శనాదృష్టి ఉన్నట్టు పరోక్షంగా ప్రకటిస్తున్నాడు.

"ఏమిటోనండీ! ఈ ఇంటర్‌వ్యూల గొడవా, ఈ మనుషుల హడావుడి చూస్తుంటే 'చివరకు మిగిలేది'లో గోపీ చంద్ చెప్పినట్లుగా..."

"'చివరకు మిగిలేది'రాసింది గోపీచంద్ కాదండీ...బుచ్చిబాబు" అంటూ సారథి నవ్వడంతో ఆ యువకుని నోరు హఠాత్తుగా మూతబడిపోయింది.

ఆ రూంలో అబ్బాయిలతో పాటు ఎం.ఎలో చేరడానికి వచ్చిన అమ్మాయిలు కూడా ఓ పదిమంది దాకా వున్నారు. ఆ సీతాకోకచిలుకల వేపు కొందరదేపనిగా చూస్తున్నారు.

"గురువుగారూ! వీళ్ళంతా మనతో పాటు చదువుకోబోయేసహవిద్యార్థినులా?" అడిగాడు రాజు.

"అలాగే ఉన్నారు"

ఆ గది వెలుపల వరండాలో గుంపుగా నిలబడి ఫైనలియర్ అబ్బాయిలు లోపలికి తొంగి తొంగి చూస్తున్నారు. సీనియర్స్ అని పోజులు కొడుతున్నారు.

"వీళ్ళంతా ప్రీవియస్‌లో చేరబోయే స్టూడెంట్లా?" అన్నాడొకడు వెలుపలి గుంపులోంచి.

"అతడా మాట ఎందుకన్నాడో తెలుసా గురువుగారూ! 'మేం ఫైనలియర్ వాళ్ళం' అనే విషయాన్ని మనకు ఇన్‌డైరెక్ట్‌గా తెలియపరచడం కోసం" అన్నాడు రాజు.

ఇంతలో ఇంటర్‌వ్యూ ప్రారంభమైంది. అప్పటికే సారథి, రాజు తమ సర్టిఫికెట్స్‌ను వెరిఫై చేయించుకున్నారు. సారథికి పిలుపు రావడంతో ఫైల్‌ని పట్టుకుని... ఆ రూం లోంచి ఇంటర్‌వ్యూలు జరిగే పక్కరూం లోకి ప్రవేశించాడు సారథి.

ఆ గది చాలా విశాలంగా వుంది. అందులో తెలుగు ప్రొఫెసరూ, తెలుగు రీడర్ ఇద్దరూ కూర్చుని వున్నారు. వాళ్ళ వద్దకు వెళ్ళి విష్ చేశాడు సారథి. కూర్చో అన్నట్లుగా ప్రొఫెసరు చేత్తో సైగ చెయ్యడంతో కుర్చీలో కూర్చున్నాడు సారథి.

తర్వాత ఊరూ, పేరూ బి.ఏలో ఏ గ్రూపూ మొదలైన ప్రశ్నలడిగాడు ప్రొఫెసరు.

"బి.ఏ ఎక్కడ చదివావు?" రీడర్ ప్రశ్న.

"ఇంటర్మీడియట్, బి. ఏ. రెండూ నేను ప్రయివేట్‌గానే చదివాను సార్" సారథి జవాబు.

"ఎం.ఏ కూడా ప్రయివేటుగానే చదవ లేకపోయావా?" అన్నాడు రీడర్.

ఆ మాటతో సారథి మనస్సు చివుక్కుమంది. ప్రొఫెసర్ ఇందాక తనను బహువచనంతో సంబోధిస్తే... రీడర్ మాత్రం సారథిని ఏకవచనంతోనే సంబోధించాడు.

రీడర్ మాట్లాడే పద్ధతీ అదీ చూస్తుంటే.. అతనిపై సారథికి సదభిప్రాయం ఏర్పడ లేదు. 'మర్యాద తెలియని మనిషిలా ఉన్నాడు' అనుకున్నాడు సారథి.

"సరే... ఇక వెళ్ళి మీరు అడ్మిషన్ ఫీజు కట్టెయ్యండి" అన్నాడు ప్రొఫెసర్.

సారథి గదిలోంచి వెలుపలికొచ్చాడు. రాజు కూడా వస్తే... ఇద్దరూ కలిసి ఫీజు కట్టవచ్చు--అని అనుకుంటూ రాజుకోసం ఎదురుచూస్తూ వరండాలో నిలబడ్డాడు సారథి.

పది నిముషాల్లో రాజుకు పిలుపు రావడం... అతడు ఇంటర్‌వ్యూ గదిలోకి వెళ్ళడం... ప్రొఫెసర్ అతడిని సారథిని అడిగిన ప్రశ్నలే అడగటం... అన్నీ చకచకా జరిగిపోయాయి.

"రండి గురువుగారూ! వెళ్ళి అడ్మిషన్ ఫీజు కట్టేదాం'' అన్నాడు రాజు వరండా లోకి వచ్చి.

"నేనూ మీ కోసమే ఎదురుచూస్తున్నా. పదండి మరి'' అన్నాడు సారథి.

ఇద్దరూ వెళ్ళి పావుగంటలో అడ్మిషన్ ఫీజు కట్టేశారు. తర్వాత ఆ ఫీజు కట్టిన రిసీట్స్ తీసుకుపోయి హాస్టల్ ఆఫీసులో చూపెడితే వాళ్ళు రెండు అప్లికేషన్స్ ఇచ్చారు.

ఆ అప్లికేషన్స్ ఫిలప్ చేసి ఆఫీస్‌లో ఇచ్చిపోతే... మరుసటిరోజు సాయంత్రం వాళ్ళకు హాస్టల్లో సీటు దొరికింది. తమకు రూం అలాట్ చెయ్యగానే రీసెర్చ్ స్కాలర్స్ హాస్టల్‌నుండి సారథి, రాజులు తమ మకాం ఎత్తేశారు.







4

రాజు సారథిలకు అలాట్ చేసిన గది నంబర్ అరవై. అది అప్‌స్టెయిర్లో ఓ మూలగా వుంది. మంచి గాలీ వెలుతురూ వస్తుంది. గది పెద్ద విశాలంగా లేక పోయినా...ఇద్దరు వ్యక్తులు ఉండటానికి వీలుగా వుంది.

రూం సర్దుకున్న తర్వాత సారథి, రాజు బజారుకెళ్ళి గదిలోకి అవసరమైన వస్తువుల్ని కొనుక్కువచ్చారు. తన సూట్ కేస్‌లో వున్న పుస్తకాలను తీసి షెల్ఫ్‌లో శుభ్రంగా అమర్చాడు సారథి. బజార్లో కొనుక్కువచ్చిన సీనరీస్‌ను గోడలకు తగిలించాడు రాజు.

మరుసటిరోజునుండి క్లాసులు ప్రారంభ మయ్యాయి. ఆ ఉదయం....నోట్ బుక్‌ను చేతపట్టుకుని కాలేజీకి వెళుతుంటే... అనిర్వచనీయమైన ఆనందంతో అతడి హృదయం ఉప్పొంగిపోయింది. అయిదేళ్ళ తర్వాత అలా క్లాసుకు వెళ్ళడం అదో చెప్పలేని అనుభూతి. ఒకే బెంచీలో కూర్చున్నారు రాజు, సారథి.

"నా పేరు శివరామశాస్త్రి. నేను మీకు ఈ ఫస్టియర్లో తెలుగు వ్యాకరణం, అలంకారశాస్త్రం, ఛందస్సు బోధిస్తాను. నా క్లాస్‌లు మీకు వారానికి అయిదు వుంటాయి. సరే... ఇక మీ పేర్లూ ఊర్లూ, మీ హాబీల గురించి ఒక్కొక్కరే పైకి లేచి చెప్పండి" అన్నాడు మొట్టమొదటగా క్లాస్‌రూంలోకి ప్రవేశించిన శివరామశాస్త్రి.

ఆ క్లాస్ రూంలో రెండు వరుసల్లో బెంచీలున్నాయి. ఓ వరుస ఉత్తరంవేపున, మరో వరుస దక్షిణం వేపున ఉన్నాయి. రెండు వరుసలకు మధ్య మనుషులు తిరిగేందుకు వీలుగా దారి ఉంది. ఒక్కొక్క వరుసలో అయిదు బెంచీలున్నాయి. దక్షిణం వేపున గల బెంచీలలో అబ్బాయిలు కూర్చున్నారు.

ఉత్తరం వేపునున్న వరుసలోని మొదటి మూడు బెంచీలలో అమ్మాయిలూ, అదే వరుసలోఆఖరునగల రెండు బెంచీలలో కొందరబ్బాయిలు కూర్చున్నారు. సారథి, రాజు అమ్మాయిల వెనుక బెంచీలో కూర్చున్నారు.

పరిచయాలు అమ్మాయిల వేపు నుండి ప్రారంభమయ్యాయి. ఒక్కొక్కరే పైకి లేచి తన పేరు ఊరూ తనకున్న హాబీల గురించి చెబుతున్నారు. పైకి లేచి తమ పరిచయం గురించి చెబుతున్న అమ్మాయి వేపు చూస్తూ కొందరబ్బాయిలు ఎవరిని ప్రేమిద్దామా అని మనసుల్లో సెలెక్ట్ చేసుకుంటున్నారు.

"నా పేరు పరిమళ" అందో అమ్మాయి.

రాజు వెంటనే ఆ అమ్మాయి వేపు చూసి, ముక్కులతో వాసన ఎగదీసి.- "లాభంలేదుగురువుగారూ నాకైతే ఎలాంటి పరిమళమూ రావడంలేదు" అని సారథి చెవిలో మెల్లగా అన్నాడు.

సారథి బలవంతంగా నవ్వాపు కున్నాడు.

"నా పేరు ధరణికోట దామోదరం" అంటూ లేచి నిలబడి చెప్పాడొక యువకుడు.

ఆ యువకుడిని చూసి ఉలిక్కి పడ్డాడు రాజు. మొన్న 'ఇంటర్వ్యూనాడు పక్కన కూర్చుని తెగవాగి తలనొప్పి పుట్టించిన మహానుభావా! ఈ రెండేళ్ళూ నన్ను మాత్రం వదిలేయ్' – అని మనసులో అనుకున్నాడు రాజు.

"ప్రముఖ తెలుగు నవలా రచయిత లాగా 'ధరణికోట' అని పేరు ముందు ఆ ఇంటి పేరు చేర్చడమెందుకు? చాలా సింపుల్‌గా తమరి ఇన్షియల్ చెబితే సరిపోతుందిగా'' అంటూ సారథి చెవిలో మెల్లగా గొణిగాడు రాజు.

"ఇక హాబీలు ..." అన్నాడు దామోదరం.

''ఒక్కటేసు త్రెయ్యడం" గొణిగాడు రాజు.

"అప్పుడప్పుడూ కథలూ, కవితలూ, వ్యాసాలూ రాయడం" చెప్పాడు దామోదరం.

''ఏవైనా ప్రచురింపబడ్డాయా?" లెక్చరర్ ప్రశ్న.

"ఇప్పటివరకూ లేదు"

'మంచిది. తెలుగు పాఠకుల్ని బతికించావు' అని మనసులో అనుకున్నాడు రాజు.

తర్వాత మరో యువకుడి పరిచయమైంది. అతని తర్వాత రాజు వంతు వచ్చింది.

"నా పేరు టి. వి. రాజు. హాబీలు... నేను నవలలూ, కథలూ, కవితలూ..." అని చెప్పడం క్షణం ఆపి–''రాయను, చదవను" రాజు అలా అనగానే అందరూ గొల్లున నవ్వారు.

ఒక్క దామోదరం మాత్రం నవ్వకుండా ముఖం మాడ్చుకున్నాడు.

ఎందుకో కావాలని...తనకు వ్యతిరేకంగా తనను అవహేళన చేసే ఉద్దేశంతోనే రాజు అలా చెప్పినట్లుగా దామోదరంకు అన్పించింది.

సారథి కూడా పైకి లేచి ఊరూ, పేరూ చెప్పి, ఆధునిక తెలుగు సాహిత్యం లోని విభిన్న ప్రక్రియలకు సంబంధించిన పుస్తకాలను చదవడం హాబీగా చెప్పి కూర్చున్నాడు. తర్వాత మరో ఇరవై నిముషాల్లో అందరి పరిచయాలూ ముగిశాయి.

"ఆల్ రైట్...మీరంతా ఇక వెళ్లిపోవచ్చు. ఇవాళ మీకు ఫస్ట్‌డే గనుక ఇవాళ్టికి ఇక క్లాసులుండవు. మీరు మధ్యాహ్నం కూడా రానవసరం లేదు. రేపటినుండి మాత్రం క్లాసులు రెగ్యులర్‌గా జరుగుతాయి" అని చెప్పి ఆ లెక్చరర్ క్లాస్‌లోంచి వెళ్లిపోయాడు.

స్టూడెంట్స్ కూడా క్లాస్ రూంలోంచి వెలుపలికి వచ్చి తిరుగుముఖం పట్టారు. అమ్మాయిలు ఉమెన్స్ హాస్టల్ వేపు నడక సాగించారు. అబ్బాయిలు కొందరు క్యాంటిన్‌వేపు,మరికొందరు తమ హాస్టల్స్ వేపు వెళ్ళసాగారు.

"గురువుగారూ! ఇప్పుడు మనం హాస్టల్‌కు వెళ్ళి చేసేదేముంది. అలా క్యాంటిన్‌కెళ్లి టీ తాగి వద్దాం...పదండి" క్యాంటిన్ వేపు చూపిస్తూ అన్నాడు రాజు.

''ఓకే" అన్నాడు సారథి.

ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ క్యాంటిన్ చేరుకున్నారు. ఆ క్యాంటిన్‌లో కేవలం టిఫినూ టీలూ కాఫీలేగాక సిగరెట్లు, వక్కపొడి పొట్లాలూ, అరటి పళ్ళూ,బిస్కెట్లూ మొదలైనవి కూడా దొరుకుతాయి.

''రాజుగారూ! నిజంగానే మీకు నవలలూ, కథలూ, కవిత్వాలూ చదివే అలవాటు లేదా?" టీ కప్పును చేతికి




అందుకుంటూ అడిగాడు సారథి.

"నాకా? ఎందుకు లేదండీ! నేను ప్రతి పత్రికలో వచ్చే సీరియల్స్, కథలూ విడవకుండా చదువుతాను'' అంటూ సిగరెట్ వెలిగించాడు రాజు.

''అయితే ఇందాక క్లాసులో..."

''ఎందుకలా చెప్పినట్టు అని కదూ మీ ప్రశ్న. కావాలనే...కాస్త వెరైటీగా ఉంటుందని అలా చెప్పాను"

"మీరు గొప్ప అదృష్టవంతులు రాజు గారూ"

"అదేంటి గురువుగారూ...అలా అంటారు?''

''మీరు హాయిగా నవ్వేస్తూ బతికెయ్యడమేగాక మీ చుట్టూ వున్నవాళ్ళని కూడా నవ్విస్తారు''

''చూడండీ! మనం పుట్టినప్పుడు నవ్వుతూ పుట్టలేదు. చచ్చేటప్పుడు నవ్వుతూ చావబోము. కనీసం ఈమధ్య కాలంలోనైనా నవ్వకపోతే ఎలా? అసలు నవ్వు అంటే.... పెదవుల తీగెల మీద వికసించే జాజిపువ్వు. ఎలావుంది గురువు గారూ! నవ్వుకు సంబంధించిన మన కొటేషన్?" నవ్వుతూ అన్నాడు రాజు.

''అద్భుతంగావుంది. అన్నట్టు... కవిత్వం రాయకూడదూ మీరు"అన్నాడు సారథి.

''రాద్దామనే అనుకున్నాను. కానీ చస్తారేమోనని విరమించుకున్నాను''

"ఎవరు?''

"చదివిన పాఠకులు"

రాజు అన్న ఆ మాటకు సారథి పక పక నవ్వేశాడు. టీ తాగడం ముగించి ఇద్దరూ పైకి లేచారు.

''బిల్లు ఇటివ్వండి గురువుగారూ" అంటూ టీ బిల్ కోసం చేయి చాచాడు రాజు.

"ఆఁ...గాడిద గుడ్డు. నేనిస్తాన్లెండి"

''వాళ్ల తీసుకోరనుకుంటాను''

''ఏమిటి?"

''గాడిద గుడ్డును" రాజు అలా అనగానే సారథి పొట్టచెక్కలయ్యేలా నవ్వేశాడు.

''సరే...ఇప్పుడెక్కడికి వెళ్దాం?"

"హాస్టల్‌కు" అన్నాడు రాజు.

"హాస్టల్‌కెందుకులెండి. యూనివర్శిటీ లైబ్రరీకి వెళ్ళొద్దాం" అన్నాడు సారథి.

"లైబ్రరీకా? అమ్మబాబోయ్! గురువు గారూ నన్నొదిలేయండి. బుక్స్‌ని చూస్తే నాకు భయం"

"సరే...అయితే మీరు హాస్టల్‌కు వెళ్ళండి. నేను లైబ్రరీకి వెళ్లొస్తాను"

"అలాగే. తొందరగా వచ్చేయండి. అక్కడ బూజుపట్టిన పుస్తకాల్ని మాత్రం నమలకండి" అంటూ హాస్టల్ వేపు నడక సాగించాడు రాజు.

లైబ్రరీ లోపలికి అడుగుపెట్టాడు సారథి.

లోపల అంతా నిశ్శబ్దంగా వుంది. అంతులేని జ్ఞాన సంపదను తమలో దాచుకున్న వేదాంతుల్లాఉన్నాయిఅక్కడి పుస్తకాలు. ఎటు చూసినా బీరువాల నిండా పుస్తకాలు.

తెలుగు పుస్తకాలుండే సెక్షన్ వేపు నడక సాగించాడు సారథి. ఆ సెక్షన్ తలుపులు మాత్రం తెరవబడి వున్నాయి. లోపల ఎవరూ అగుపించలేదు సారథికి. మోడరన్‌పొయిట్రీకిసంబంధించిన బుక్స్ ఏవైనా ఉన్నాయేమో చూద్దామని మెల్లగా ఓ రాక్ వద్దకు వెళ్లి నిలబడి బుక్స్ చూడసాగాడు సారథి.

ఇంతలో ఉన్నట్టుండి మెల్లగా ఏదో







చప్పుడు విన్పించిందతనికి. వెంటనే రాక్‌లోని పుస్తకాల సందుల్లోంచి అటు వేపు చూసిన సారథి... ఆ దృశ్యం చూసి అవాక్కైపోయాడు. అక్కడ... ఓ చోట ఓ అబ్బాయి ఓ అమ్మాయిని అమాంతంగా వాటేసుకుని వున్నాడు. కౌగిలిలోంచి విడిపించుకునే ప్రయత్నం చేస్తోందా అమ్మాయి.

కౌగిలిలోంచి విడిపించుకున్న ఆ అమ్మాయి చేతిలోని కర్చీఫ్‌తో బుగ్గను తుడుచుకుంటూ చిలిపిగా అబ్బాయి తలపై మొట్టింది. యూనివర్సిటీ స్టూడెంట్స్ లైబ్రరీని ఎంత బాగా ఉపయోగించుకుంటున్నారో ఆ క్షణంలో సారథికి అరమైపోయింది.



వాళ్ళ ఏకాంతానికి భంగం కలిగించడం ఇష్టంలేక వెంటనే చప్పుడు చేయకుండా అక్కడినుండి బయటకు నడిచాడు సారథి. యూనివర్సిటీ స్టూడెంట్స్ గురించి గతంలో అతడు ఏర్పరచుకున్న అభిప్రాయాలు ఒక్కొక్కటే జారిపోతున్నాయి. అంతే మరి...దిగితేగానీ లోతు తెలియదు.

ఈ యూనివర్సిటీ లైబ్రరీలోని పుస్తకాలు ఎంతమందికి జ్ఞానాన్ని ప్రసాదించాయో, ఎంతమంది విద్యార్థుల్ని మేధావులుగా తీర్చిదిద్దాయో, ఎంతమంది మేధావుల ఆలోచనలను–అభిప్రాయాలను తమలో దాచుకున్నాయో.

అటువంటి పుస్తకాలున్న పవిత్రమైన ఈ ఆలయంలో ఇలాంటి సిగ్గుమాలిన పనులా చెయ్యడం. ఛీఛీ...స్త్రీ పురుషులు పరస్పరం ప్రేమించుకోవడం న్యాయమే. ప్రణయ కలాపాలు సాగించడం న్యాయమే. కానీ అందుకు వేదిక ఇలాంటి పవిత్రమైన స్థలమా?

చదువుకోడానికి లైబ్రరీకి వచ్చిన వాళ్ళ కంటికి ఇలాంటి దృశ్యం

అగుపిస్తే మళ్లీ పుస్తకంపై మనసు లగ్నం కాగలదా? ఇలాంటి కార్యకలాపాలు సాగించడానికి ఇంతకు మించిన మరో ప్రదేశం వీళ్ళకు దొరకలేదా? – అలా ఆలోచిస్తూ హాస్టల్ చేరుకున్న సారథిని చూసి ఆశ్చర్యపోయాడు రాజు.

"అదేంటి గురువుగారూ..లైబ్రరీనుంచి అప్పుడే తిరిగొచ్చేసారు ?" అడిగాడు రాజు.

"అక్కడుండ బుద్ధి కాలేదు"

"ఎందుకని?"

తను లైబ్రరీలో చూసిన దృశ్యం గురించి చెప్పాడు సారథి. అది విని పకపక నవ్వేశాడు రాజు.

"ఏమిటో గురువుగారూ...పీత బాధలు పీతవి"

సారథి బట్టలు మార్చుకుని ఫ్యాన్ స్విచ్‌ని ఆన్‌చేసి కుర్చీలో జారగిల పడుకున్నాడు.

"మే ఆయ్ కమిన్ సార్" అంటూ వాకిలి ముందుకొచ్చి నిలబడ్డాడు దామోదరం.

'చచ్చాం' అనుకున్నాడు రాజు.

"హిరా దామోదరంగారూ...లోపలికి రండి" ఆహ్వానించాడు సారథి.

"ఆధునిక సాహిత్యాన్ని చదవడం మీ హాబీ అని మీరు ఇందాక క్లాస్‌లో చెప్పినప్పుడు నాకు చాలా సంతోషం వేసింది సారథిగారూ! నిజం చెప్పాలంటే నాక్కూడా..." అంటూ ప్రారంభించాడు దామోదరం.

"గురువుగారూ...నేనిప్పుడే వస్తాను" అంటూ అక్కడినుండి తప్పించుకోడానికి పైకిలేచాడు రాజు. కూర్చో అన్నట్టు కళ్ళతోటే సంజ్ఞచేశాడు సారథి.

"మీరు ఏ రూంలో వుంటున్నారు?"

"నేనాండీ..కింద ఇరవై రెండో నంబరు గదిలో" అన్నాడు దామోదరం కాట్ మీద కూర్చుంటూ.

"మీ రూమ్మేటు ఎవరు?"

"శర్మ అని మన తెలుగు డిపార్ట్‌మెంటే"

"అన్నట్టు సారథిగారూ! మీరు తిలక్ పొయిట్రీని చదివారో లేదోగానీ... చాలా చక్కటి కవిత్వం. ఆనందింపతగ్గ విషయం ఏమిటంటే...మనకు ఎం.ఏ. ఫస్టియర్లో 'అమృతం కురిసిన రాత్రి'ని మోడరన్ పొయిట్రీగా పెట్టారు. మీరు సిలబస్ చూశారా?'' సారథి వేపు చూసి అడిగాడు దామోదరం.

"లేదండీ....నేనింకా సిలబస్ నోట్ చేసుకోలేదు. పనికిమాలిన పుస్తకాలను గాకుండా 'అమృతం కురిసిన రాత్రి'ని పెట్టడం సంతోషమే" అన్నాడు సారథి.

"తిలక్ తర్వాత తెలుగులో అంత మంచి కవి లేడనిపిస్తుంది నాకు. ఎంత అభ్యుదయ దృక్పథం కలవాడాయన" అంటూ తిలక్ కవిత్వాన్ని ఆపోసన పట్టినవాడిలా మాట్లాడసాగాడు దామోదరం.

"అంటే దామోదరంగారూ....తిలక్ ఏ కోవకు చెందిన కవి అని మీ అభిప్రాయం?"

"అభ్యుదయ కవుల కోవకు చెందిన వాడు''

''మీ అభిప్రాయంతో నేను ఏకీభవించలేను''

"ఎందుకని?" అడిగాడు దామోదరం.

"ఒక కవి ఏ కోవకు చెందినవాడు అనే అంశం ఆ కవియొక్క దృక్పథం మీదా... అతని హృదయతత్వంమీదా ఆధారపడి వుంటుంది. ఒప్పుకుంటారా




మీరు?''

''అవును"

''అదే నిజమైతే తిలక్‌లో రేఖా మాత్రంగా అభ్యుదయ భావాలు అగుపించినా...ఆయనను అభ్యుదయ కవుల కింద చేర్చలేము. తిలక్ వస్తుతః భావకవే"

''తిలక్ అభ్యుదయ కవి కాదని మీరెందుకు అనుకుంటున్నారో చెప్పగలరా?'' అడిగాడు దామోదరం.

''చెబుతాను. అభ్యుదయ కవుల దృక్పథానికీ, 'అమృతం కురిసిన రాత్రి' లోని కొన్ని గేయాల్లో కన్పించే తిలక్ దృక్పథానికీ చాలాభేదముంది. 'ప్రవల్లిక' అనే కవితలో తిలక్ స్త్రీని పెద్దపులితో పోల్చాడు. అభ్యుదయ దృక్పథంగల కవులెవరూ స్త్రీని ఇంత దారుణంగా పోల్చరు. 'ప్లస్ ఇంటూ మైనస్' అనే కవితలో పలాయనవాదం, మానవజాతి పురోగమనం మీద అపనమ్మకం అగుపిస్తుంది. ఇదంతా అభ్యుదయ దృక్పథానికి విరుద్ధం. కనుక దామోదరంగారూ! తిలక్‌లో మనకు అక్కడక్కడా, అభ్యుదయ భావాలు అగుపిస్తే అగుపించ, వచ్చుకానీ మౌలికంగా ఆయన భావకవే" అంటూ తిలక్ కవిత్వం గురించి అనర్గళంగా ఇరవై నిముషాలు మాట్లాడాడు సారథి.

అతడలా మాట్లాడుతుంటే... దామోదరం నోరు తెరుచుకుని వుండిపోయాడు. తిలక్ కవిత్వం గురించి సారథికి అంత బాగా తెలుసునని దామోదరం ఊహించలేకపోయాడు. తనకు అన్నీ తెలుసునని వట్టి పోజులు కొట్టడం తప్ప దామోదరంకు నిజానికి దేని గురించీ పెద్దగా తెలియదు.

"అన్నట్టు సారథిగారూ! మీరు ఈ పుస్తకం చదివారా?'' అంటూ ఓపుస్తకం పేరు చెప్పాడు దామోదరం.

"చదివానండీ"

"చాలా గొప్ప పుస్తకం కదూ?"

''ఏ విషయంలో గొప్పదండీ?"

"అంటే మీ ఉద్దేశం?''

''అంటే... ఆ పుస్తకం సాహిత్య రీత్యా గొప్పదా? లేక ఆరచయితసిద్ధాంత రీత్యా గొప్పదా?"

"రెండింటిలోనూ గొప్పదే" ఏం చెప్పాలో తెలియక గబుక్కున అనేశాడు దామోదరం. ఎందుకో అనవసరంగా తను ముళ్ళకంపల మధ్య ఇరుక్కుపోతున్నట్టు అన్పించింది దామోదరంకు.

"ఆ రచయితకు ఓ సిద్ధాంతం వుంది. అతడు ఆ సిద్ధాంతానికి ఆ పుస్తకంలో ఓ రూపం ఇచ్చాడు. సిద్ధాంతరీత్యా ఆ పుస్తకంలో రచయిత ఉన్నతస్థాయిని చేరుకున్నాడు. కానీ సాహిత్యరీత్యా జారిపోయాడు. అందుకే ఆ పుస్తకం మేధకు ఆహ్లాదం కల్గించింది తప్ప హృదయానికి ఆహ్లాదం కల్గించలేకపోయింది"

"మేధకు ఆహ్లాదం ఆనందం కల్గిస్తే చాలదా? అది ఉత్తమ సాహిత్యంకాదా?" అడిగాడు దామోదరం.

"ఎన్నటికీ కాదు"

"ఎందుకని?" దామోదరం ప్రశ్న.

"మేధకు ఆహ్లాదం కల్గించేదల్లా ఉత్తమ సాహిత్యం అనుకుంటే... కౌటిల్యుడి అర్థశాస్త్రమూ, కారల్ మార్క్సుయొక్క గతితార్కిక భౌతికవాదమూ, వామనుడి 'రీతి'వాదమూ, ఆఖరికీ వార్తాపత్రికలూ...వీటన్నింటిని కూడా ఉత్తమ సాహిత్యంగానే మనం పరిగణింపవలసివుంటుంది" అన్నాడు సారథి.

"సరే...మళ్ళీ కలుద్దాలెండి. నాకు

కొంచెం పనుంది. మీరు మంచి విమర్శకుల్లా ఉన్నారు. మీతో పరిచయం కలగడం నిజంగా సంతోషం. మారూంకు కూడా అప్పుడప్పుడు మీరు వస్తూ వుండండి" అంటూ శెలవు తీసుకుని ఆ గదిలోంచి గబగబా బయటకు వెళ్ళిపోయాడు దామోదరం.

"గురువుగారూ! ఏమో అనుకున్నాను తమరు మహాఘటికుల్లా వున్నారే. సాహిత్యంలో మీకింత ప్రవేశముందని నేననుకోలేదు. ఇందాక వచ్చి వెళ్ళాడే ఆ దామోదరం ... అతడిని చూస్తే నాకేదో భయంగా వుంది" అన్నాడు రాజు.

"భయమా...దేనికి?"

"కథలు గట్రా రాస్తాడటగా. ఆ అముద్రిత రచనల భాండాగారాన్ని తెచ్చి మన ముందుంచి...చదివి విన్పిస్తాడేమో. పైగా అప్పుడప్పుడూ తన రూంకి వస్తుండమని చెప్పిపోయాడు'' అంటూ సిగరెట్ వెలిగించాడు రాజు.

''మనుషుల మనస్తత్వం రకరకాలు కదా. తనే తెలివైనవాడని...తన తెలివిని ప్రకటించుకోడానికి ప్రతిక్షణం ప్రయత్నాలు చేస్తుంటారు కొందరు. ఈ దామోదరం మనస్తత్వం కూడా అలాగే వున్నట్లుంది'' అన్నాడు సారథి.

"అన్నట్టు గురువుగారూ ... మనకు ప్రీవియస్‌లో మొత్తం ఎన్ని పేపర్లు వుంటాయి?" అడిగాడు రాజు.

''నాలుగు''

"ఏమిటో అవి?"

"ఓల్డ్ పొయిట్రీ, మోడరన్ పొయిట్రీ, డ్రామాలు కలిపి ఓ పేపర్. లింగ్విస్టిక్స్ రెండో పేపర్. హిస్టరీ ఆఫ్ తెలుగు లిటరేచర్ మూడో పేపర్. వ్యాకరణం, అలంకారాలూ, ఛందస్సూ ఆఖరి పేపర్"

"మీకు తెలుగు గ్రామర్ బాగా వచ్చా?" సారథివేపుచూసి అడిగాడురాజు.

"ఏం... మీకు రాదా?"

"బొత్తిగా రాదు. చిన్నయ్యసూరిని షూట్ చేసి పారేద్దామన్నంత కోపం నాకు"

ఇంతలో ఎం. ఏ ఫైనలియర్ స్టూడెంట్స్ ఇద్దరు ఆ రూంలోకి ప్రవేశించారు.

"నా పేరు రాజా, ఇతడి పేరు సుధాకర్. మేము మీ సీనియర్స్" అంటూ వాళ్ళిద్దరు తమకు తామే పరిచయం చేసుకున్నారు.

"రండి...కూర్చోండి" అంటూ కుర్చీలోంచి పైకిలేచి కాట్‌పై కూర్చున్నాడు సారథి.

"చూడండి ... మీరు యూనివర్సిటీకి కొత్త. ఇక్కడి విషయాల గురించి మీకు బొత్తిగా తెలియదు. ఇక్కడ ప్రతి దానికీ రాజకీయమే'' అన్నాడు రాజా.

సుధాకర్ మాత్రం... అదేపనిగా సీరియస్‌గా రాజువేపు చూస్తున్నాడు. అందుకు కారణం...జూనియరైన రాజు సీనియర్స్ ముందు సిగరెట్ తాగుతుండటమే.

యూనివర్సిటీలో జూనియర్స్ ముందు కొందరు సీనియర్ స్టూడెంట్స్ తామంతా గొప్ప మేధావులైపోయినట్టు, జూనియర్స్ అంతా తెలివితక్కువాళ్ళైనట్టు పోజులు కొట్టేస్తుంటారు.

జూనియర్ ఎవరైనా తమను విష్ చేయకపోయినా, తమ ముందు సిగరెట్ కాల్చినా, తమను గౌరవించకపోయినా సీనియర్స్ దాన్ని భరించలేరు. తమను గౌరవించని జూనియర్ స్టూడెంట్‌ని వాళ్లు బద్ధశత్రువులా చూస్తుంటారు.

ఇక రీసెర్చ్‌స్కాలర్స్ విషయం చెప్పనక్కర్లేదు. విజ్ఞానం మూర్తీభవించిన




వ్యక్తుల్లా చాలామంది ప్రతి నిముషం తమ స్థాయి చాలా గొప్పది అన్నట్టుగా మేక పోతు గాంభీర్యాన్ని ప్రదర్శిస్తుంటారు. ఉమెన్స్ హాస్టల్లోనైతే... ప్రతి జూనియర్ అమ్మాయి సీనియర్ అమ్మాయిల్ని 'అక్కయ్యా' అంటూ గౌరవంగా సంబోధించి తీరవలసిందే.

"చూడండీ! మీరు ఇక్కడ సీనియర్స్‌ను గౌరవించాలి. హిప్పీ క్రాపులూ, హైహీల్స్ బూట్లూ, టంగ్‌లూ, కళ్ళజోడు స్టయిల్‌గా పెట్టుకో వటాలూ-ఇలాంటి ఆడంబరాలన్నీ మన ప్రొఫెసర్‌కు నచ్చవు. కనుక వీలైనంత వరకు మీరు సింపుల్‌గా ఉండాలి. లేకపోతే..." చెప్పడం ఆపేశాడు సుధాకర్.

"లేకపోతే..." అన్నాడు సారథి.

"లేకపోతే ... మన మార్కులు ప్రొఫెసర్ చేతిలో వుంటాయి" అన్నాడు రాజా.

"చెప్పండి...ఆగిపోయారేం?"

"చెప్పడమెందుకు.ఫలితం ఆలస్యంగా మీకే తెలుస్తుంది" అన్నాడు సుధాకర్.

"అంటే ... ఆడంబరంగా స్టయిల్‌గా వస్తే ప్రొఫెసర్ మార్కులు కోసేస్తాడు. అదేగా మీరు చెప్పదలుచుకుంది" అన్నాడు రాజు సిగరెట్ ముక్కను పారేస్తూ.

అవునన్నట్టు తలాడించాడు రాజా.

''చెప్పాడా?" ప్రశ్నించాడు రాజు.

"అలాంటివి ఎవరూ చెప్పరు. కేవలం మనం గ్రహించాలి... అంతే" అన్నాడు సుధాకర్.

"నాకో చిన్న సందేహం'' సారథి అన్నాడు.

"అడగండి"

"క్లాసుకు ఆడంబరంగా వస్తే ప్రొఫెసర్‌కి నచ్చదని. ఆయన మార్కులు కత్తిరించేస్తాడని అంటున్నారు మీరు. పోనీ చాలా సింపుల్‌గా వస్తే ఫస్ట్‌రాంక్ ఇస్తాడేమో చెప్పండి. అదే నిజమైతే మేమిద్దరం రేపటినుండి చాలా సింపుల్‌గా గోచీలు పెట్టుకుని యోగి వేమనలా క్లాస్‌కువస్తాం" అన్నాడు సారథి.

సారథి ఆ మాట అనడంతో గొల్లున నవ్వేశాడు రాజు. ఆ సీనియర్స్ ముఖం కందగడ్డలా మారిపోయింది. జూనియర్స్ అంత నిర్లక్ష్యంగా మాట్లాడటం వాళ్లు సహించలేకపోయారు. 'ఎంత గర్వం' అనుకుంటూ వాళ్లు గబగబా రూంలోంచి వెళ్లిపోయారు.

"అబ్బ...!భలే దెబ్బకొట్టారు గురువు గారూ! నిజంగా వాళ్ల ముఖాలు జీరో క్యాండిల్స్ అయిపోయాయి. బుద్ధుంటే మళ్లీ మన రూంకు రారు. వాళ్లు సీనియర్స్ అట. మనం వాళ్లని గౌరవించాలట. మన రూంకి వస్తున్నట్టుగా ముందుగా తెలియ చేసుంటే పూలదండలు కొని పెట్టుండే వాళ్ళం" అన్నాడు రాజు.

"ప్రొఫెసరు ఎలాంటివాడో మనకు తెలీదు. వీళ్లు వీళ్ల అభిప్రాయాలను మన నెత్తిమీద రుద్దటానికి ప్రయత్నిస్తున్నారు. ఎవరెవరు ఎలాంటివారో ఈ రెండేళ్లలో మనం తెలుసుకుంటాం కదా. ముందుగా వీళ్లు మనకు చెప్పడమెందుకు? బహుశా వీళ్లు ప్రొఫెసర్‌కి అపోజిట్ గ్రూపు వాళ్లై వుంటారు'' అన్నాడు సారథి.

"సీనియర్స్ అని తెగ పోజులు కొడుతున్నారు. ఎవరో అన్నారు - వీళ్ళను మనం సార్ అని పిలవాలట. మనం ఎదుటివాళ్లను గౌరవించడానికి ప్రాతి పదిక సీనియారిటీనా? అదే నిజమైతే ఈ

యూనివర్సిటీ ఆవరణ లో రాళ్లూ రప్పలూ చెట్లు కూడా సీనియర్సే. ఎలా వుంది మన కొటేషన్" నవ్వుతూ అన్నాడు రాజు.

ఇంతలో ఓ పాతికేళ్ళ యువకుడు తలుపు తోసుకుంటూ ఆ గదిలోకి వచ్చాడు.

"ఏమండీ! అగ్గిపెట్టె వుంటే ఇస్తారా?"

ఆ యువకుడు అలా అడగగానే రాజు టేబుల్ మీదున్న అగ్గిపెట్టెను తీసి ఆ యువకుడుకి అందించాడు. గుంటలు పడి వున్న కళ్లు, మాసిన గడ్డం, నలిగిన బట్టలు, చెరిగిన తల- ఇది అతని రూపం. పుల్ల గిచి బీడీ వెలిగించుకున్నాడతడు.

"బైదిబై... నా పేరు ఆనందరావు. రీసెర్చ్ స్కాలర్‌ని. మీ పక్కరూంలోనే వుంటున్నాను. మీరు యూనివరిటీలో కొత్తగా చేరినట్లున్నారు" అన్నాడు ఆనందరావు.

"అవును సార్! మీరు రీసెర్చ్ స్కాలరైతే, రీసెర్చ్ స్కాలర్స్ హాస్టల్లో వుండకుండా మీ పక్కగదిలో..."

"ఓహో అదా మీ అనుమానం. పీత పిల్లల్లా ఇక్కడ రీసెర్చ్ స్కాలర్స్ సంఖ్య ఎక్కువ. ప్రతి గాడిదా ఇక్కడ రీసెర్చ్ స్కాలర్ కాగలడు. రూమ్స్ సరిపోక మాకు ఈ హాస్టల్లో కూడా రూమ్స్ ఇచ్చారు" అంటూ వెళ్లిపోయాడతడు.

* * *

రాత్రి ఎనిమిది గంటలు దాటుతోంది. కరెంట్ దీపాలతో ఆ హాస్టల్ కళకళలాడి పోతోంది.

ఓ గదిలో అబ్బాయిలు గుంపుగా చేరి వాళ్ళ క్లాసులో ఏయే అబ్బాయిలు ఏయే అమ్మాయిల్ని ప్రేమిస్తున్నారో చెప్పుకుంటూ, జోకులు వేసుకుంటూ పగలబడి నవ్వుకుంటున్నారు.

మరో గదిలో వర్తమాన రాజకీయ రంగంలో వస్తున్న పరిణామాల గురించి, పాలకవర్గాల వైఫల్యాల గురించి మాట్లాడుకుంటున్నారు.

ఇంకో గదిలో కొంతమంది సినిమా తారల గురించి, వాళ్ళ తెరవెనుక జీవితం గురించి మాట్లాడుకుంటున్నారు.

కొందరు సాహిత్యం గురించి చర్చించుకుంటున్నారు.

మరికొందరు వుమెన్స్ హాస్టల్లోని అమ్మాయిల ప్రవర్తన గురించి చెప్పుకుంటున్నారు.

కొందరు మాత్రం మేము వీటన్నింటికీ అతీతులం అన్నట్టుగా తలుపులు బిడాయించుకుని చతుర్ముఖపారాయణంలో మునిగిపోయారు.

ఆ హాస్టల్ హాస్టల్లా లేదు. అదో విలాసమందిరంలా వుంది.

పావుగంట క్రితమే సారథి, రాజు మెస్‌లో భోంచేసి రూమ్ చేరుకున్నారు. రాజు సిగరెట్ కాలుస్తూ వార్తా పత్రికను తిరగేస్తున్నాడు. సారథి కుర్చీలో కూర్చుని అలంకార శాస్త్రానికి సంబంధించిన పుస్తకం చదువుకుంటున్నాడు.




ఇంతలో ఇద్దరు స్టూడెంట్స్ తమ చేతుల్లో ఏవో ఇన్విటేషన్స్ పట్టుకుని




ఆ రూంలోకి వచ్చారు.

"మీరు ప్రీవియస్ స్టూడెంట్సేనా?" అడిగాడు ఆ ఇద్దర్లో ఒకడు సారథి వేపు చూసి.

"అవునండీ" చెప్పాడు సారథి.

"ఏ డిపార్ట్‌మెంటు?"

"తెలుగు"

"మేమూ తెలుగు డిపార్ట్‌మెంటే. ఫైనలియర్ వాళ్ళం. నా పేరు నారాయణ, వీడి పేరు రమణ" అంటూ వాళ్ళు తమని పరిచయం చేసుకున్నారు.

"రేపు సాయంత్రం అయిదు గంటలకు మన తెలుగు డిపార్ట్‌మెంటులో ఫస్టియర్ స్టూడెంట్స్‌కి మేము 'వెల్‌కం పార్టీ' అరేంజ్ చేస్తున్నాం. మీరు తప్పకుండా రండి" అంటూ నారాయణ సారథికి, రాజుకు రెండు ఇన్విటేషన్స్ ఇచ్చాడు.

"మేము మీకు సీనియర్స్ అయినా... మీరంతా మాతో కలిసిమెలసి హాయిగా వుండొచ్చు. అంతేకాదు-సబ్జెక్ట్స్‌లో మీకు ఏదైనా అర్థం కాకపోయినా... సందేహ మొచ్చినా మమ్మల్ని అడిగి తెలుసుకో వచ్చు" తెలుగు సాహిత్యాన్నంతా జీర్ణింప చేసుకున్నవాడిలా పోజుపెట్టి అన్నాడు రమణ.

"మీకు ఫస్టియర్ నోట్సులు కావా లంటే మా దగ్గరున్నాయి. అవసరమైతే అడగండి. అయితే రాసుకున్న తర్వాత మళ్ళీ ఇచ్చేయ్యాలి" అన్నాడు నారాయణ.

"చాలా థాంక్సండీ. ఇతర్ల నోట్సుల్ని చూసి కాపీ చేసుకోవడం మాకిష్టం లేదు. బుక్స్‌ను చూసి స్వతంత్రంగా మేమే నోట్సులు తయారు చేయాలనుకుం టున్నాము. అవసరమయితే అడుగుతాం లెండి" అన్నాడు సారథి.

సారథి ఆ మాట అనేసరికి ఆ సీనియర్ విద్యార్థుల మనస్సులు చివుక్కు మన్నాయి.

"స్వతంత్రంగా నోట్సులు తయారు చేసుకుని చదివినంత మాత్రాన మార్కులు రావు" అన్నాడు రమణ.

"రాకపోవచ్చు. కానీ మార్కులొచ్చి నంత మాత్రాన సబ్జెక్ట్‌లో ప్రతివాడూ తెలివైనవాడు కాదు" సారథి అన్నాడు.

"అంటే మీ అభిప్రాయం..."

"నా అభిప్రాయం... మనిషి తెలివికి మార్కులు కొలబద్ద కాదంటాను"

"సరే..ఇప్పుడా చర్చలెందుకు? తీరిగ్గా వాదించుకుందాంలెండి. రేపు వెల్‌కమ్ పార్టీలో చివరగా కల్చరల్ ఆక్టివిటీస్ వుంటాయి. మీరెవరైనా అందులో పాల్గొన దలిస్తే ఇప్పుడే పేర్లివ్వండి" అన్నాడు నారాయణ.

"కల్చరల్ ఆక్టివిటీస్ అంటే అందులో..."

"పాటలు పాడేవాళ్ళు పాడొచ్చు. మిమిక్రీ చెయ్యగలిగితే చెయ్యవచ్చు. జోకులు వేసి నవ్వించేవాళ్ళెవరైనా వుంటే జోకులు వెయ్యవచ్చు" చెప్పాడు నారాయణ.

"అయితే మా రాజు పేరు రాసు కోండి'' రాజు వేపు చూస్తూ చెప్పాడు సారథి.

"నా పేరా? ఎందుకూ?''

"జోక్స్ వేసి ఎప్పుడూ నవ్విస్తుంటావు గదా. ఆ జోక్స్ ఏవో రేపు వెల్‌కం పార్టీలో కూడా వెయ్యి'' అన్నాడు సారథి.

"అయ్యబాబోయ్! నాకసలే స్టేజి ఫియర్ ఎక్కువ. నా వల్ల కాదు'' అన్నాడు రాజు.

"ఫర్వాలేదు. ఇలాంటి ఆక్టివిటీస్‌లో



పాల్గొంటే ఆ ఫియర్ పోతుందిలే. మీరు రాజు పేరు రాసుకోండి''

''పూర్తి పేరు ఏమిటి?''

''టి.వి. రాజు''

''అన్నట్టు మీ పేరు...''

''సారథి''

సారథి తన పేరు చెప్పగానే రమణ, నారాయణ పరస్పరం ఒకరి ముఖాల్లోకి చూసుకున్నారు. కులాన్ని సూచించే పదం సారథి పేరుకు చివరన లేకపోవడం చేత.. అతడిది ఏ కులమో వారికి అవగతం కావడంలేదు.

జూనియర్ స్టూడెంట్స్ చేరగానే సీనియర్ స్టూడెంట్స్ కొందరు వాళ్ళను కలిసి.. మెల్లగా వాళ్ళ కులాలు తెలుసుకుంటారు. తమ కులాలకు సంబంధించిన జూనియర్ స్టూడెంట్స్‌తో వాళ్ళు స్నేహం చేస్తారు. కులంబలాన్ని యూనివర్సిటీలో పెంచుకోడానికి కొందరు అక్కడ ప్రయత్నిస్తుంటారు.

''అన్నట్టు సారథిగారూ! మీది... మీదే కులం?'' మెల్లగా ప్రశ్నించాడు రమణ.

ఆ ప్రశ్నతో చటుక్కున తలెత్తి రమణ వేపు సూటిగా చూశాడు సారథి. ఆ చూపు చూపులాలేదు, చురకత్తిలావుంది.



ఆ చూపులో సారథి ప్రకటించిన అసహ్యాన్ని, ఏవగింపులను గ్రహించాడు నారాయణ.

"ఊరికే అడిగాడు... కోపగించుకోకండి" అన్నాడు నారాయణ.

"ఏమిటీ? ఊరికే సరదాగా అడిగాడా? సరదాగా అడగటానికి మీకు ఇంకేమీ లేవా? అసలు ఒక మనిషిని కలిసినప్పుడు ఆ మనిషికులం తెలుసుకోవాలన్న ఆలోచన మీకెందుకొస్తుంది?" సూటిగా అడిగాడు రాజు.

నారాయణ బదులు మాట్లాడలేదు.

"సరే..నా కులమేమిటో చెబుతానను కోండి. కానీ అంతటితో మీకు తృప్తి కలగదు. ప్రతి కులంలోనూ శాఖలు ఉంటాయిగా. అవికూడా మీకు వివరంగా చెప్పాలి. నేను రెడ్డినైతే...అందులో 'పోకనాటి'రెడ్డినా? 'పెడకంటి'రెడ్డినా? 'అరవ'రెడ్డినా? లేక 'కొండరెడ్డి'నా అనే విషయంకూడా చెప్పాలి. నాయుడినైతే అందులో మళ్లీ 'బలిజ'నాయుడినా లేక 'కమ్మ'నాయుడినా ఆ సంగతీ చెప్పాలి. నేను బ్రాహ్మణుడైతే..అందులో 'నియోగినా' లేక 'వైదికుడినా' అనే విషయమూ చెప్పాలి. బలిజకులం వాడినైతే..అందులో నేను 'గాజుల' బలిజవాడినా లేక 'ఈడిగ' బలిజవాడినా అనే సంగతి చెప్పాలి. నేను హరిజనుడినైతే.....అందులో 'రంపాల' హరిజనుడినా లేక 'పోకనాటి' హరిజనుడినా లేక 'రెడ్డిభూముల' హరిజనుడినా అనే విషయం తేల్చిచెప్పాలి.

"నేను ఏ కులానికి ఏ శాఖకు చెందినవాడినో మీరు అదే కులానికి అదే శాఖకు చెందినవాళ్ళయి వుండివుంటే..అప్పుడు నన్ను మీరు మీ గ్రూపులో కలుపుకుంటారు. నాతో హృదయపూర్వకంగా స్నేహంచేస్తారు. అంతేనా?" రమణ వేపు చురచురచూస్తూ నిలదీసి అడిగాడుసారథి.

"నేనేదో మామూలుగా అడిగాను. దానికి మీరింత సీరియస్ అయిపోతున్నారెందుకో" అన్నాడు రమణ.

"మీరు మామూలుగా అడగలేదులెండి! నాకు ఆ విషయం బాగా తెలుసు. ఈ ప్రపంచంలో ఉండేది ఒక్కటే కులం, ఒక్కటే జాతి. అది మానవజాతి. ఈ దేశంలో లెక్కలేనన్ని కులాలున్నాయి. వనుక ప్రతి మనిషీ ఏదో ఓ కులంలోపుట్టి తీరవలసిందే.

ఏనాడో...పూర్వకాలంలో వృత్తుల ప్రాతిపదికపై ఏర్పడిన కులాలివి. రాబోయే కాలంలో మనుషులు కులాల కోసం ఇంతగా కుమ్ములాడుకుంటారని గ్రహించి వుంటే..ఆనాడు వృత్తులవారి కులాల్ను విభజనచేసిన పెద్దలు..బహుశా ఈ సాహసం చెయ్యడానికి ప్రయత్నించి వుండకపోవచ్చు.

మనం చదువుకుంటున్నవాళ్ళం. మనిషిని మనిషిగా చూడవలసినవాళ్ళం. అజ్ఞానంతో అమాయకత్వంతో తమ కులాలకోసం పాకులాడే మనుషుల్ని ఎడ్యుకేట్ చెయ్యవలసినవాళ్ళం. అటువంటి మనమే ఈనాడు ఎదుటిమనిషిని 'నీకులం ఏమిటి?' అని అడుగుతున్నామంటే..మన చదువు - సంస్కారం ఏమైనట్టు?

మనమంతా ప్రగతిపథంవేపు పయనిస్తున్న మనుషులమా? రాతియుగంలోకి తిరిగి వెళుతున్న ఆటవికులమా? రమణగారూ! 'నీ కులం ఏమిటి' అని అడిగారే తప్ప.. 'మీ హాబీలేమిటి అభిరుచులేమిటి' అని మీరు అడగకపోవడం మూర్ఖత్వం కాదేమో ఆలోచించండి" అన్నాడు సారథి.

"వాట్ నాన్సెన్స్ యు ఆర్ టాకింగ్?" అంటూ రమణ సారథి మాటలకు మండిపడ్డాడు.

"సెన్స్ లేనివాళ్ళకు ఇందాక మా సారథి చెప్పిందంతా నాన్సెన్స్‌లాగే అన్పిస్తుంది" అన్నాడు రాజు.

"షటప్"

"ఆ మాట అనవలసింది మీరుకాదు...మేము"అంటూ సిగరెట్ వెలిగించాడురాజు.

"యూనివర్సిటీలోకి అడుగుపెట్టగానే కష్టాలు నెత్తికెక్కినట్లున్నాయే" అన్నాడు

నారాయణ.

"ఎవరికి మీకా?"

"రాజూ ప్లీజ్...నువ్వూరుకో!ఏమండీ.. ఇక మీరు వెళ్ళండి" అన్నాడు సారథి కలగజేసుకుంటూ.

"ఓకే...వెళ్తాం. మీ విషయం ఏమిటో తర్వాత చూసుకుంటాం" అన్నాడు రమణ.

"తర్వాత ఎప్పుడో ఎందుకు...చేత నయితే ఇప్పుడే చూడరాదూ" అన్నాడు రాజు.

'నీ అంతుచూస్తాను' అన్నట్టుగా రాజువేపు ఓసారి చూసి..అక్కడినుండి వెళ్ళిపోయాడు రమణ. నారాయణ కూడా అతడి వెంటే నడిచాడు.

"ఏమిటి రాజూ.. ఆ మూర్ఖశిఖామణు లతో మనకు తగవెందుకు?" అన్నాడు సారథి.

"ఇలాంటివాళ్లతో తగవులాడటంకాదు.. చెప్పుతీసుకుని కొట్టాలి. కాకపోతే నీదే కులం అని అడిగిందిగాక వాడు మళ్ళీ సమర్థించుకునే ప్రయత్నం కూడా చేస్తాడా?"

ఇంతలో పక్కరూంలోవున్న ఆనంద రావు వాళ్ళరూంలోకి ప్రవేశించాడు.

"కంగ్రాచ్యులేషన్స్! ఇందాక ఈ గదిలో జరిగిన తతంగం అంతా మా రూంలోంచి విన్నాను.ఇందాక వచ్చిన ఆ గాడిదలకు బాగా గడ్డిపెట్టారు" అన్నాడు ఆనందరావు.

"కానీ..ఆ గడ్డి ఆ గాడిదలకు రుచించ లేదు"

"అంత సులభంగా రుచించదులెండి! ఇలాంటి గాడిదలు ఈ యూనివర్సిటీలో ఇంకా చాలా వున్నాయి. మీరు కొత్త గనుక...ఈ యూనివర్సిటీ అసలు రూపా న్నింకా దర్శించలేదు. ఇక్కడ ప్రధా నంగా రెండు అగ్రవర్ణాలున్నాయి. ఈ రెండు వర్ణాలకు సంబంధించిన స్టూడెంట్స్ మధ్య అప్పుడప్పుడూ కులపోరాటం జరుగుతుంది"

"ఈజిట్?" అన్నాడు సారథి.

"యస్...ఈ కులపోరాటంలో కొంత మంది విద్యార్థులు పాత్రధారులు. కొందరు అధ్యాపకులు అసలైన సూత్రధారులు. ఇకపోతే ఇక్కడ కొన్ని డిపార్ట్‌మెంట్స్ వున్నాయి. ఓనమాలు తెలియకపోయినా ఆ డిపార్ట్‌మెంట్స్‌లో కొంతమందికి గోల్డ్ మెడల్స్ వచ్చేస్తుంటాయి" అన్నాడు ఆనందరావు నవ్వుతూ.

"అదెలా సాధ్యం?"

"సాధ్యమే. అందుకు కావాల్సింది 'కలం బలం'కాదు.'కులంబలం'. వడ్డించే వాడు మనవాడైనప్పుడు మనం ఎక్కడ కూర్చున్నా కడుపు నిం డు తుం ది. ప్రొఫెసర్ మనకులంవాడైనప్పుడు ఇకమనం పరీక్షల్లో ఏమీ రాయకపోయినా ఫస్ట్‌క్లాస్ వచ్చేస్తుంది" చెప్పడం ఆపి బీడీ వెలిగించు కున్నాడు ఆనందరావు.

"అయితే ఈ యూనివర్సిటీలో గంజాయివనంలో తులసి మొక్కల్లా అక్కడక్కడా ఓ అయిదారు మంది ప్రొఫెసర్లున్నారు. వాళ్ళలో ఇంకా నైతికవిలువలు పూర్తిగా చావలేదు. అలాంటివాళ్ళకు కూడా కులగజ్జిఅంటించే ప్రయత్నాలు సాగుతున్నాయి"

"విచిత్రంగా వుందే" అన్నాడు సారథి.

"ఏమిటి?"

"మేధావులైన ప్రొఫెసర్లు, రీడర్లూ ఇలాంటి కులపోరాటాలలో పరోక్షంగా పాల్గొనడం.."

"పొగ్గొంటే మనం ఆశ్చర్యపడనవసరంలేదు. వాళ్లు పొగ్గొనకుంటేనే ఆశ్చర్యపడాలి. ఇకపోతే..ఇక్కడ రీసెర్చ్ స్కాలర్స్ అనబడే మేధావులున్నారు. వీళ్ళలో చాలామంది ఈ యూనివర్శిటీకి ముద్దుబిడ్డలు. వీళ్ళు హాస్టల్ మెస్‌లో తింటూ ఏళ్ళతరబడిఇక్కడేవుండిపోతారు. దేనిమీద రీసెర్చ్ చేస్తున్నారో..ఆ అంశం గురించి ఓ అరగంట మాట్లాడమంటే వీళ్ళలో చాలామంది మాట్లాడలేరు. కానీ ఇటుక రాళ్ళంత మైసూర్ పాక్‌లూ, గుండ్రాళ్ళంత లడ్లూ, చికెన్ ఫుల్ ప్లేట్లూ చాలా సులభంగా లాగించెయ్యగలరు. రీసెర్చ్ స్కాలర్స్ బ్లాక్ ముందున్న సిమెంట్ బెంచీలపై ఠీవిగా కూర్చుని మేధావుల పోజులు కొడుతుంటారు. మీరు వాళ్లను ఎప్పుడైనా చూడండి...వాళ్ళకూ,తెగ బలిసిన ఒంగోలు గిత్తలకూ ఏమైనా తేడాలుంటాయేమో! వీళ్ళలో చాలామంది తమ రీసెర్చ్‌ని ఎప్పుడో గాలికి వదిలేసి వుంటారు" చెప్పాడు ఆనందరావు.

"వాళ్లు రీసెర్చ్‌ని గాలికి వదిలిపెట్టేస్తే మరి వాళ్ళ గైడ్సు అడగరా? వాళ్ళేం చేస్తున్నట్టు?''అడిగాడు రాజు.

"లెక్చరర్‌గా వుండేవాడు రీడరయ్యేందుకు ప్రయత్నిస్తుంటాడు. రీడర్‌గా వుండేవాడు డిపార్ట్‌మెంట్ హెడ్ అయ్యేందుకు ప్రయత్నిస్తుంటాడు. హెడ్‌గా వున్నవాడు ప్రొఫెసరయ్యేందుకు ప్రయత్నిస్తుంటాడు ... ఇదీ గైడ్స్ చేసేపని''

"చాలా దారుణంగా వుందే"

"ఇదేం దారుణం! ఇంకా చాలా దారుణాలు జరుగుతున్నాయి. ఒక డిపార్ట్‌మెంట్‌లోని ఒక అధ్యాపకుడు...అదే డిపార్ట్‌మెంట్‌లోని తన కులంగాని మరో అధ్యాపకుడి మీదికి...తన డిపార్ట్‌మెంట్లో చదువుకునే అధిక సంఖ్యాకులైన తన కుల విద్యార్థులను బాగా ఉసికొల్పి కొట్టిస్తున్నాడంటే...మీరు నమ్ముతారా?"

"నిజమా?"

"నిజమే. మీకే తెలుస్తుందిలెండి. సంస్కారహీనులైన నీతిలేని వీళ్ళా ప్రొఫెసర్లు, రీడర్లు? వీళ్ళా స్టూడెంట్స్‌ని తీర్చిదిద్దేది? వీళ్ళా దేశానికి మోరల్ అండ్ ఇంటలెక్చువల్స్‌ను ప్రసాదించేది? వీళ్ళామేధావి వర్గీయులు?ఈ నాయాళ్ళను వరుసగా నిలబెట్టి మిషిన్ గన్‌తో కాల్చి చంపాలండీ'' అంటూ అక్కడి నుండి వెళ్లిపోయాడు ఆనందరావు.

"రాజా ... ఏమో అనుకున్నాను. ఒక్కొక్క విషయమే తెలుస్తుంటే యూనివర్శిటీమీద నాకు భలే ఏవగింపు పుడుతోంది. ఆనందరావుగారి మాటల్లో చాలా నిజముందని ఎందుకో నాకన్పిస్తోంది" అంటూ బెడ్‌పై పడుకుని కళ్లు మూసుకున్నాడు సారథి.

మరుసటి రోజు సాయంత్రం అయిదున్నరకు తెలుగు డిపార్ట్‌మెంట్‌లో 'వెల్‌కం పార్టీ' ఏర్పాటు చెయ్యబడింది. కొత్తగా చేరిన జూనియర్ స్టూడెంట్స్‌కు ఫైనలియర్ స్టూడెంట్స్ ప్రతి ఏటా అలా 'వెల్‌కం పార్టీ'ని ఏర్పాటు చేస్తారు. అలాగే సంవత్సరాంతంలో సీనియర్స్‌కు జూనియర్స్ 'సెండాఫ్ పార్టీ' ఏర్పాటు చేస్తారు.

ఆ పార్టీలకు ఆ డిపార్ట్‌మెంట్‌లో వున్న ప్రొఫెసర్స్,రీడర్స్,లెక్చరర్స్, రీసెర్చ్ స్కాలర్స్, ఫైనల్ అండ్ ప్రీవియస్ స్టూడెంట్స్ అందరూ తప్పకుండా హాజరవుతారు. మొదట





అల్పాహార విందు ముగించి, కూల్ డ్రింక్ తాగేసి అక్కడే వున్న పెద్ద హాల్లో అందరూ సమావేశమయ్యారు. హాల్ నిండుగా వుంది.

ఆ హాల్లో ఫస్టియర్ స్టూడెంట్స్, ఫైనలియర్ స్టూడెంట్స్ విడివిడిగా కూర్చున్నారు. వేదికమీద అధ్యక్షుడి స్థానంలో సీనియర్ ప్రొఫెసర్ కూర్చున్నాడు. ఆయన ముందున్న టేబుల్ మీద 'ఎ బాక్స్', 'బి బాక్స్' అని రాయబడిన రెండు పెట్టెలున్నాయి.

'ఎ బాక్స్'ను కొశ్చన్ బాక్స్ అనీ, 'బి బాక్స్'ను పనిష్మెంట్ బాక్స్ అనీ అంటారు. ఫస్టియర్ స్టూడెంట్స్ ఎంత మంది వుంటారో- అన్ని చీటీలు ఎ బాక్సు లోనూ,బిబాక్సులోనూ ఉంటాయి.ఎ బాక్స్ లోని చీటీలలో ఒక్కో చీటీలో ఒక్కో ప్రశ్న రాయబడి వుంటుంది. అలాగే బిబాక్స్‌లోని ఒక్కో చీటీలో ఒక్కో పనిష్మెంట్ రాయబడి వుంటుంది.

మీటింగ్ ప్రారంభ మయ్యాక ప్రీవియస్ స్టూడెంట్స్ ఒక్కొక్కరే పైకి లేచి వేదిక మీదకు వచ్చి నిలబడాలి. తర్వాత తన పేరు, ఊరు మొదలైన వివరాలు చెప్పి,ఎబాక్స్‌లోవున్న చీటీలలో ఒక్క చీటీని అందుకుని అందులో రాయబడిన ప్రశ్నను గట్టిగా చదివి ఆ ప్రశ్నకు జవాబు తెలిస్తే చెప్పేసి అక్కడి నుండి దిగి మళ్ళీ తన సీట్లోకి వచ్చి కూర్చోవాలి.

ఒక వేళ ఎ బాక్స్‌లోంచి తీసుకున్న చీటీలో రాయబడిన ప్రశ్నకు ఎవరైనా సమాధానం చెప్పలేకపోతే, బి బాక్స్ లోంచి ఓ చీటీని అందుకుని అందులో ఏరకం పనిష్మెంట్ రాయబడి వుంటుందో ఆరకం పనిష్మెంట్‌ను ఆ స్టూడెంట్ చేసి చూపెట్టాలి. ఉదాహరణకి – గుంజీలు తియ్యడం, కుంటివాడిలా నడవడం లాంటివి.

అలాచేసి చూపెట్టడం తమకు ఇష్టం లేకపోయినా అక్కడమాత్రం ఆ పని ష్మెంట్‌చేసి చూపెట్టవలసిందే. లేకపోతే ఫైనలియర్ స్టూడెంట్స్ వదిలిపెట్టరు. ఈ ప్రోగ్రాం కేవలం సరదాగా అందరూ నవ్వుకోడానికి మాత్రమే.

ఏ రకమైన ప్రశ్నలు, ఏ రకమైన పనిష్మెంట్లు ఆ చీటీలలో రాయాలి–అనే విషయం గురించి ఫైనలియర్ స్టూడెంట్స్ ఆ ముందురోజే చర్చించుకుని ఆ చీటీలలో రాస్తారు. వెల్‌కం పార్టీ అనేది ఫైనలియర్‌వాళ్ళకు సరదాగా, ఫస్టియర్ వాళ్ళకు ప్రాణ సంకటంగా వుంటుంది.

"ఇక పరిచయాలు. ఫస్టియర్ స్టూడెంట్స్ ఒక్కొక్కరే ఈ వేదికమీది కొచ్చి మీ పేరూ, ఊరూ చెప్పి ఎ బాక్స్ లోని ప్రశ్నలకు సమాధానం చెప్పడమో లేక బి బాక్స్‌లోని పనిష్మెంట్స్‌ను చేసి చూపెట్టడమో చెయ్యండి. పనిష్మెంట్ చెయ్యవలసినవాళ్లు ఏమాత్రం ఫీల్ కానవసరంలేదు. ఇదంతా కేవలం సరదాకే" నవ్వుతూ చెప్పి తన సీట్లో కూర్చున్నాడు ప్రొఫెసరు.

ఫస్టియర్ స్టూడెంట్స్ ఒక్కొక్కరే వేదికపైకి వెళ్ళి ఆ తతంగం ముగించి వచ్చేస్తున్నారు. ప్రశ్నలకు జవాబులను చెప్పలేనివాళ్లు ఆ పనిష్మెంట్స్ చేసి చూపెడుతూ ఏడ్వలేక నవ్వుతూ అవస్థలు పడుతున్నారు. కొందరు కుంటివాళ్ళలా నడిచి చూపెట్టారు. కొందరు నత్తివాళ్ళలా మాట్లాడారు.

ఫస్టియర్ స్టూడెంట్స్ పడుతున్న అవస్థలను చూసి ఫైనలియర్‌వాళ్ళు పగల

బడి నవ్వుతున్నారు. ఆ నవ్వులతో మిగిలిన అందరూ శృతి కలుపుతున్నారు. ఆ హాలంతా గోలగోలగా వుంది. సరిగ్గా అప్పుడే రాజు వంతు రావడంతో కూర్చున్న బెంచిలోంచి పైకిలేచి వేదిక మీదికి వచ్చి తన పేరూ వూరూ చెప్పి ఎ బాక్సులోంచి ఓ చీటీ చేతికి అందుకుని మెల్లగా దాన్ని విప్పాడు.

"కన్యాశుల్కం నాటకం గొప్పదని మీరు అంగీకరిస్తారా? అంగీకరిస్తే ఎందుకు గొప్పదో చెప్పండి. అంగీకరించకపోతే ఎందుకు గొప్పది కాదో చెప్పండి" అంటూ ఆ స్లిప్‌లో రాసిన ప్రశ్నను అందరికీ విన్పించేలా చదివాడు రాజు.

"చెప్పండి మరి" అరిచాడొకడు గుంపులోంచి.

"'కన్యాశుల్కం గొప్పదని మీరు అంగీకరిస్తారా?' అనే ప్రశ్నకూ, 'సూర్యుడు వెలుగునిస్తాడని మీరు ఒప్పుకుంటారా?' అనే ప్రశ్నకూ పెద్ద తేడాలేదు. నేనే కాదు - ఈ దేశంలో పుట్టిన ప్రతివాడూ కన్యాశుల్కం గొప్ప నాటకమని ఒప్పుకోవలసిందే. ఎందుకంటే - సామాజిక వాస్తవికతను అంత గొప్పగా చిత్రించిన నాటకం తెలుగులో లేదుగనుక" అని చెప్పి వేదిక దిగి వచ్చేశాడు రాజు.

తర్వాత సారథి వంతు వచ్చింది. సారథి కూడా పరిచయ వాక్యాలను చెప్పేసి ఎ బాక్సులోంచి ఓ చీటీ అందుకున్నాడు.

"మహాప్రస్థావనం రాసిన మహాకవి ఎవరు?" అంటూ ఆ చీటీలోని ప్రశ్నను చదివాడు సారథి.

ప్రశ్న చదివిన తర్వాత సారథి ఒక్క క్షణం మౌనం వహించాడు. అతడి మౌనానికి మరో అర్థం తీసుకున్న స్టూడెంట్స్ సారథికి జవాబు తెలియదనుకున్నారు. అందుకే ఫైనలియర్ స్టూడెంట్స్ గుంపులోంచి కొందరు "జవాబు చెప్పాలి జవాబు. చెప్పి తీరాలి" అంటూ పెద్దగా అరవడం మొదలెట్టారు.

"ఈ స్లిప్‌లో "మహాప్రస్థావనం' రాసిన మహాకవి ఎవరు?' అని రాసి వుంది. నాకు తెలిసినంతవరకు తెలుగులో శ్రీశ్రీగారి మహాప్రస్థానం తప్ప 'మహాప్రస్థావనం' అనే పేరుగల పుస్తకం వెలువడలేదు. ఆ పుస్తకం రాసిన మహాకవి ఎవరో కూడా నాకు తెలియదు" సారథి చాలా వ్యంగ్యంగా అన్నాడు.

"ఈ స్లిప్‌లో ఈ ప్రశ్న రాసిన వ్యక్తి ఎవరో నాకు తెలియదు కానీ ఆ వ్యక్తికి మహాప్రస్థానం పుస్తకం పేరు రాయడం కూడా తెలియకపోవడం తెలుగు సాహిత్య విద్యార్థులుగా మనమంతా విచారింపదగ్గ విషయం. మహాకవికి మనం చేసే అవహేళన ఇంతకన్నా మరోటి వుండదు" అంటూ వేదిక దిగేశాడు సారథి.

వెంటనే ఫస్టియర్‌వాళ్ళ గుంపులో కొందరు చప్పట్లు కొట్టేశారు. 'చూసారా! మీ ఫైనలియర్ వాళ్ళకంటే జూనియర్స్ అయిన మేమే తెలివైనవాళ్ళం' అన్నట్టుగా ఫైనలియర్ స్టూడెంట్స్ వేపు గర్వంగా చూశారు ఫస్టియర్ స్టూడెంట్స్. ఫైనలియర్స్ మాత్రం ఆముదం తాగిన వాళ్ళలా ముఖాలు పెట్టారు.

తమ జూనియర్ తాము చేసిన ఆ తప్పును అందరి ముందూ ఎత్తిచూపడం ఫైనలియర్‌వాళ్ళు భరించలేకపోయారు. 'ఎంత గర్వం వీడికి' అని సారథి గురించి అనుకున్నారు. మహాప్రస్థానం టైటిల్‌ని





ఆ స్లిప్‌లో తప్పుగా రాసిన గిరిధర్ అనే ఫైనలియర్ అబ్బాయి వేపు 'పరువు తీశావురా' అన్నట్టుగా చూశారు మిగిలిన ఫైనలియర్‌వాళ్లు.

ఆ తతంగం పూర్తి అయ్యాక .. ఫైనలియర్స్‌లో కొందరు స్టూడెంట్స్ వేదిక మీదికి వెళ్లి తమ జూనియర్ స్టూడెంట్స్‌కు సలహాలనూ, సందేశాలనూ, ఇవ్వడం మొదలెట్టారు. ఫస్టియర్‌లో తాము ఎలా కష్టపడి చదివిందీ చెప్పారు. తమ తెలుగు డిపార్ట్‌మెంట్‌కు ఆ యూనివర్సిటీలో ఓ ప్రత్యేకత ఉందని పొగిడారు.

"మన ప్రొఫెసర్ చాలా మంచివారు. మనం ఎన్నిసార్లు సందేహాలు అడిగినా విసుక్కోకుండా అర్థమయ్యేలా ఎంతో సహనంగా చెబుతారు. మన రీడర్ లింగ్విస్టిక్స్‌ను విడమరచి చక్కగా అర్థమయ్యేలా బోధిస్తారు. మన శివరామశాస్త్రిగారి విషయం చెప్పక్కరలేదు. వ్యాకరణం చెప్పడంలో వారికివారే సాటి. ఇకపోతే మన..." అంటూ ఓ అబ్బాయి మాట్లాడసాగాడు.

"సారథీ" మెల్లగా పిలిచాడు రాజు.

ప్రశ్నార్థకంగా చూశాడు సారథి.

"నాకో చిన్న అనుమానం గురూ!"

"ఏమిటది?"

"ఈ ఫైనలియర్‌వాళ్లు మనకు సందేశాలను ఇవ్వడానికి వేదిక ఎక్కుతున్నారా లేక స్టాఫ్ మెంబర్స్‌కు భజన చేయటం కోసం ఎక్కుతున్నారా? రాజరికపు వ్యవస్థలోని భట్రాజులు కూడా వీళ్ళకు సాటి రారనుకుంటాను" అన్నాడు రాజు.

సారథి నవ్వి ఊరకున్నాడు.

"గురూజీ! శ్రుతిమించిపోతున్న ఈ భజనకు అంతరార్థం ఏమిటి?" మెల్లగా అడిగాడు రాజు.

"మరేం లేదు. ఫైనలియర్లోనైనా ఇంటర్నల్ వాల్యుయేషన్ చేసేటప్పుడు మమ్మల్ని కాస్త గుర్తుపెట్టుకుని మాకు కొన్ని మార్కులు పడెయ్యండని లెక్చరర్లకు పరోక్షంగా చెప్పడమే"

ఫైనలియర్‌వాళ్లు సందేశాల్ని ఇచ్చే తంతు పూర్తి అయిపోయింది. తర్వాత రీసెర్చ్‌స్కాలర్స్‌లో కొంతమంది మాట్లాడారు. చివరగా అధ్యక్షుని స్థానంలో వున్న ప్రొఫెసర్ పైకి లేచి నిలబడి మలి పలుకులు చెప్పడం మొదలెట్టాడు.

"మహాప్రస్థానం పేరు కూడా సరిగ్గా తెలియకపోవడం... సాహిత్య విద్యార్థులుగా ఫైనలియర్‌వాళ్ళకిది సిగ్గుచేటు. ఫైనలియర్ స్టూడెంట్స్ కళ్లుతెరుచుకునేలా వేడిగా వాడిగా ఒక్కమాట మాట్లాడిన సారథిని నేనెంతో అభినందిస్తున్నాను''

ప్రొఫెసర్ ఆ మాట అనేసరికి ఫైనలియర్స్‌కి బాధించే పుండు మీద కారం చల్లినట్లయింది. జూనియర్స్‌లో కొందరు సారథి వేపు మెచ్చుకోలుగా చూశారు.

ఫంక్షన్ పూర్తి కావడంతో కూర్చున్న సీట్లలోంచి అందరూ పైకి లేచారు.

మొదట లెక్చరర్లు తర్వాత, రీసెర్చ్ స్కాలర్లు వెళ్లారు. ఆ హాలుకు అదొక్కటే దారి కావడం చేత... తలుపు వద్ద చేరి స్టూడెంట్స్ ఒకరినొకరు నెట్టుకుంటున్నారు. ఆ తొక్కిడిలో వెళ్ళడమెందుకని సారథి, రాజులు చివరగా నిలబడ్డారు.

"సారథిగారూ!"

ఆ పిలుపు వెనుక నుండి విన్పించడంతో సారథి చటుక్కున తలతిప్పి చూశాడు. అక్కడ గోడను ఆనుకుని ఓ

అమ్మాయి నిలబడివుంది. ఆ అమ్మాయి పేరు సుగుణ. ఆ అమ్మాయి కూడా సారథి వాళ్ల క్లాసే.

"కంగ్రాచ్యులేషన్స్ సారథిగారూ"

"ఎందుకండోయ్?" నవ్వుతూ సుగుణను ప్రశ్నించాడు సారథి.

"ఫైనలియర్ వాళ్లకి బాగాగడ్డి పెట్టారు, ప్రొఫెసర్ చేత పెట్టించారు...అందుకని" అంది సుగుణ.

"ఫైనలియర్స్ అంటే మీకెందుకంత కోపం?"

"మా ఉమెన్స్ హాస్టల్లో ఈ సీనియర్ అమ్మాయిల పోజులు వర్ణనాతీతం. మా జూనియర్స్‌మీద భలే అధికారం చెలాయిస్తుంటారు. పైగా మేధావుల పోజొకటి" అంది సారథికి మాత్రం విన్పించేలా.

రోజులు గడుస్తున్నాయి. సారథి రాజుల మధ్య మంచి స్నేహం ఏర్పడింది. కాలేజికి వెళ్లినా, టౌన్‌కు వెళ్ళినా, మెస్‌లో భోజనానికి వెళ్లినా ఇద్దరూ కలిసి వెళ్ళేవాళ్ళు. ఒకరిని వదిలి మరొకరు ఎక్కడికీ వెళ్లేవారు కాదు. పంచుకోగల మనసంటూ



వుంటే అది పటిష్టమైన అనుబంధాన్ని ఏర్పరుస్తుంది.

టౌన్‌లో నాలుగు ఇళ్ళల్లో ట్యూషన్స్ కుదుర్చుకున్నాడు సారథి. ఆదివారాలు తప్ప మిగిలిన రోజుల్లో ఉదయంపూట రెండు గంటలు, సాయంత్రంపూట రెండు గంటలు ట్యూషన్లు చెప్పడంతో కాలం గడిచిపోతూవుంది. ప్రతినెలా ట్యూషన్స్ మీద రెండు వందలకు పైనే సంపాదిస్తు



న్నాడు.

మొదటి నెల ట్యూషన్స్ డబ్బు తీసుకున్నప్పుడు సారథి అనిర్వచనీయమైన ఆనందంతో ఉప్పొంగిపోయాడు. తన కాళ్ళపై తను నిలబడగలిగినందుకు సారథికి చాలా సంతోషంగా, తృప్తిగా వుంది. తను యూనివర్సిటీలో చేరినప్పటి

నుండి జరిగిన విషయాలను, విశేషాలను సంక్షిప్తంగా తెలియపరుస్తూ మాధవ రావుకు ఉత్తరం రాశాడు.

## 6



రాత్రి ఎనిమిదిగంటలు కావస్తోంది. రాజు, సారథి మెస్‌లో పక్కపక్కన కూర్చొని భోంచేస్తున్నారు. ఇంకా కొందరికి భోజనం వడ్డించకపోవడంతో వాళ్ళు ఖాళీ కంచాలను డైనింగ్ టేబుల్‌కేసి కొడుతూ పెద్దగా అరుస్తున్నారు. డైనింగ్ హాలంతా గోలగోలగావుంది. అది నాన్ వెజిటేరియన్ మెస్.

ఆ మెస్‌లో ప్రతి రాత్రి స్టూడెంట్స్‌కు ఒక్క శనివారం తప్ప మిగిలిన అన్ని దినాలలోనూ చికెన్ ఇస్తారు. ఆ చికెన్ తినడం మరిగి చదువు సంగతి వదిలేసి కొందరు స్టూడెంట్స్ హాయిగా రెండు సంవత్సరాలు కాలం గడిపేస్తారు. యూనివర్సిటీ మెస్‌లో భోజనంచేసేవాళ్ల చాలామంది మెస్ బిల్స్ కట్టనవసరంలేదు.

వెనుకబడిన జాతులకు, వెనుకబడిన కులాలకు సంబంధించిన స్టూడెంట్స్ ఎటూ బిల్స్ కట్టనవసరంలేదు. ఇక అగ్ర వర్ణాలకు సంబంధించిన విద్యార్థులలో చాలామంది సంవత్సరాదాయం తక్కువ వేసుకుని 'ఎకనామికలీ బాక్‌వర్డ్' అని సర్టి ఫికెట్స్ ప్రొడ్యూస్ చేస్తారు.

ఇన్‌కం సర్టిఫికెట్స్‌లో సంవత్సరా దాయం తక్కువగా వేసుకుని, గ్రామ కరణం దగ్గర, రెవెన్యూ ఇన్స్‌పెక్టర్ దగ్గర సైన్ చేయించుకుని వచ్చిన స్టూడెంట్స్‌కు స్కాలర్‌షిప్ మంజూరు అవుతుంది. కనుక వాళ్ళు ఆ రెండేళ్ళూ మెస్ బిల్స్ కట్టనవసరంలేదు.

ఈ ఎకనామికలీ బాక్‌వర్డ్ వ్యవహార మంతా కేవలం వ్యవసాయదారుల బిడ్డలకు మాత్రమే లాభసాటిగా వుంటుంది. వందల ఎకరాల ఆస్తులున్నవాళ్ళు కూడా తక్కువ ఆదాయంవేసుకుని సర్టిఫికెట్స్ ప్రొడ్యూస్ చేస్తారు. ఈ అవకాశం ఉద్యోగస్తుల బిడ్డలకులేదు. వాళ్ళ ఆదాయం రికార్డెడ్‌గా తెలుస్తూనే వుంటుంది.

మొత్తానికి యూనివర్సిటీ మెస్‌లలో తినే స్టూడెంట్స్‌లో ఇరవై అయిదు శాతం విద్యార్థులు మాత్రమే మెస్ బిల్స్ ప్రతి నెలా కడతారు. మిగిలిన డెబ్బయి అయిదు శాతం విద్యార్థులు స్కాలర్‌షిప్స్ మంజూరు కావడంచేత ఫ్రీగా...పైసా చేతినుంచి కట్టకుండా తింటూ వుంటారు. తమకోసం ప్రభుత్వం ఎంత డబ్బు ఖర్చు పెడుతుందో వీళ్ళు ఏనాడూ ఆలోచించరు.

ఖాళీకంచాలముందు కూర్చున్న వాళ్ళు 'తొందరగా వడ్డించి చావండ్రా' అంటూ సర్వర్స్‌మీద కేకలేస్తున్నారు. సర్వర్స్ హడావుడిగా అటూఇటూ తిరుగుతున్నారు. కొందరు స్టూడెంట్స్ అరుస్తున్నారు. ఆ మెస్ మెస్‌లా లేదు...సత్రంలా వుంది.

రాజూ సారథీ కూర్చున్న వరుసకు ఎదురు వరుసలో కూర్చున్న దినకర్ ఎం.ఏ ఎకనమిక్స్ ఫైనల్ చదువు తున్నాడు. ఇంకో పది నిముషాలలో అన్నం వడ్డించకపోతే ... అక్కడే ఆకలికి ప్రాణం వదిలేసేవాడిలా దినకర్ అలమటిస్తున్నాడు.





"ఎవ్వడ్రా! ఎంత సేపైంది మేం భోజనానికి కూర్చుని. వడ్డించడానికి మీకేం రోగం?" అడిగాడు దినకర్.

"పొయ్యిమీదినుండి అన్నం ఇప్పుడే దించారు సార్" చెప్పాడొక సర్వర్.

"ఇప్పుడా? ఆ కుక్‌గాడు అన్నం వండకుండా ఇప్పటివరకు ఏం చేస్తున్నట్టు?"

"అతడు మాత్రం ఏం చేస్తాడు సార్! పొయ్యి సరిగ్గా మండితేగదా" అన్నాడు సర్వర్.

"ఏమొచ్చింది పొయ్యికి?"

"నిన్న కురిసిన తుంపర చినుకులకి కట్టెలు తడిశాయి. అందుకే పొయ్యిసరిగ్గా మండడంలేదు"

ఇంతలో ఓ సర్వర్ అన్నం వుండే పాత్రను చేతపట్టుకుని అందరికీ వడ్డించడం మొదలెట్టాడు. అన్నం పొగలు కక్కుతోంది. కొందరు స్టూడెంట్స్ భోంచేసి వారం రోజులైనట్లుగా ఆ సర్వర్ చేతిలోని అన్నంవేపు ఆవురావురున చూస్తున్నారు.

ఒక సర్వర్ చికెన్ ప్లేట్స్‌ను అందరి ముందు వరుసగా పెడుతున్నాడు. మరొకడు రసం పోస్తున్నాడు. మరొకడు మజ్జిగ పోస్తున్నాడు. శీను అనే పదిహేనేళ్ళ సర్వర్ వాటర్ క్యాన్ చేతపట్టుకుని అడిగినవాళ్ళందరి దగ్గరికెళ్ళి వాళ్ళ ముందున్న గ్లాసుల్లో నీళ్ళుపోస్తున్నాడు.

అలా వాటర్‌పోస్తున్న శీను చేతిలోంచి ఆ వాటర్‌క్యాన్ హఠాత్తుగా జారి డైనింగ్ టేబుల్‌మీద పడింది. అందులోవున్న నీళ్లు కొన్ని దినకర్ బట్టలమీద పడ్డాయి.

"సారీసర్...పొరపాటున పడ్డాయి" అంటూ ఆ పదిహేనేళ్ళ శీను దినకర్ వేపు చాలా భయం భయంగా చూశాడు.

"ఓరి నీ...కళ్లు నెత్తికెక్కాయిరా నీకు. మెస్‌లో తేరగావచ్చిన తిండి తినీతినీ కొవ్వెక్కిపోయిందిరా నీకు" అంటూ బూతులు తిడుతూ ఆ సర్వర్ చెంపమీద చెళ్లున కొట్టాడు దినకర్. ఆ సర్వర్ కళ్ళ నుండి జలజలా కన్నీళ్లు రావడం ఎదురుగా కూర్చునివున్న సారథికి స్పష్టంగా అగుపించింది.

ఆ దృశ్యం చూసిన సారథికి గుండెలో చేయిపెట్టి కెలికి నట్లయింది. వాడి అభిమానం వ్యక్తిత్వం ఆ దెబ్బతో ఎంతగా గాయపడి వుంటాయో, వాడి కన్నీటి బిందువుల వెనుక ఎంతటి వ్యధ దాగి వుంటుందో సారథికి బాగా తెలుసు.

కనీసం పదిహేను సంవత్సరాలుకూడా నిండని పసివాడు..పొరబాటున బట్టలమీద నీళ్ళు పోశాడు. తన పొరబాటును క్షమించమని అడిగాడు. కానీ ఆ చిన్న పొరబాటును క్షమించతగ్గ సంస్కారం దినకర్‌కు లేకపోయింది.

ఛీ...అమాత్రం సంస్కారం కూడా లేని వీళ్లా నాగరికులు? ఉన్నత చదువులను చదువుకుని రేపు సమాజాన్నీ,దేశాన్నీ ఉద్ధరించబోయే ఉత్తమ పౌరులు వీళ్లా? మానవత్వం ఏమాత్రంలేని వీళ్ళా ఆధునిక మానవులు??

ఆ పసివాడిని దినకర్ అంతదారుణంగా కొడితే ఇక్కడున్నవాళ్ళెవరూ పట్టించుకోరేం?

తిండి తినడంలో ఎవరికి వారు నిమగ్నమైపోయి ఉన్నారుతప్ప కనీసం తలెత్తి ఆ సర్వర్‌వేపు సానుభూతిగానైనా ఒక్కసారి చూడరెందుకని? ఇంత జరిగినా ఏమీ జరగనట్టు వీళ్ళెలా ఉండగలుగుతున్నారు? ఈ ప్రపంచానికీ, ఆ పసివాడు దెబ్బతినడానికి ఏమీ సంబంధంలేదా? — అలా ఆలోచించిన సారథికి ఒక్క

మెతుకు కూడా దిగబడలేదు.

తన గుండెలపై ఎవరో నాగజెముడు ముల్లు గుచ్చినట్టుగా విలవిలలాడిపోయాడు సారథి. ఆ క్షణంలో మనుషులపై అతనికి అంతులేని కసి, ఏవగింపులు పుట్టాయి. వెంటనే కంచంలో చేయి కడిగేసి పైకి లేచాడతను.

"రాజూ! నేను రూంకి వెళుతున్నా" అంటూ మెస్‌లోంచి వెళ్ళిపోతున్న సారథి వేపు చిత్రంగా చూశాడు రాజు. మరో పదినిముషాల్లో రాజు కూడా భోజనం ముగించుకుని రూముకువచ్చి కుర్చీలో కూర్చుని సిగరెట్ వెలిగించాడు.

"తినకుండా మధ్యలో చేయి కడిగేసి రూంకి వచ్చేశావేం?" సారథి వేపు చూసి అడిగాడు రాజు.

"తినబుద్దెయ్యలేదు"చెప్పాడు సారథి.

"ఎందుకని?"

"ఆ సంఘటన చూశాక..."

"ఏ సంఘటన?"

"దినకర్ ఆ సర్వర్‌ని దారుణంగా కొట్టడం నువ్వూ చూశావుగా?"

"చూశాను"

"అది చూశాక...నా మనసు అదోలా అయిపోయింది. అందుకే అన్నం దిగలేదు'' చెప్పాడు సారథి.

"నువ్వొక సెన్సిటివ్ ఫూల్‌వి. ఆమాత్రానికే నువ్వింతగా ఫీల్‌కావడం ఎందుకు? సారథీ ... ఈ ప్రపంచంలో మనకు ఇష్టంలేనివి ఎన్నో జరిగిపోతూ వుంటాయి. మనం చూసీచూడనట్లు వెళ్ళిపోతూ వుండాలి" రాజు అన్నాడు.

"ఎలా సాధ్యం? మనం మనుషులం"

"మనుషులం గనకే మనం పట్టించుకోకుండా వెళ్ళిపోతూవుండాలి" అన్నాడు మళ్ళీ రాజు.

"ఎందుకని?"

"ఈ ప్రకృతిలో రకరకాల మనస్తత్వాలుంటాయి. వాళ్ళ ప్రవర్తనలు కూడా రకరకాలుగా వుంటాయి. అందరి మనస్తత్వాలను మనం ఒకేలా తీర్చిదిద్దగలమా?"

"రాజూ! ఈ ప్రకృతిలో ఎన్నో జంతువులు ఉన్నాయి. ఆదిమ దశలో మానవుడు కూడా అందులో ఒక జంతువే. అయితే మిగిలిన జంతుజాలాల నుండి మానవుడు వేరు పడ్డాడు క్రమంగా. జంతువులనుండి అలా మనిషిని వేరుచేసిందేమిటి?"

"జ్ఞానం" అన్నాడు రాజు.

"ఈ జ్ఞానం వల్లే మానవుడు ఈ ప్రకృతి స్వభావాన్ని అవగాహన చేసుకుంటూ దాన్ని లోబరుచుకునే ప్రయత్నం చేస్తున్నాడు. కేవలం జ్ఞానమున్నంత మాత్రాన ప్రాణికోటిలో మానవుడు ఉత్తమ ప్రాణి కాలేడు" అన్నాడు సారథి.

"అదేమిటి అలా అంటావు. జ్ఞానమే గదా ఔన్నత్యానికి ప్రామాణికం" అన్నాడు రాజు.

"కాదు. ఈ ప్రకృతిలో కొన్ని విషయాలకు సంబంధించి మనిషికి లేని జ్ఞానం ఇతర ప్రాణులకున్నాయి. ఆకాశంలో వెళ్ళే గద్ద చాలా ఎత్తునుండే నేలమీది గింజల్ని చూడగలుగుతుంది. అంటే దానికి మనిషికన్నా దృష్టి జ్ఞానం ఎక్కువనేగా అర్థం"

అవును అన్నట్టు తలాడించాడు రాజు.

"మనిషి కనిపెట్టలేని నేరస్థుల్ని కుక్కలు వాసనను బట్టి కనిపెట్టేస్తాయి. కొన్ని గంటల్లో భూకంపం రాబోతుందంటే ఆ విషయం గ్రహించి బొరియ




ల్లోని ఎలుకలు బయటకు వచ్చి పరుగులు తీస్తాయి. కానీ మనిషి స్వతహాగా ఆ విషయాన్ని గ్రహించలేడు"

వింటున్నాడు రాజు.

"కనుక జ్ఞానం అనేది మాత్రమే ఔన్నత్యానికి ప్రామాణికం కాదు" అన్నాడు సారథి.

"మరేది ప్రామాణికమంటావు?"

"జ్ఞానాన్ని సమాజ శ్రేయస్సుకు, మానవజాతి పురోగమనానికి, నైతిక విలువల సంరక్షణకు ఉపయోగపడేటట్టు చేసే మనస్తత్వాన్ని కలిగి వుండటమే ఔన్నత్యానికి ప్రామాణికం. అంతేగాని జ్ఞానముండీ సంస్కారహీనంగా మానవత్వం మరిచిపోయి ప్రవర్తించే మానవుడు ఉన్నతుడు కాడు"

''నిజమే సారథీ! అయ్ విల్ అగ్రీ విత్ యు"

"ఇందాక మెస్‌లో ఆ దినకర్ చేసిన పని చూశావుగా. జంతు సమూహం నుండి మానవుడు పూర్తిగా విడిపోయి ఉప గ్రహాల మీద కాలు ఊనుతున్న ఆధునిక యుగంలో పుట్టాడతడు. కానీ ఇంకా అతనిలో జంతు స్వభావం అంతరించ లేదు"

"సారథీ....నిన్నోమాట అడగనా?"

"అడుగు. సందేహించడమెందుకు?"

"మరేం లేదు...మెస్‌లో ఆ దినకర్ సర్వర్‌ను కొట్టిన విషయాన్ని అంతమంది చూసి కూడా పట్టించుకోనప్పుడు నువ్వు మాత్రం ఎందుకు పట్టించుకోవాలి? ఏదో ఘోరం జరిగిపోయినట్టుగా నువ్వెందుకు బాధపడాలి?" అడిగాడు రాజు.

"ఎందుకా...మనసు గాయపడటంలో వున్న మనోబాధ నాకు బాగా తెలుసు గనుక"

"అంటే?''

"అంటే .... ఇందాక మెస్‌లో ఆ సర్వర్ కీసుకు జరిగిన అవమానం – ఒకప్పటి నా అనుభవం లాంటిదే గనుక"

"కాస్త వివరంగా..."

"చెప్తాను రాజూ! పదేళ్ళ వయసులో నేను ఓరోజు ఉదయం...పశువుల కింద ఉన్న పేడ ముద్దల్ని తీసి, దూరంగా పెట్టిన బుట్టలోకి విసురుతున్నాను. అలా విసిరేసినప్పుడు ఓ పేడముద్ద మా అత్తయ్య మీద పొరబాటుగా పడింది. అందుకామె కర్రతో నా వీపు చీరేసింది. ఆ స్మృతి చిహ్నం చూడు..." అంటూ సారథి తన చొక్కా విప్పి వీపును రాజుకు చూపెట్టాడు.

సారథి వీపు మీద మానిపోయిన గాయానికి సంబంధించిన వెడల్పయిన మచ్చ అగుపించింది రాజుకు.

"రాజూ! ఒక మనిషి వ్యక్తిత్వం అతడు చేసే వృత్తిని బట్టి ఉండదు. పూజారి పనిచేసేవాడల్లా పవిత్రుడూ కాదు, కసాయి కొట్టున్నవాడల్లా కర్కశుడూ కాదు. సర్వర్ పనిచేస్తున్నంత మాత్రాన వాడికి వ్యక్తిత్వం, అభిమానం, బాధపడే హృదయం ఉండవని అనుకోవడం చాలా అజ్ఞానం" అంటూ కుర్చీలోంచిలేచి కాట్‌పై వెల్లకిలా పడుకున్నాడు సారథి.

* * *

కాలగర్భంలో రోజులూ, వారాలూ నెలలూ క్రమంగా కలిసిపోతున్నాయి. మాధవరావు సారథికోసం ఇన్‌కం సర్టిఫికెట్ తీసి పంపించాడు. అందులో సంవత్సరాదాయం తక్కువ మొత్తంగా వేసి పంపడంవల్ల సారథికి కూడా స్కాలర్ షిప్ మంజూరైంది. కనుక హాస్టల్లో

అతడు పైసాకూడా కట్టనవసరంలేదు.

సారథికి సిగరెట్లు కాల్చడం, బ్రాందీ విస్కీలాంటి మత్తు పానీయాలు తాగడం, సినిమాలు ఎక్కువగా చూడటంలాటి అలవాట్లు బొత్తిగాలేవు. మెస్ బిల్స్ కట్టే పనేలేదు. అతని బట్టలుకూడా వారానికి ఓసారి అతడే ఉతుక్కుని ఇస్త్రీచేయించుకుంటాడు. మొత్తానికి నెలకు యాభై రూపాయలకంటే ఎక్కువ ఖర్చు కావడం లేదు సారథికి.

సాయంత్రం నాలుగుగంటలు అవుతోంది. రాజు, సారథి, దామోదరం, పరిమళ, సుగుణ, సీత వీళ్ళంతా యూనివర్సిటీ క్యాంటిన్‌లో ఓ టేబుల్‌చుట్టూ కూర్చుని సరదాగా కబుర్లు చెప్పుకుంటూ సర్వర్ తీసుకురాబోయే టీలకోసం ఎదురు చూస్తున్నారు.

"ఆ....ఏమిటి దామోదరం విశేషాలు? నువ్వీమధ్య కొత్త కథలుగానీ, కవితలుగానీ రాశావా?" దామోదరంవేపు చూసి అడిగాడు సారథి.

"రెండ్రోజులక్రితం ఓ కథ రాశాను గురూ"

"కథ పేరేమిటి?"

"'మనసిచ్చినదే నిజమైతే....' అని టైటిల్ పెట్టా" అన్నాడు దామోదరం సంబరపడిపోతూ.

"ప్రేమకథలా వుందే" సారథి అన్నాడు.

"అవును గురూ"

"నాకు భలేమంట దామోదరం"

"ఏమిటి..ప్రేమకథలంటేనా? ప్రేమంటేనా?" అన్నాడు రాజు నవ్వేస్తూ.

"ఈ రోజుల్లో వెలువడుతున్న చాలా పత్రికల్లో ప్రేమకథలు తప్ప మరోటి అగుపించడంలేదు. అంటే ఈనాటి రచయితలకీ, రచయిత్రులకీ జీవితంలో ఒక్క ప్రేమతప్ప మరో సమస్య అగుపించడంలేదేమో. సాహిత్య ప్రయోజనం మరిచిపోయారు వీళ్లు"

"అంటే సారథిగారూ! సాహిత్య ప్రయోజనం ఏమిటని మీ అభిప్రాయం?" ప్రశ్నించింది పరిమళ.

"వాస్తవిక జీవితాన్ని చిత్రించడం కన్నా సాహిత్యానికి మరో ప్రయోజనం వుంటుందని నేననుకోను"

"అయితే ... ప్రేమ అనేది కూడా జీవితంలో ఒక భాగం కాదా?" మళ్ళీ అడిగింది పరిమళ.

"కావచ్చు.కానీ కేవలం ఒక్క ప్రేమ మాత్రమే జీవితం కాదు. ఈనాటి పత్రికా సాహిత్యం చాలావరకు ప్రేమమయం అయిపోయింది. నేటి రచయిత్రులు, రచయితలు పాఠకుల్ని చెడగొడుతున్నారు"

"పాఠకుల్ని చెడగొడుతున్నారా?"

"అవును. సమస్యలమయమైన జీవిత వాస్తవాన్ని పాఠకులు తాత్కాలికంగా మరిచిపోయేలా చేస్తోంది నేటి సాహిత్యం. అంటే నేడు సాహిత్యం ఓ మద్యంలా తయారైంది. పాఠకులకు సాహిత్యం ఒక టానిక్‌లా ఉపయోగపడాలే తప్ప మద్యంలా ఉపయోగపడకూడదు"

"అబ్బ! ఆపేయండి మీ సాహిత్య చర్చ. నాకు తలనొప్పి పుడుతోంది. అన్నట్టు... యూనివర్సిటీ ఎలక్షన్స్‌దగ్గర పడుతున్నాయి" అన్నాడు రాజు టాపిక్ మారుస్తూ.

"ఎలక్షన్ డేట్ అనౌన్స్ చేశారా?" సుగుణ అడిగింది రాజు వేపుచూసి.

"ఇంకా లేదు. రేపు నెల అయిదో తారీఖున అని అందరూ అనుకుంటు

న్నారు" చెప్పాడు రాజు.

"మన క్లాస్ రిప్రజంటేటివ్‌గా ఎవరు పోటీ చేయబోతున్నారు?" అడిగాడు సారథి.

"ఓ గ్రూప్ తరఫున నాగేంద్ర నాయుడు, మరో గ్రూప్ తరఫున విశ్వనాథ రెడ్డి పోటీ చేసేటట్టున్నారు. అప్పుడే వాళ్ళు ప్రచారం మొదలెట్టారు కూడా" అన్నాడు రాజు.

"సారథిగారూ! మన క్లాస్ రిప్రజంటేటివ్‌గా మీరు పోటీచేయకూడదూ" అంది సుగుణ.

"అవునండోయ్; మీరుగానీ పోటీ చేస్తే..మా లేడీస్‌లో చాలా ఓట్లు మీకే" అంది పరిమళ.

"ఎన్నికలలో నిలబడటంలాంటి పనికిమాలిన పనులు నేను పొరబాటుగా నైనా చెయ్యనులెండి'' అన్నాడు సారథి.

ఆ మాటకు పరిమళ ముఖం చిన్న బోయింది.

ఇంతలో సర్వర్ టీ కప్పులు తెచ్చి టేబుల్‌పై పెట్టాడు. అందరూ ఒక్కో కప్పును అందుకున్నారు.

"క్లాస్‌లో నాకు గ్రామర్ సరిగ్గా అర్థంకావడంలేదు సారథీ" అన్నాడు రాజు.

"భయపడకులే. రూంలో నేను వివరంగా చెబుతాను" హామీ ఇచ్చాడు సారథి.

"నిజానికి సంఘానికి పోలీసులు ఎలాంటివారో భాషకు వ్యాకరణం అలాంటిది"

"ఎలావుంది మన కొటేషన్ – అని అడగలేదేం ?" అన్నాడు సారథి నవ్వుతూ.

"అదా...అది మన కొటేషన్ కాదులే. అది శ్రీశ్రీ చెప్పినమాట" అన్నాడు రాజు.

సారథి చేతిలోని టీ కప్పు కొద్దిగా కదలడంచేత కప్పులోని టీ కొంత తొణికి సారథి ప్యాంటు మీదపడింది.

"అరెరే..ప్యాంట్‌మీద టీ ఒలకబోసుకున్నారే. ఇక ఉతికితేగాని ఈ మరకలు పోవు. పైగా మీకు ఒకటి రెండు ప్యాంట్స్‌కంటే ఎక్కువ లేనట్టుంది" అంది పరిమళ నవ్వుతూ.

ఆ మాటతో చటుక్కున తలెత్తి పరిమళ వేపు సూటిగా చూశాడు రాజు. సారథి పేదరికాన్ని పరోక్షంగా ఎత్తి చూపిన పరిమళపై పట్టరానంత కోపం వచ్చింది రాజుకు.

ఎన్నోవేల సంవత్సరాలక్రితం భావ ప్రకటనకోసం మనుషులు ఏర్పరచుకున్న భాష ఈనాడు పక్కవాడిని బాధించే సాధనంగా పరిణమించింది.

పరిమళ మంచి అందగత్తె. బాగా డబ్బున్న ఇంట్లో పుట్టింది. ప్రతి అణువు లోనూ అహం ఉట్టిపడుతుంది. పొగ రెక్కువ. కనుక ఎవరినైనా ఎంత మాటైనా అనేస్తుంది. ఎం.ఏ చదువు తోంది. కానీ ఆ అమ్మాయి మాటల్లో సంస్కారం ఏ కోశానా అగుపించదు.

"అందంగా వుంటే ఏం ప్రయోజనం గురూ? కుక్కపిల్లకూడా పుట్టినప్పుడు అందంగానే ఉంటుంది. కానీ పెంట తినే బుద్ధి పోదుగా. పేరులో పరిమళముంది. అందంలో పరిమళముంది. కానీ గురూ... మాటల్లోనూ ప్రవర్తనలోనూ అంతా కంపే" అని పరిమళ గూర్చి అప్పు డప్పుడూ అంటూవుంటాడు దామోదరం.

పరిమళకు డ్రింక్స్ అలవాటు కూడా ఉందని ఉమెన్స్ హాస్టల్లో అనుకుంటూ

వుంటారు. ఆ అమ్మాయి నడుస్తుంటే అచ్చం మగాడు నడిచినట్లే ఉంటుంది. చేష్టలు కూడా మగాడి చేష్టల్లాగా వుంటాయి. అందుకే ఉమెన్స్ హాస్టల్లోని అమ్మాయిలు కొందరు పరిమళకు 'టు యిన్ వన్' అని నిక్‌నేమ్ పెట్టారు.

'టు యిన్ వన్' అంటే అటు మగాడి లక్షణాలూ, ఇటు ఆడదాని లక్షణాలూ వున్నాయని అర్థం. ఇంకా సూటిగా, చెప్పాలంటే కొజ్జా అని అర్థం.

తనకు ఇలాంటి నిక్‌నేమ్ పెట్టినట్లు పరిమళకు తెలియదు.

టీ బిల్ తనే ఇద్దామని పరిమళ పర్సు తెరిచింది. అందులో కేవలం ఒక్క రూపాయి మాత్రమే వుంది. తన పర్సులో డబ్బు పెట్టుకుని రావడం మరిచిపోయి నందుకు మనసులోనే తెగ బాధపడి పోయింది పరిమళ. పక్కనే కూర్చున్న రాజు ఇదంతా పరిమళకు తెలియకుండా గమనిస్తూనే ఉన్నాడు.

ఇంతలో సర్వర్ వచ్చి టీ బిల్‌ను టేబిల్‌మీద పెట్టాడు. రాజు ఆ బిల్ అందుకున్నాడు.

"బిల్ ఇటివ్వండి...నేనిస్తాను" తన పర్సులో అంత డబ్బు లేకపోయినా మాట పనసకు అలా అంది పరిమళ.

"వద్దులెండి... నేనే ఇస్తాను. పైగా మీ పర్సులో ఎప్పుడూ ఒక్క రూపాయి కంటే ఎక్కువ డబ్బులు ఉండేటట్లు లేదు" కసిగా కావాలనే అన్నాడు రాజు.

రాజు అన్న ఆ మాటతో చాచి లెంప కాయ కొట్టినట్లయింది పరిమళకు. అవమానంతో ఆ అమ్మాయి ముఖం కంచగడ్డలా తయారైంది. ఆమెలోని అహం నడుము విరగ్గొట్టబడిన నాగు పాములా బుసలుకొట్టింది.

"మీకు తెలుసా నా పర్సులో ఎప్పుడు ఎంత డబ్బు వుంటుందనే సంగతి?" కోపంగా అడిగింది పరిమళ.

"మీకు తెలుసా సారథికి ఎన్ని ప్యాంట్స్ వున్నాయనే సంగతి?" సూటిగా అడిగాడు రాజు.

"ఓహో... అందుకన్నారన్నమాట"

"ఈ ఊరికి ఆ వూరు ఎంత దూరమో... ఆ వూరికీ ఈ వూరు అంతే దూరం లెండి" అన్నాడు రాజు.

"అయినా...ఆ మాట నేను మిమ్మల్ని అనలేదుగా" అంది పరిమళ.

"మీరు సారథిని అన్నా ఒకటే, నన్ను అన్నా ఒక్కటే" అంటూ సిగరెట్ వెలిగించాడు రాజు.

"బుద్ధిలేనివాళ్ళతో ఇలా క్యాంటీన్‌కు ఎప్పుడూ ఇక రాను" అంటూ లేచింది పరిమళ.

"కానీ మేం మాత్రం వస్తామండీ! అన్నట్టు ఓ మాట గుర్తుంచుకోండి. నాలుక అనేది నాగుపాము లాంటిది. దాన్ని ఎప్పుడూ కంట్రోల్లో పెట్టుకోవాలి. స్వేచ్ఛగా పదిలేస్తే కాటెయ్యబోయి... అదే దెబ్బలు తింటుంది. దామోదరం! ఎలావుంది మన కొటేషన్"

"ఇప్పుడే మనం తాగిన టీలా చాలా వేడి వేడిగా వుంది రాజూ" అన్నాడు దామోదరం.

పరిమళ ముఖం మాడ్చుకుంటూ పనరుసలాడుతూ క్యాంటీన్‌లోంచి వెళ్ళి పోయింది.

"ఈ పరిమళ హాస్టల్లో కూడా ఇంతే నండీ! పొగరుగా మాట్లాడి... అందరి తోనూ పోట్లాడుతుంది" అంది సుగుణ.

"శ్రీమంతుల బిడ్డని అహంలెండి" అంది సీత.




"శ్రీమంతుల బిడ్డలయితే వాళ్ళ ఇంట్లోని పనిమనుషులతో చులకనగా మాట్లాడమనండి. అంతేగానీ ఇలా పొగరు మాటలు మాట్లాడితేఎవరువూరుకుంటారు" అన్నాడు రాజు.

"నోటి తీట అలాంటిది పాపం. ఆ తీట పోవాలంటే...., ఒక్కటే మార్గ ముంది" అన్నాడు దామోదరం.

"ఏమిటండీ అది?'' అడిగింది సీత.

"మరేం లేదు. ఎర్రగా కాలిన ఇనుప కడ్డీతో నోటి చుట్టూ వాతపెట్టెయ్యడమే" దామోదరం అలా అనగానే మిగిలిన వాళ్ళంతా గొల్లుమంటూ నవ్వేశారు.

"ఫర్వాలేదు. ఈమధ్య దామోదరం కూడా బాగా జోకేస్తున్నాడే" అన్నాడు రాజు.

"సహవాస దోషం గురూ'' అంటూ పైకి లేచాడు దామోదరం. అందరూ క్యాంటీన్‌లోంచి బయటపడ్డారు.

"అందరం సరదాగా కబుర్లు చెప్పుకుంటూ టీ తాగుదామని క్యాంటీన్ కొచ్చాం. కానీ మన మధ్య వాతావరణం హఠాత్తుగా మారిపోయింది. ఇకనుండి పరిమళ మనల్ని అందరినీ శత్రువుల్లా చూస్తుందేమో" అన్నాడు సారథి.

"చూస్తే కొంపలు మునిగిపోయిందేమీ లేదులే" అంటూ తేలిగ్గా తీసిపారేశాడు రాజు.

''సరే... నేను నేరుగా లైబ్రరీకి వెళ్ళి అయిదు గంటల వరకు చదువుకుని అటే ట్యూషన్స్ చెప్పడానికిటౌన్‌లోకి వెళతాను. అన్నట్టు రాజూ! నువ్వు పొయిట్రీనోట్సు అడిగావు కదూ...నా సూట్ కేస్ అడుగున వుంది తీసుకో" అంటూ యూనివర్సిటీ లైబ్రరీవేపు వెళ్ళిపోయాడు సారథి.

సుగుణ, సీతలు కూడా ఉమెన్స్ హాస్టల్ వేపు నడక సాగించారు. పోస్టాఫీసు వేపు వెళ్ళిపోయాడు దామోదరం. రాజు మాత్రం సారథి మనస్తత్వం గురించే ఆలోచిస్తూ... మెల్లగా తమ హాస్టల్ వేపు నడక సాగించాడు.

ఏమిటో సారథి తత్వం! ఇందాక ఆ పరిమళ క్యాంటీన్‌లో తన పేదరికాన్ని ఎత్తిపొడిచినా సారథి ఒక్కమాట కూడా మాట్లాడలేదు. ఒక్కోసారి చిన్న విషయానికే పెద్దగా బాధపడిపోతాడు సారథి.

ఒక్కోసారి మాత్రం బాధపడవలసిన విషయం గురించి అసలు పట్టించుకోడు. తన వ్యక్తిగత జీవితం గురించి ఏమీ చెప్పడు. ఇతరుల గురించి ఏమీ అడగడు-అలా ఆలోచిస్తూ హాస్టల్లోని తన రూంకు చేరుకున్నాడు రాజు.




క్లాస్‌రూం చాలా నిశ్శబ్దంగా వుంది. ఒక్క రీడర్ గొంతు మాత్రం ఆ రూంలో ప్రతిధ్వనిస్తోంది. ఆయన చాలా సీరియస్‌గా లెసన్ చెబుతున్నాడు. స్టూడెంట్స్ అంతా పాఠం శ్రద్ధగా వింటున్నారో లేదో తెలియదుగానీ వింటున్నవాళ్ళలాగే ముఖాలు పెట్టి నిశ్శబ్దంగా వున్నారు.

ఆ రీడర్ పేరు హరినారాయణ. ఆయనకు సంస్కృత వ్యాకరణం బాగా వచ్చు. సంస్కృతకావ్యాలు చాలావరకు ఆయన

నాలుకమీదే ఉంటాయి. నిస్సందేహంగా హరినారాయణ మంచి పండితుడే. ఈ విషయం ఆ తెలుగు డిపార్ట్‌మెంట్‌లో ప్రతి ఒక్కరూ ఒప్పుకుంటారు.

అయితే....చాలా మేధావినంటూ ఆయన ఎప్పుడూ ఫీలైపోతుంటాడు. తను పండితుడనే గర్వం ఆయన ఒంట్లో అణువు అణువులోనూ వుంది. హరినారాయణంటే స్టూడెంట్స్‌కి చాలా భయం. ఎందుకంటే క్లాస్‌లో మెత్తగా మాట్లాడుతూనే ఆయన అందరిముందూ పరువు తీసేస్తాడు.

వాడికేమీ తెలియదు, వీడికేమీ తెలియదు - అంటూ ప్రతి క్లాసులోనూ ఆయన ఎవడినో ఒకడిని తిట్టడం, తన సుపీరియారిటీ కాంప్లెక్స్‌ను అందరి ముందూ ప్రకటించుకోవడం...ఇదంతా సారథికి బొత్తిగా నచ్చడంలేదు. అసలు ఎం.ఏకి ఇంటర్వ్యూ జరిగినరోజే ఆ రీడర్‌పై సారథికి మంచి భావం ఏర్పడ లేదు.

ఆ రీడర్ 'అమృతం కురిసిన రాత్రి'ని సారథివాళ్ళకు టీచ్ చేస్తుంటాడు. ఆయన ఎంతటి పండితుడయినా సాహిత్య పరి జ్ఞానం ఎంతగావున్నా...ఆధునిక తెలుగు కవిత్వంపట్ల ఆయనకు సరియైన అవ గాహనలేదనే నిజాన్ని మొదటి రెండు క్లాసుల్లోనే సారథి సులభంగా గ్రహించ గలిగాడు.

క్లాసులో ఒక్కసారయినా ఆ రీడర్ 'మీకేమీ రాదు. అయినా మీకు ఎం.ఏ డిగ్రీలు వచ్చేస్తాయి. రీసెర్చిలో సీటు కూడా వచ్చేస్తుంది. తర్వాత అదిగో...ఆ వరండాలో ఫైల్స్ పట్టుకుని మేధావుల్లా తిరుగుతుంటారు. మీలాంటివాళ్ళకు పాఠాలు చెప్పడం నా ఖర్మ' అని అన కుండా వుండలేదు. ఎప్పుడూ అలా అనడం ఆయన అలవాటు.

'అసలు మార్క్సిజం అనేది నన్నయ భారతంలోనే రేఖామాత్రంగా కన్పిస్తుంది' అని ఆ రీడర్ వాదించినా - పెంటమీద రాయి విసరడమెందుకులే అని ఎవరూ ఆయనతో ప్రతివాదనలు చెయ్యరు. అలా వాదనలు చెయ్యకపోవడానికి ఆయన మరో అర్థాన్ని కారణంగా గ్రహించి సంతోషపడిపోతుంటాడు.

ఆయనకు ప్రాచీన కవిత్వమంటే చాలా ఇష్టం. ప్రాచీనకవులంటే బోలెడంత భక్తి. ఆధునిక కవిత్వమంటే మహామంట. గిడుగు రామ్మూర్తిగారు గ్రాంథికభాషను బలంగా తంతే...అది ఈ తరంలో ఈ రీడర్ నోట్లో జాగ్రత్తగా తలదాచుకుంది. వ్యావహారికమంటే ఇప్పటికీ ఈయనకు పడదు.

ప్రతి క్లాసులోనూ ఏదోరకంగా అవ కాశాన్ని సృష్టించుకుని ఈ రీడర్ ఆధునిక కవులనందరినీ పేరుపేరునా తిట్టడం సారథికి మరీ బాధన్పించింది. క్లాస్‌లో రీడర్‌తో వాదం పెట్టుకుందామని చాలా సార్లు అనుకున్నాడు సారథి. అయినా ఇతడి జోలికి వెళ్ళడం ఎందుకులే అని మానుకున్నాడు.

ఆవాళ 'అమృతం కురిసిన రాత్రి' పుస్తకంలోని ఓ ఖండికను రెండుసార్లు చదివి దాని గురించి ఆ రీడర్ వివరించి చెబుతున్నాడు.

"వెలుగును వెనక్కి నెట్టుతూ రేపటి
రోజుకు
పదివేల సంవత్సరాలనాటి
పాతముఖాన్ని అతికించేందుకు
ఒక హాహాహూహూవు ప్రయత్నిస్తున్న
ప్రాతఃకాలాన..."

అంటూ ఆ మూడు పంక్తుల్ని చదివి

ఆపాడు రీడర్.

"అందరూ జాగ్రత్తగా వినండి. ఇక్కడ కవి 'హాహాహూహూ' అని ప్రయోగించాడు. హాహాహూహూ అంటే అదోవిధమైన శబ్దం..." అంటూ ఆ రీడర్ ఇస్తున్న వివరణ వింటుంటే సారథికి నిజంగా మతిపోయినట్లయింది.

రీడర్ ఇస్తున్న భాష్యాన్ని సారథి భరించలేకపోయాడు. యూనివర్సిటీ స్థాయిలోవున్న ఒక రీడర్‌కు ఈమాత్రం తెలియకపోవడం సారథికి ఆశ్చర్యంగా వుంది.

"ఎక్స్‌క్యూజ్ మీ సార్" అంటూ సారథి మెల్లగా పైకిలేచి నిలబడ్డాడు.

"ఏమిటి?" చికాగ్గా చూశాడు రీడర్.

"మీ రిక్కడ కొంత పొరబడుతున్నట్టుగా అన్పిస్తోంది" చాలా వినయంగా చెప్పాడు సారథి.

"పొరబాటా... ఎక్కడ?"

"హాహాహూహూ అనే పదంవద్ద"

"ఏమిటి నే చెప్పిన పొరబాటు?"

"హాహాహూహూ అంటే అదో విధమైన శబ్దం అని చెప్పారు" మెల్లగా అన్నాడు సారథి.

"అవును... చెప్పాను"

"కానీ దాని అర్థం అదికాదు సార్"

"ఇంకేమిటి?" రీడర్ ప్రశ్న.

"హాహాహూహూ అనేది విశ్వనాథవారు రాసిన ఓ పుస్తకం పేరు. ప్రధానంగా సాంప్రదాయ వాదులయిన విశ్వనాథ సత్యనారాయణగారి తిరోగమన స్వభావాన్ని ఇందాక మీరు చదివిన ఆ మూడు పంక్తుల్లో కవి అవహేళనచేసి నిరసిస్తున్నాడు" అంటూ ఆ మూడు పంక్తుల అంతరార్థం వివరించాడు సారథి.

సారథి అలా చెప్పగానే ... తన వీపు మీద ఎవరో మరిగిన నూనెను పోసినట్లయింది రీడర్‌కు. అవమానంతో అతడి ముఖం కుంచించుకుపోయింది.

"అహా...దానర్థం అదా? పొరబాటుగా నువ్వు లెక్చరర్ వైతే...అప్పుడు ఇలాగే చెప్పు" సారథి వేపు చూస్తూ చాలా వెటకారంగా అన్నాడు రీడర్.

ఆయన ఆ మాట అనగానే ఆ క్లాస్‌లోని వాళ్ళంతా గొల్లున నవ్వేశారు. రీడర్ తనను అలా అనడంతో సారథికి ఒళ్లు మండిపోయింది.

"నేనే కాదు సార్..ఎవరు లెక్చరరైనా, రీడరైనా, ప్రొఫెసరైనా ఆ పంక్తులకు అర్థం చెప్పవలసివస్తే...నేను ఇందాక చెప్పినట్లే చెప్పి తీరాలి"

"ఎందుకో"

"ఎందుకంటే...అది కవి దృక్పథం గనుక. కవి దృక్పథం మనకు అర్థం కానప్పుడు... మనకర్థమైన విషయాన్ని కవి దృక్పథంగా భావించి చెప్పడం పొరబాటు. పైగా ఆ కవికి అన్యాయం చేసినవాళ్ళమౌతాం" అని చెప్పి కూర్చున్నాడు సారథి.

ఆ మాటతో తన కనుపాపపై కలబంద ముల్లు దిగబడినంత పనైంది రీడర్‌కు. సరిగ్గా అప్పుడే ఆ అవర్ అయిపోయినట్లు యూనివర్సిటీ సైరన్ కూసింది.

క్లాసురూంలోంచి వెళ్ళిపోతూ ఆ రీడర్ సారథి వేపు ఓ చూపు చూశాడు. ఆ చూపు నిజంగా చూపులాలేదు ... పాముకాటులా వుంది.

'ఈ చండశాసనుడితో పెట్టుకున్నావు నువ్వు. ఎం.ఏ ఇంకేం పాస్ అవుతావు' అన్నట్టుగా క్లాస్‌లోని చాలామంది సారథి




వేపు చూశారు.

'తప్పు చెప్పాడు ... సరిదిద్దాను. అందుకు ఆయన ఏమనుకున్నా అయ్ డోన్ట్ కేర్' అన్నట్టు చూశాడు సారథి.

"ఏమిటి సారథీ! ఆ రీడర్‌తో ఎందుకు పెట్టుకున్నావు. ఆయన అసలే మూర్ఖుడు. స్టూడెంట్ తనకన్నా తెలివైన వాడుగా కన్పిస్తే వీళ్లు భరించలేరు. నీమీద ఇకనుండి ఆ రీడర్ ఓ కన్నేసి వుంటాడేమో'' హాస్టల్‌కు వచ్చాక సారథితో అన్నాడు రాజు.

"ఏంచేస్తాడేం?'' అన్నాడు సారథి.

''తన పేపర్లో నీకు మార్కులు కత్తిరిస్తాడేమో''

"అంతేగా ఆయన చేయగలిగింది''

''ఆయనంత ఘోరంగా వ్యాకభాష్యం చెబుతుంటే క్లాస్‌లో ఒక్కరూ నోరు తెరిచి అడగలేదు. నువ్వు కూడా సైలెంట్‌గా వుంటే సరిపోయేది" అన్నాడు రాజు సిగరెట్ వెలిగించు కుంటూ.

"రాజూ! ఆ రీడర్ని అవమానించడం కోసం గానీ లేక క్లాస్‌లో నా తెలివిని ప్రకటించుకోవడం కోసం గానీ నేను ఆయన పొరబాటును ఎత్తిచూపలేదు. ఆయనంత భయంకరంగా తప్పు చెబు తుంటే నేను భరించలేకపోయాను" అన్నాడు సారథి.

"ఆయనకి ఆ పదానికర్థం తెలిసినట్టు లేదు"

"ఏ ఒక్క వ్యక్తికీ అన్ని విషయాలు తెలియవు. కనుక రీడర్‌కు అది తెలియక పోవడం తప్పుకాదు. కానీ తెలుసుకోక పోవడం తప్పు. క్లాస్‌కు వచ్చేముందు వీళ్లు ఎందుకు ప్రిపేరైరారు? పైగా వేలకు వేలు జీతాలు కూడా తీసుకుంటున్నారు"

"వీళ్లకి బెల్ అండ్ బిల్ ఇవి రెండే ముఖ్యం. అంతేగానీ స్టూడెంట్స్‌కి నాలుగు ముక్కలు నేర్పించాలనే తాపత్రయం వీళ్ళకు ఏ కోశానా ఉండదు" రాజు అన్నాడు.

"నేను దేన్నయినా భరించగలను.కానీ బాధ్యతారహితమైన అధ్యాపకుడిని మాత్రం భరించలేను. తను చేసిన పొర బాటును ఎవరైనా ఎత్తి చూపెట్టినా వీళ్లెందుకు దిద్దుకునే ప్రయత్నం చెయ్యరో నాకర్థం కావడంలేదు"

"అందుకు గొప్ప సంస్కారవంతులై వుండాలి.నువ్వు క్లాస్‌లో ఆ రీడర్ తప్పును ఎత్తి చూపెట్టగానే ఆయన పొరబాటు దిద్దు కోవడం మాని నిన్ను అవహేళన చేశాడు. ఇదీ వీళ్ళ సంస్కారం" అంటూ రీడర్ని తిట్టడం మొదలెట్టాడు రాజు.

* * *

సాయంత్రం అయిదు గంటలు కావస్తోంది. ఆ బజార్లో తలవంచుకుని వేగంగా నడుస్తున్నాడు సారథి. బజారు చాలా రద్దీగా వుంది. షాపింగ్‌కు వచ్చిన యూనివర్సిటీ అమ్మాయిల గుంపు వెంటబడి...కొందరు యువకులు బూతు జోకులేస్తూ, కామెంట్స్ విసురుతూ అదేపనిగా అల్లరి చేస్తున్నారు.

"సారథి గారూ" అంటూ వెనకనుండి తనను ఎవరో పిలవడంతో సారథి చటుక్కున ఆగి వెనకకు తిరిగి చుట్టూ కలియ జూశాడు.

"ఇలా రండి" అంటూ పుస్తకాల షాప్ వద్ద నిలబడివున్న హర్షవర్ధన్ చేయి విసరడంతో సారథి పుస్తకాల షాప్‌వేపు నడక సాగించాడు.

హర్షవర్ధన్‌కు ముప్పయి అయిదు సంవత్సరాలుంటాయి. అతడు ఆ వూళ్ళో

టూటౌన్ పోలీస్‌స్టేషన్‌లో సబ్‌ఇన్ స్పెక్టర్‌గా పనిచేస్తున్నాడు. ఆయన పిల్లలకు సారథి రోజూ సాయంత్రం అయిదు నుండి ఆరువరకు ట్యూషన్ చెబుతాడు.

"ఎక్కడికి వెళుతున్నారు? మనింటికేనా?" దగ్గరకు వచ్చిన సారథిని ప్రశ్నించాడు హర్షవర్ధన్.

అవును అన్నట్టు తలాడించాడు సారథి.

"నేనూ వస్తానుండండి..కలిసివెళ్దాం"

"మీరిక్కడున్నారేమిటి?" అడిగాడు సారథి.

"బుక్స్ అవసరమైతే కొనుక్కుందామని షాప్‌కి వచ్చాను" చెప్పాడు హర్షవర్ధన్.

"ఎవరికి...పిల్లలకా?"

"కాదండీ...నాకే"

"మీకా?" ఆశ్చర్యంగా అడిగాడు సారథి.

"అవును సారథిగారూ..నాకే.ఈమధ్య గ్రూప్ వన్ ప్రిలిమనరీ పరీక్షలు పాస య్యానులెండి. ఇక ఫైనల్స్ రాయాలి. గ్రూప్‌వన్‌లో ఆప్షనల్‌గా తెలుగు, హిస్టరీ తీసుకున్నాను. హిస్టరీ నాకు ఎటూ టచ్ వుంది. తెలుగే కొంత కష్టంగా వుంది. దానికి సంబంధించిన బుక్స్ కొనుక్కుందామని ఇలా వచ్చాను" చెప్పాడు హర్షవర్ధన్.

"తెలుగుకు సంబంధించి మీరు ఏయే బుక్స్ చదవవలసివుంటుంది?" అడిగాడు సారథి.

"చాలా బుక్స్ చదవాల్లెండి. ఆ డీటెయిల్స్ సిలబస్‌లో ఇచ్చాడు"

"మీ దగ్గర సిలబస్ వుందా?"

"ఆఁ...వుందండి"

"ఓసారిటివ్వండి...చూద్దాం"

"ఓకే'' అంటూ చేతిలో వున్న కవర్లోంచి సిలబస్ పేపర్ని తీసి సారథికిచ్చాడు హర్షవర్ధన్.

"ఈ పుస్తకాలన్నీ కొనాలంటే..చాలా డబ్బు అవుతుందండీ" అన్నాడు సారథి సిలబస్ పూర్తిగా చదివి.

"నిజమే ... కానీ కొనక తప్పదు కదా"

"ఎందుకులెండి డబ్బు దండగ. ఈ సిలబస్‌లో వున్న పుస్తకాల్లో చాలా భాగం నా దగ్గరున్నాయి. కావాలంటే ఇస్తాను. చదివి ఇచ్చేయండి. నా దగ్గరలేని బుక్స్ కూడా మా యూనివర్సిటీ లైబ్రరీలోంచి తీసిస్తాను" అన్నాడు సారథి.

"మీరింతగా సహాయం చేస్తానంటే నేను వద్దంటానా? మీరు ఈ పుస్తకాలన్నీ ఇచ్చారంటే చదువుకుని మళ్ళీ జాగ్రత్తగా ఇచ్చేస్తాను'' అన్నాడు హర్షవర్ధన్.

"అలాగే...ఇస్తాల్లెండి"

"హమ్మయ్య! ఈ పుస్తకాల బారి నుండి నన్ను రక్షించారు. సరే.... రండి అలా వెళ్ళి టీ తాగి తర్వాత ఇంటికెళ్దాం" అంటూ ఎదురుగా వున్న ఇరానీ హోటల్లోకి నడిచాడు హర్షవర్ధన్.

ఆ హోటల్లో జనం చాలా పలచగా వున్నారు. సారథి, హర్షవర్ధన్‌లు వెళ్ళి ఓ టేబుల్ దగ్గర కూర్చున్నారు.

"బిస్కెట్స్ ఏమైనా తీసుకుంటారా?"

"అబ్బే..వద్దండీ" అన్నాడు సారథి.

"ఓకే! రెండు టీలు" దగ్గరున్న సర్వర్ వేపు చూసి ఆర్డరిచ్చాడు హర్షవర్ధన్. రెండు నిముషాల్లో సర్వర్ వేడి వేడిగా రెండు కప్పుల్లో టీ తెచ్చి వాళ్ళ ముందుంచాడు.

"సారథిగారూ! నాకు యూనివర్సిటీ అన్నా, యూనివర్సిటీలో చదువుతున్న





అమ్మాయిలన్నా చాలా మంచి అభిప్రాయం వుండేది" అన్నాడు హర్షవర్ధన్ టీ కప్పు అందుకుంటూ.

"ఇప్పుడు లేదా సార్?" అడిగాడు సారథి.

"లేదు...ఆ అభిప్రాయం రాత్రే అడుగంటిపోయింది. ఆ స్థానంలో అసహ్యం ఏర్పడింది"

"ఏమైంది సార్ రాత్రి?"

"రాత్రి నేనూ, మా సర్కిల్ ఇన్స్పెక్టరూ, కొందరు కానిస్టేబుల్స్ కలిసి.. కొన్ని లాడ్జెస్‌మీద రెయిడ్ చేశాం"

"చేస్తే?"

"పట్టుబడిపోయారు"

"ఎవరు సార్?"

"అమ్మాయిలు"

"కడుపు కోసం పడుపు వృత్తి చెయ్యడంకంటే ఈరోజుల్లో కొందరాడ వాళ్ళకు మరో మార్గంలేదు"

"సారథిగారూ! రాత్రి మాకు పట్టుబడిన అమ్మాయిలు కడుపుకోసం పడుపు వృత్తిచేసేవాళ్ళు కాదు"

"మరి?"

"ఒక్కొక్కళ్ళకొక్కొక్కన మీ యూనివర్సిటీ లోని ఉమెన్స్ హాస్టల్ అమ్మాయిలు"

"సార్! మీరు చెబుతున్నది..."

"అక్షరాలా నిజం. మొత్తం ముగ్గురు. బాగా ధనవంతుల బిడ్డల్లాగే వున్నారు"

"అయితే లాడ్జికి ఎందుకెళ్ళినట్టు?"

"డబ్బుల కోసం కాదు"

''మరి?''

"ఆ అబ్బాయిలు వాళ్ళ కొలీగ్స్ అట. తమకి కాబోయే మొగుళ్ళట. అందుకని సరదాగా వాళ్ళతో గడపడం కోసం అలా లాడ్జిలో రూమ్స్ తీసుకున్నారట. మొదట కొంత లెవల్‌గా గ్రమెటికల్ మిస్టేక్స్ వున్నా ఇంగ్లీష్‌లోనే మాట్లాడారు"

"తర్వాత..." ఆతృతగా అడిగాడు సారథి.

''మేం పోలీసులం కదా...ఇటువంటి కేస్‌లు చాలా చూసివుంటాం. మొదట్లో వాళ్ళు యూనివర్సిటీ అమ్మాయిలమని ఒప్పుకోలేదు. స్టేషన్‌లో పడేసి కేస్ బుక్ చేస్తామంటూ అదరగొట్టాం...బాగా భయపెట్టాం" అన్నాడు హర్షవర్ధన్

"అప్పుడు ఒప్పేసుకున్నారా?"

"ఒప్పుకున్నారు. వాళ్లు ఏయే డిపార్ట్‌మెంట్ స్టూడెంట్స్ అన్నది, వాళ్ళ పేర్లు మొదలైన వివరాలు భయంతో చెప్పేశారు. అయితే వాళ్ళ వివరాలు నేను మీకు చెప్పడం బాగుండదు"

"వద్దులెండి ... తర్వాత ఏమైందో చెప్పండి"

"వాళ్ళు భయపడిపోయి తమను వదిలెయ్యమని బతిమాలారు. కాళ్ళావేళ్ళా పడ్డారు. ఓ అమ్మాయి మాకు లంచంగా ఇవ్వడానికి తన చేతికున్న బంగారు గాజు ఇవ్వబోయింది. కానీ మా సర్కిల్ ఇన్స్‌పెక్టర్ ఆ అమ్మాయిని బాగా మందలించాడు"

"తర్వాత?"

"తర్వాత వాళ్ళు లాడ్జిలో పట్టుబడినట్లు ఉమెన్స్ హాస్టల్ వార్డెన్‌కూ, యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్‌కూ ఫోన్‌చేసి చెప్పాడు మా సర్కిల్ ఇన్స్పెక్టర్"

"అలా చెప్పకుండా వాళ్ళని వదిలి పెట్టేసి వుంటే బాగుండేదేమో సార్" అన్నాడు సారథి.

"నేనూ అలాగే అనుకున్నానండీ! కానీ హాస్టల్ వార్డెన్ జాగ్రత్తగా వుండక పోబట్టే గదా రాత్రిపూట వాళ్లు హాస్ట

ల్లోంచి తప్పించుకుని రాగలిగారు. ఆ వార్డెన్ ఇలాగే నిర్లక్ష్యంగా వుంటే మరికొందరు ఇలాగే తయారవుతారు. కనుక హెచ్చరిస్తే ఇకనైనా వార్డెన్ జాగ్రత్తగా వుంటుందని ఫోన్ చేసి చెప్పాం''

"తర్వాత?''

"తర్వాత వాళ్ళను వదిలిపెట్టెయ్యమని, ఈ విషయాన్ని బయటకు పొక్కకుండా చూడమని వైస్ ఛాన్సలరూ, ఉమెన్స్ హాస్టల్ వార్డెన్ ఇద్దరూ మా సర్కిల్ ఇన్స్పెక్టర్‌ని ఫోన్‌లోనే రిక్వెస్ట్ చేశారు" అంటూ సిగరెట్ వెల్గించుకున్నాడు హర్షవర్ధన్.

"తర్వాత మా పోలీస్ వ్యాన్‌లో మేమే వాళ్ళను అంత రాత్రివేళ ఉమెన్స్ హాస్టల్ వద్దకు తీసుకువెళ్ళి వదిలేశాం. వస్తూ వస్తూ మరో లాడ్జి మీద రెయిడ్ చేశాం. అందులోనూ ఓ అమ్మాయి దొరికింది" అన్నాడు హర్షవర్ధన్

"ఆవిడా ఉమెన్స్ హాస్టలమ్మాయేనా?"

''కాదు... డేస్కాలర్. టౌన్‌లో బంధువులింట్లో వుంటోందట. పైగా ఒక సైన్స్ డిపార్ట్‌మెంట్‌లో ఆ అమ్మాయి రీసెర్చ్ కూడా చేస్తోందట. ఆ అమ్మాయి ఆ లాడ్జిలో ఎవరితో పట్టుబడిందో మీరు ఊహించగలరా సారథిగారూ?"

"ఊహూ'' అన్నాడు సారథి.

''ఎవరైతే తన రీసెర్చ్‌కి గైడెన్స్ ఇస్తున్నాడో ఆ లెక్చరర్‌తో ఆ గదిలో వుండగా పట్టుబడింది. తనతో లైంగిక సంబంధాలు పెట్టుకుంటే తప్ప డాక్టరేట్ డిగ్రీ రాదని బెదిరించి, ఆ లెక్చరర్ ఆ అమ్మాయిని లొంగదీసుకున్నాడు"

''ఛీఛీ.. అతనేం లెక్చరరండీ"

"గురువుకూ, శిష్యురాలికీ మధ్యగల పవిత్రమైన సంబంధం యూనివర్శిటీ స్థాయిలో లైంగిక సంబంధంగా పరిణమించిందన్నమాట.అది యూనివర్శిటీ కాదు.. జంతు ప్రపంచమని చెప్పడానికి ఇంతకన్నా వేరే కావాలా సారథిగారూ"

బదులు చెప్పలేదు సారథి.

''రేపు ఆ లెక్చరర్‌గాడి చెల్లెలో, కూతురో అదే యూనివర్శిటీలో మరో డిపార్ట్‌మెంట్‌లో రీసెర్చ్ చేయదలిస్తే, అప్పుడు వాళ్ళ గైడ్‌కు లొంగిపోయి శరీరాన్ని అప్పగించెయ్యమని వీడు ఆమెకు సలహా ఇస్తాడా? అందుకు సంతోషంగా ఒప్పుకుంటాడా?''

''ఇదేమాట అతడిని అడగకపోయారా?''

"మా సర్కిల్ ఇన్స్పెక్టర్ అడిగితే ఆ లెక్చరర్ సిగ్గుతో తలొంచుకున్నాడు. ఇద్దరికీ గడ్డిపెట్టి చివరకు వాళ్ళని వదిలిపెట్టేశాడు మా సర్కిల్ ఇన్స్పెక్టర్. సరే..నేను మీకు చెప్పిన ఈ విషయాలు మీరెక్కడా అనకండి. ఇక వెళ్దామా" అంటూ పైకి లేచి నిలబడ్డాడు హర్షవర్ధన్. సారథి కూడా పైకి లేచాడు.

రాత్రి ఏడు గంటలు దాటుతోండగా రెండిళ్ళలోనూ పిల్లలకు ట్యూషన్స్ చెప్పడం ముగించి హాస్టల్‌కి తిరుగుముఖం పట్టాడు సారథి. ఆ సాయంత్రం సబ్ఇన్స్పెక్టర్ హర్షవర్ధన్ చెప్పిన విషయాలు సారథి బుర్రలో పరిభ్రమిస్తూనే వున్నాయి. అందుకే ఆవాళ సారథి పిల్లలకు పాఠాలు సరిగ్గా చెప్పలేకపోయాడు.

తలనొప్పి విపరీతంగా వుంటే ఓ మెడికల్ షాప్‌లో టాబ్లెట్ కొనుక్కొని బస్‌స్టాండ్‌లోకి నడిచాడు సారథి. బస్‌స్టాండ్‌లో ఆర్టీసి క్యాంటీన్ వుంది. ఆ క్యాంటీన్లోకి వచ్చి టాబ్లెట్ మింగి

 

టీ తాగుదామనుకున్నాడతడు. నేల ఈని నట్టుగా ఆ బస్‌స్టాండ్ ప్రయాణీకులతో కిక్కిరిసి వుంది.

బస్‌లు పోతున్నాయి. వస్తున్నాయి. జనం ఎక్కుతున్నారు. దిగుతున్నారు. జనం మధ్యలోంచి తప్పించుకుని క్యాంటిన్ వేపు నడుస్తున్న అతడు హఠాత్తుగా నిలబడిపోయాడు. సారథికి పక్కన కుడిచేతివేపు ముగ్గురు యువకులు ఒక తిన్నెమీద కూర్చుని ఏదో చూస్తూ పకపక నవ్వుకుంటున్నారు.

ఆ ముగ్గురు యువకులు తెలుగు డిపార్ట్‌మెంట్‌లో రీసెర్చ్ స్కాలర్స్. పరిచయం లేకపోయినా వాళ్ళ మొహాలు సారథికి తెలుసు. ఆ ముగ్గురు ఒకరి చెవుల్లో ఒకరు గుసగుసలాడుకుంటు న్నారు. కన్నార్పకుండా ఓవేపు చూస్తు న్నారు. మధ్య మధ్యలో ఏవో కామెంట్స్ చేస్తూ నవ్వుకుంటున్నారు.

వాళ్లక్కడ ఏం చేస్తున్నారో... ఏ దృశ్యాన్ని చూసి నవ్వుకుంటున్నారో తెలుసుకుందామని సారథి మెల్లగా వాళ్లకు తెలియకుండా వచ్చి వాళ్ల వెనుక నిలబడ్డాడు. ఆ యువకులు ఏవేపు చూసి నవ్వుకుంటున్నారో ఆ వేపుగా తల తిప్పి చూసిన సారథి కొయ్యబారిపోయాడు. ఎడంకాలి చెప్పు తీసుకుని అక్కడి కక్కడే ఆ ముగ్గురినీ కొడదామన్నంత కోపం వచ్చింది సారథికి.

అక్కడ నలభైఏళ్ళ స్త్రీ పైట తీసేసి బిడ్డకు పాలిస్తోంది. లైట్ వెలుతుర్లో ఆమె స్తనం స్పష్టంగా అగుపిస్తోంది. ఒక తల్లి బిడ్డకు అందించిన స్తన్యాన్ని చూసి... కోర్కెల్ని రేపుకుంటున్న ఆ ఆటవిక మనుషుల దగ్గర నిలబడలేక ముందుకు నడిచాడు సారథి.




యూనివర్సిటీ లైబ్రరీలోకి అడుగు పెట్టాడు సారథి. తను ఎం.ఏలో చేరి చాలారోజులైంది. కానీ ఇంతవరకు తను 'హిస్టరీ ఆఫ్ తెలుగు లిటరేచర్'కు ఏమాత్రం నోట్సు తయారుచేసుకోలేదు. అందరూ నోట్సులు ప్రిపేర్ చేసుకుంటు న్నారు. ఆ కార్యక్రమాన్ని నాలుగు రోజులక్రితమే ప్రారంభిద్దామనుకున్నాడు సారథి.

అయితే అందుకు ముఖ్యంగా కావలసిన పుస్తకం 'తెలుగు సాహిత్య చరిత్ర' లైబ్రరీలో తెలుగు సెక్షన్ బుక్స్‌లో అగుపించలేదు. ఇష్యూచేసే పుస్తకాలలో అది ఒకే కాపీ వుంది. ఆ కాపీ కూడా సారథి క్లాస్‌మేట్ సుగుణ పదిరోజుల క్రితం లైబ్రరీలోంచి పట్టుకెళ్ళింది.

మాటల సందర్భంలో ఆ పుస్తకాన్ని తను తీసుకువెళ్ళినట్లు, రెండు మూడు రోజుల్లో ఆ బుక్‌ను లైబ్రరీలో తను రిటన్ చేయబోతున్నట్లు సారథితో చెప్పింది సుగుణ. కనుక ఇప్పుడు సుగుణ ఆ బుక్‌ను రిటన్ చేసుంటుందని దానిని తీసుకెళ్దామని అనుకుంటూ తెలుగు సెక్షన్ వేపు నడిచాడు.

తనకు కావలసిన ఆ పుస్తకం కోసం సారథి రాక్‌లోని బుక్స్ అన్నింటినీ తిరిగేశాడు. కానీ అది కన్పించడంలేదు.




ఆ పుస్తకాలను శుభ్రపరిచి చాలారోజులై నట్టుంది. అందుకే వాటిపై ధూళి బాగా పేరుకుపోయి వుంది. ఆ పుస్తకాల్ని తాకడంచేత సారథి చేతులకు ధూళి బాగా అంటుకుంది.

విపరీతంగా దుమ్ము కొట్టుకుపోయి... ఒక క్రమ పద్ధతిలో లేకుండా అస్త వ్యస్తంగా పడివున్న ఆ పుస్తకాలన్నీ తమను కనిపెట్టుకునేవారు లేని అనాథ పిల్లల్లా వున్నాయి. వాటిని చూస్తుంటే చాలా బాధనిపించింది సారథికి.

లైబ్రరీలలో ఉద్యోగాలు చేసేవాళ్ళకు పుస్తకాలు శత్రువుల్లా అగుపిస్తాయి. అడ్మినిస్ట్రేషన్‌డిపార్ట్‌మెంట్స్‌లో పనిచేసే వాళ్ళకు ఫైళ్ళు శత్రువుల్లా అగుపిస్తాయి. బ్యాంక్‌లో ఉద్యోగం చేసేవాళ్ళకు కస్టమర్లు శత్రువుల్లా కన్పిస్తారు.

ఆర్టీసీ డిపార్ట్‌మెంటులో ఉద్యోగాలు చేసే కండక్టర్లకు ప్రయాణీకులు శత్రువుల్లా అగుపిస్తారు. పాఠశాలల్లోనూ, కాలేజీలలోనూపనిచేసే ఉపాధ్యాయులకూ, లెక్చరర్లకూ స్టూడెంట్లు శత్రువుల్లా దర్శన మిస్తారు.

ఎంతో అనుబంధం ఏర్పరచుకో వలసిన అంశాల్లో మనుషులు ఇలా శత్రు భావాన్ని ఏర్పరచుకుంటూవుంటే....ఇక ఈ దేశం బాగుపడదని చెప్పడానికి ఇంత కన్నా వేరే కారణాలను చెప్పనవసరం లేదు అన్పించింది సారథికి.

ఒక పుస్తకం టైటిల్‌ను బట్టి లేదా దాని రైటర్ పేరును బట్టి ఆ పుస్తకం నెంబరూ, అది ఏ రాక్‌లో వుంటుందనే విషయాన్ని ఎవరైనా సులభంగా తెలుసు కోవచ్చు. కానీ అక్కడ బుక్స్ ఒక క్రమ పద్ధతిలో లేవు.

ప్రాచీన సాహిత్యానికి సంబంధించిన పుస్తకాల రాక్‌లో ఆధునిక సాహిత్యానికి సంబంధించిన పుస్తకాలుంటాయి. పొయిట్రీ బుక్స్‌లో ప్రోజు బుక్స్, ప్రోజు పుస్తకాలలో పొయిట్రీ పుస్తకాలూ కలిసిపోయి వుంటాయి. దీనికి కారణం - అక్కడకు వచ్చే స్టూడెంట్సే. ఎక్కడంటే అక్కడ పుస్తకాల్ని పడేస్తారు వాళ్ళు.

పావుగంట అదేపనిగా వెదికేసరికి చివరకు తనకు కావలసిన ఆ పుస్తకం విమర్శనా గ్రంథాలమధ్య పడివుండటం కన్పించింది సారథికి. తన శ్రమ వృథా కానందుకతడు సంతోషిస్తూ ఆ పుస్తకాన్ని చేతికి తీసుకుని పేజీలు తిరగే స్తుంటే అందులో ఓ ఉత్తరం కన్పిం చింది సారథికి.

అది ఇన్‌లాండ్ లెటర్. దానిమీద టు అడ్రసు లేదు. ఉత్తరం లోపలిభాగంలో మాత్రం ఏదో విషయం రాయబడివుంది. ఆ కవర్ని అతికించలేదు. దానిని విప్పి మెల్లగా చదవడం మొదలెట్టాడు సారథి.

"డియర్ జానకీ! నువ్వు రాసిన ఉత్తరం అందింది.డబ్బులేనిపేదవాళ్ళతో, అందంగాలేని అమ్మాయిలతో, తక్కువ కులాలకు చెందిన అమ్మాయిలతో స్నేహం చేయడంలోని అంతరార్థం ఏమిటి అని నువ్వు నన్ను అడిగావు కదూ.

నీ ప్రశ్నకు సమాధానం రాస్తు న్నాను. కులం తక్కువవాళ్ళతో, దరిద్రులతో, వికృతంగా వున్నవాళ్ళతో నేను హాయిగా కలిసి తిరుగుతున్నానంటే నాకేదో గొప్ప అభ్యుదయ భావాలున్నా యని భ్రమపడకు జానకీ!

ఒక కాకుల గుంపులో ఒకే ఒక హంస కలిసివుంటే చూసేవాళ్ళ చూపు లంతా ఆ హంసమీదే కేంద్రీకృతమౌ తాయి. ఒప్పుకుంటావా నువ్వు? అందంగా

లేని అమ్మాయిలతో కలిసి సినిమాలకూ షికార్లకూ తిరుగుతుంటే చూసే అబ్బాయిల చూపులన్నీ నామీదే వుంటాయి.

నాతోవున్న మిగిలిన అమ్మాయిల వేపు చూడకుండా అందరూ నా అందాన్నే చూస్తుంటే నాకెంతో గర్వంగా, ఎంతో తృప్తిగా వుంటుంది.

స్నేహితులంటూ వాళ్ళ కోసం ఎందుకలా విచ్చలవిడిగా డబ్బు ఖర్చుపెడుతావు అని ప్రశ్నించావుగదూ. జానకీ! మనం ఎదుటి మనుషులకు డబ్బు ఖర్చు పెడితే ఆ క్రెడిట్ మిగులుతుంది. పైగా మనచేత డబ్బు ఖర్చుపెట్టించుకునేవాళ్ళు మనకెప్పుడూ విశ్వాసంగా పడివుంటారు.

మనమంటే వాళ్ళకెంతో భక్తి గౌరవాలుంటాయి. మనవెంట వాళ్ళు కుక్కల్లా తిరుగుతుంటారు. ఇక్కడ మా అమ్మాయిల హాస్టల్లో నా ఫ్రెండ్స్‌కు నేను విచ్చలవిడిగా డబ్బులు ఖర్చుపెట్టటం లోని అంతరార్థం అర్థమైందా నీకు? మైడియర్ జానకీ...నీకు ఇంకో ముఖ్యమైన విషయం చెబుతాను. ఇది ఎవరితోనూ అనకు.

మా డిపార్ట్‌మెంట్‌లో ఓ కుర్ర లెక్చరర్ వున్నాడు. నేనంటే పడిచస్తాడు. నాతో మాట్లాడేందుకు ప్రతినిమిషం ప్రయత్నిస్తుంటాడు. ఓరోజు ధైర్యంచేసి మీరంటే నాకు చాలా ఇష్టం అన్నాడు. జానకీ! ఇక నేను చదవాల్సిన పనిలేదు. చదవకుండానే నేను ఫస్ట్‌క్లాస్ యం.యస్సీ డిగ్రీ తీసుకోబోతున్నాను.

చదువులకు పరీక్షలు కొలమానాలు. కానీ మన దగ్గర అందముంటే మన అందమే మనకు కావలసిన మార్కులను తెచ్చిపెడుతుంది. దానికావలసిన తంటాలేవో మా కుర్ర లెక్చరరే పడతాడు. జానకీ! నన్ను ట్రాప్ చెయ్యాలని ఈ లెక్చరర్ ప్రయత్నిస్తున్నాడు. కానీ ట్రాప్ చెయ్యబడుతున్నాడని తెలుసుకోలేకపోతున్నాడు.

సరే...ఇక ఉంటాను. విశేషాలతో వెంటనే బదులురాయి.

ఇట్లు
నీ శశికళ"

ఆ ఉత్తరం చదివిన సారథి రెండు నిముషాలు అలాగే బెల్లంకొట్టిన రాయిలా నిలబడిపోయాడు. అందంగాలేనివాళ్లతో స్నేహం చెయ్యడంలోని అర్థం,ఇతరులకు డబ్బు ఖర్చుపెట్టడంలోని అంతరార్థం ఏమిటో శశికళ అందులో పేర్కొనడం ద్వారా తెలుసుకున్న సారథికి ఆ అమ్మాయి మనస్తత్వం చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది.

శశికళ అనే అమ్మాయి సుగుణ రూంమేట్. ఓసారి సుగుణ ఆ అమ్మాయిని సారథికి కూడా పరిచయంచేసింది. ఎవరో జానకి అనే తన స్నేహితురాలికి రాసిన ఆ ఉత్తరాన్ని పోస్టుచెయ్యకుండా పొరబాటున ఈ పుస్తకంలో పెట్టి మరిచిపోయినట్లుంది.

అయినా ఇదేం మనస్తత్వం? ఇలాంటి మనస్తత్వమున్న అమ్మాయిలుంటారని తనకింతవరకు తెలియదు. అసలు యూనివర్శిటీ స్థాయికి వచ్చికూడా ఇలాంటి హీనమైన తత్వాల్ని ఎందుకు అలవరుచుకుంటారు వీళ్ళు?

శశికళ చాలా మంచిదని, నిగర్వి అని, కులమత భేదాలులేని మనిషని సుగుణ తనతో చెప్పినట్లు గుర్తు. ఆవిడ మంచితనమేమిటో, ఆవిడ అంతరంగమేమిటో ఉత్తరమే చెబుతోంది. ఛీ..వీళ్ళ హృదయాలు హృదయాలు కాదు. అది





పంచదార పూతపూసిన విషపుమాత్ర.

తన శిష్యురాళ్ళతో లైంగిక సంబంధాలను పెట్టుకోడానికి పాకులాడే ఈ లెక్చరర్లు...ఇలాంటి లెక్చరర్లను తమ ప్రయోజనాలకు పావుగా వాడుకొనేందుకు ప్రయత్నించే అమ్మాయిలు...ఛీఛీ వీళ్ళంతా విద్యావంతులా?... అలా ఆలోచిస్తూ హాస్టల్‌కు చేరుకున్నాడు సారథి.

"సారథీ! నీకు ఇంటర్‌వ్యూ వచ్చినట్లుంది" అంటూ సారథి చేతికి ఓ కవర్ అందించాడు రాజు.

అది ఓ బ్యాంక్ నుండి వచ్చిన ఇంటర్‌వ్యూ. ఆమధ్య ఓసారి బ్యాంక్ టెస్ట్ రాశాడు సారథి. ఆ టెస్ట్‌లో అతడు పాస్ అయ్యాడు. ఇప్పుడు ఇంటర్‌వ్యూకి రమ్మని పంపించారు.

"బ్యాంక్‌నుండే గదా" అన్నాడు రాజు.

"అవును రాజూ!పదోతేదీ ఇంటర్‌వ్యూ వుంటుందట. అటెండ్ అవమని పంపించారు"

"ఇంటర్‌వ్యూకి బాగా ప్రిపేరవ్వు సారథీ! నీకు జాబ్ వచ్చినా రావచ్చు"

"అంత సులభంగా ఈరోజుల్లో ఉద్యోగాలు రావు రాజూ" అన్నాడు సారథి.

"అని ఎందుకనుకోవాలి? నీకెటూ ఎం.ఏలో ఫస్ట్‌క్లాసుంది. కొంచెం ఇంటర్‌వ్యూ బాగాచేస్తే తప్పకవస్తుంది. అయినా ఏ ఇంటర్‌వ్యూలో ఏ ఉద్యోగం వస్తుందో ఎవడు చెప్పగలడు?"

"అంతేనంటావా?"

"అంతే! విష్ యూ బెస్ట్ ఆఫ్ లక్"

రాజు బలవంతం చెయ్యడం వల్ల సారథి ఇంటర్‌వ్యూకి వెళ్ళొచ్చాడు. ఇంటర్‌వ్యూ బాగా చేసినట్లు అన్పించినా ఆ ఉద్యోగం మాత్రం తనకు రాదని సారథికి బలమైన నమ్మకం.

* * *

ట్యూషన్స్ చెప్పడం ఆ పూటకు ముగించి హాస్టల్‌కు తిరిగి వస్తున్నాడు సారథి. రోజూ చెప్పడంకంటే అవాళ పావుగంటసేపు ఎక్కువసేపు చెప్పడంవల్ల టైం అప్పటికే ఎనిమిది గంటలు దాటింది. ఎనిమిదిన్నర దాటితే హాస్టల్ మెస్‌లో రసం, మజ్జిగ పూర్తిగా అయిపోతాయి. లేదా నీళ్ళతో కలిసి పలచబడిపోయి వుంటాయి.

అందుకే రోజూవచ్చేదారిలో కాకుండా తొందరగా హాస్టల్‌కు చేరుకోవాలని అడ్డదారిలో గబగబా నడుస్తున్నాడు సారథి. అదో చిన్న సందు. లైట్లు లేకపోవడంచేత ఆ సందు బాగా చీకటిగావుంది. ఏమీ స్పష్టంగా కన్పించడంలేదు.

"ఇంక లాభంలేదు సార్! ఆనా కొడుకులు మీసాలు మెలేస్తున్నారు. మన మింక మౌనంగా వుండిపోతే...వాళ్ళ ముందు తలలు వంచుకోవాల్సిందే. రేపు తాడో పేడో తేలిపోవాలి. మనమేమీ గాజులు తొడుక్కొని కూర్చోలేదు. మన తడాఖా ఏమిటో ఆ నాకొడుకులకు రేపు చూపించితీరాలి"

వేగంగా నడుస్తున్న సారథి..ఆ మాటలు వినిచటుక్కుననిలబడిపోయాడు. ఆ ఇంటి కిటికీలోంచి ఆ మాటలు సారథి వున్న సందులోకి స్పష్టంగా విన్పిస్తున్నాయి. ఆ గొంతు ఎవరిదో వెంటనే గుర్తు పట్టగలిగాడు సారథి.

"నిన్న సాయంత్రం మెయిన్ బిల్డింగ్ దగ్గర వాళ్ళంతా ఒకటై మనవాళ్ళను నోటికొచ్చినట్లు మాట్లాడారట. మనవాళ్ళు తక్కువమంది కావడంవల్ల వాళ్ళనేమీ అనలేక గమ్మున వచ్చేశారట"

చెప్పాడొక స్టూడెంట్.

"అయితే అంతదాకా వచ్చిందన్న మాట. ఇక గమ్మునుంటే లాభంలేదు. ఈ రాత్రికి మీరు హాస్టల్లోవున్న మన వాళ్ళందరితోనూ కలిసి మాట్లాడండి. రేపు ఉదయం మనవాళ్ళంతా ఆ గ్రూపును ఎదుర్కోడానికి సిద్ధంగా వుండాలి" అంటూ ఓ గంభీరకంఠం సలహా ఇవ్వసాగింది.

ఆ గంభీరకంఠం ఎవరిదో సారథికి బాగా తెలుసు. ఆవ్యక్తి యూనివర్సిటీలో ఒక డిపార్ట్ మెంట్ ప్రొఫెసరు. ఆ ఇల్లు ఆ ప్రొఫెసర్ దే. ఆయన కులానికి చెందిన విద్యార్థులు ఆ ఇంట్లో సమావేశమై ప్రస్తుత యూనివర్సిటీ పరిస్థితుల్ని సమీక్షిస్తు న్నారు. ప్రతి ఏటా ఆ యూనివర్సిటీలో సంభవించే సంగ్రామాల్లో ఆ ప్రొఫెసర్ ప్రధాన భూమికను నిర్వహిస్తుంటాడు.

తమ ప్రాతినిధ్యాన్ని యూనివర్సిటీలో నిలుపుకునేందుకు అక్కడ ప్రధానంగా రెండు అగ్రవర్ణాలు పరస్పరం సంఘ ర్షించుకుంటూనే వుంటాయి. ఎన్నికల సమయంలో ఈ సంఘర్షణ తారస్థాయి చేరుకుంటుంది. విద్యార్థి నాయకులుగా తమ కులంవాళ్ళే గెలవాలని ఇరువర్గాల వాళ్ళూ పోరాడుతారు.

ఈ పోరాటంలో కొందరు లెక్చరర్లు, రీడర్లు, ప్రొఫెసర్లు తెరవెనుక నిలబడి తమ గ్రూపువారికి డైరెక్షన్స్ ఇస్తుం టారు. ఆపద సమయాల్లో ఆదుకుంటూ వుంటారు. గురుదేవుల ఆశీస్సులతో అమాయక శిఖామణులైన ఆ విద్యార్థులు రణరంగంలోకి ప్రవేశించి చావగొట్టు నుంటూవుంటారు.

"ఓకే! ఇక మీరు హాస్టల్ కు వెళ్ళి మన వాళ్ళందరినీ సమీకరించండి. రేపు ఉదయం యూనివర్సిటీ సైరన్ మోగే సరికల్లా మెయిన్ బిల్డింగ్ దగ్గర అన్ని వేపులనుండి మీరంతా ఒక్కుమ్మడిగా ఆ గ్రూప్ వాళ్ళని అటాక్ చెయ్యండి. అన్నట్టువట్టిచేతులతో మాత్రం వెళ్ళకండి"

ప్రొఫెసర్ చెప్పే ఆ మాటలు వింటుంటే సారథి మనసు కుతకుతలాడి పోయింది. ఒక డిపార్ట్ మెంట్ కు ప్రొఫెసర్ అయివుండీ సంస్కారం వదిలిపెట్టి అతడు పోరాటానికి విద్యార్థుల్ని సంసిద్ధులుగా చేస్తుంటే చూసిన సారథికి ఆయన ముఖంమీద ఉమ్మేదామనిపించింది.

ఇక్కడ ఈ విద్యార్థులు ఇలా తమ ప్రొఫెసర్ను సంప్రదిస్తుంటే మరోచోట ఇంకో గ్రూపుకు చెందిన విద్యార్థులు వాళ్ళ గురుదేవుళ్ళతో సంప్రదిస్తుంటా రని సారథి సులభంగానే గ్రహించ గలిగాడు.

అనాగరీకంగా తమ విద్యార్థుల్ని ఉసి గొలుపుతున్న ఈ మృగాలా ప్రొఫెసర్లు? విద్యార్థులు తప్పటడుగులువేస్తే సరిదిద్ద వలసిన నైతికమైన బాధ్యతలు గల ఈ ప్రొఫెసర్లే...విద్యార్థులచేత తప్పటడు గులు వేయిస్తున్నారు. ఎక్కడినుంచో చదువుకోసం వచ్చిన విద్యార్థులకు కుల తత్వాన్ని బాగా రంగరించి వాళ్ళ రక్తంలో కలిపేస్తున్నారు.

విద్యార్థులకు ఇలా ఎంతగా అన్యాయం చేస్తున్నారో తెలుసుకోలేరు వాళ్లు. తామెంత అన్యాయానికి గురిఅవుతు న్నారో విద్యార్థులూ తెలుసుకోలేరు. ఇలాంటి గురువులవల్ల పతనమైపోయేది కేవలం విద్యార్థులేకాదు...ఈ వ్యవస్థకూడా భ్రష్టుపడుతుంది. ఇలాంటివాళ్ళను ఉరి కంబం ఎక్కించాలి.





అలా ఆలోచించుకుంటూ హాస్టల్‌కు చేరుకున్నాడు సారథి. భోజనం ముగించి చదువుకుందామని షెల్ఫ్‌లోంచి 'అప్ప కవీయము' తీసుకున్నాడు. కానీ సారథికి పుస్తకంపై మనసు లగ్నం కావడంలేదు.

"రాజూ...ఊళ్ళో ఏం సినిమాలు వున్నాయి?"

"చాలా వున్నాయి...ఏం?"

"సెకండ్‌షోకి వెళ్దామా?"

"సెకండ్‌షోకా? ఒక్క నిముష ముండు" అంటూ రాజు గదిలోంచి బయటికెళ్ళి ఆకాశంవేపు చూశాడు.

"ఏమిటిగురూ..ఆకాశంకేసి అదేపనిగా చూస్తున్నావు?" అడిగాడు దామోదరం అక్కడికి వస్తూ.

"ఏమీలేదు దామోదరం! రాత్రి పూట ఆకాశంలో సూర్యుడు హఠాత్తుగా ఉదయించాడేమోనని"

సాధారణంగా సారథి సినిమాలు చూడడు. అతడు సినిమాలు చూడడు కనుక ఇప్పుడతడు సినిమాకు వెళ్దామని అనగానే రాజు సారథిని ఆకాశంకేసిచూసి ఎగతాళి చేశాడు.

"మాంఛి ఇంగ్లీష్ పిక్చరుంది" అన్నాడు దామోదరం.

"నాకు ఇంగ్లీష్ పిక్చర్ అర్థంకాదు'' అన్నాడు సారథి.

"నీకే కాదు గురూ...నిజానికి ఎవరికీ అర్థంకాదు. ఆ విషయం అందరికీ తెలిసినా ఒకరితో ఒకరు చెప్పుకోరు. రాజుగారి గుడ్డలు - అని చిన్నప్పుడో కథ చదివాన్లే'' అన్నాడు రాజు. పావుగంట తర్వాత అందరూ సినిమాకు బయలుదేరారు.

యూనివర్సిటీలో విద్యార్థుల ఎన్నికలకు సంబంధించిన గొడవలు మొదలు అయ్యాయి. ఆ సమయంలో అది ఒక యూనివర్సిటీలా ఉండదు. రణభూమిలా ఉంటుంది. ఎక్కడో మూలపడిపోయి వున్న కర్రలూ, ఐరన్ రాడ్లూ, సైకిల్ చైన్లూ ఆ సమయంలో వెలుగును చూస్తాయి. అవి మనుషుల్ని ఆ సమయంలో మృగాలుగా మార్చేస్తాయి.

సారథి, రాజు, దామోదరం హాస్టల్ నుండి కాలేజీకి బయలుదేరారు. మాధవరావుకు రాసిన ఉత్తరాన్ని యూనివర్సిటీ పోస్ట్ ఆఫీస్‌లో పోస్టుచేసి అటు నుంచే క్లాసుకు వెళదామని సారథి అనడంతో అందరూ పోస్ట్ ఆఫీసు వేపు నడిచారు.

ఇంతలో యూనివర్సిటీ సైరన్ భూతంలా అరవసాగింది. సరిగ్గా ఆ సమయంలోనే మెయిన్ బిల్డింగ్ దగ్గర నుండి ఏవో అరుపులూ కేకలూ గట్టిగా విన్పించాయి. క్లాసులకు హాజరయ్యేందుకు వెళ్ళిన అమ్మాయిలు బెదరిపోయి మెయిన్ బిల్డింగ్ దగ్గరనుండి పరుగులాంటి నడకతో తిరిగి వచ్చేస్తున్నారు.

"సారథీ! స్టూడెంట్స్ కొట్టుకుంటున్నట్టున్నారు. పద తొందరగా" అన్నాడు రాజు.

"సరిగ్గా ఇవాళ ఇదే టైంకు వాళ్ళు అలా కొట్టుకోబోతున్నారని నాకు ముందే తెలుసు'' సారథి అన్నాడు.

"ముందే తెలుసా...ఎలా?"

"తర్వాత చెబుతానులే''

"గురూ...ముందు మనం మెయిన్ బిల్డింగ్ వద్దకి వెళ్దాం పదండి. ఆ తతంగమేమిటో చూద్దాం'' దామోదరం అలా అనగానే వాళ్లు మెయిన్ బిల్డింగ్ వేపు నడక సాగించారు.

అక్కడ...

యూనివర్సిటీలోని రెండు ప్రధాన

కులాలకు సంబంధించిన విద్యార్థులు పరస్పరం చావగొట్టుకుంటున్నారు. కేకలతోనూ అరుపులతోనూ ఆ ప్రాంత మంతా ప్రతిధ్వనిస్తోంది. ఆ కేకలను విని అక్కడికి పరుగు పరుగున వస్తున్న కొంతమంది విద్యార్థులు ఆ దమన కాండను ఆపు చేయిద్దామనుకోకుండా- వాళ్ళు కూడా తమకి చెందిన గ్రూపుల్లో కలిసిపోతున్నారు.

అక్కడ ... కర్రలు పైకి లేస్తున్నాయి. విరుగుతున్నాయి. సైకిల్ చైన్స్‌తో చర్మాలు చీరుకుపోతున్నాయి. ఐరన్ రాడ్స్‌తో ఎముకలు చిట్లిపోతున్నాయి. వాళ్ళ శరీరాల నుండి స్రవిస్తున్న నెత్తురు నేలమీద పడి మట్టిలో కలిసిపోతూ వుంది. కుల వైషమ్యాల విరాట్ స్వరూపం అక్కడ విలయ తాండవం చేస్తోంది.

"అమ్మో" ఒకడి చావుకేక.

"చచ్చాన్రో నాయనో" మరొకడి ఆర్తనాదం.

"ఒరేయ్ ... నన్ను కొట్టకండ్రా. నిజంగా నాకు ఈ వ్యవహారంతో సంబంధం లేదు" ఇంకొకడి అర్థింపు.

"అయ్యో...నా కాలు విరగ్గొట్టేశారు"

"ఒరేయ్...వదలకండ్రా! ఈ నా కొడుకులను. ఈ లం ... మన పైకి మీసాలు దువ్వుతారా?"

"ఒక్కొక్కడి ఎముకల్ని విరిచి పారేయండి. మళ్ళీ మన జోలికి రాకుండా వుంటారు"

చాలా అసహ్యమైన భాషలో సంభాషణలు దొర్లిపోతున్నాయక్కడ. కొందరు దెబ్బలకు తట్టుకోలేక అక్కడి నుండి హాస్టల్ వేపు పరుగెడుతున్నారు. కొందరు ప్రాణం పోయినా ఫర్వాలేదన్నట్టు పోరాడుతున్నారు. కొందరు కొందరిని నేలమీద పొర్లించి పొర్లించి గొడ్డును బాదినట్లు బాదుతున్నారు.

కానీ ఈ రణరంగానికి విద్యార్థులను ఉసికొల్పి పంపించిన ప్రొఫెసర్లూ, లీడర్లూ హాయిగా యూనివర్సిటీ ఏ.సీ గదుల్లో విశ్రాంతి తీసుకుంటున్నారు. తమకు చెందిన విద్యార్థులు...పోరాటంలో చచ్చినా ఫర్వాలేదు. తమ ప్రతిష్టే వాళ్ళ లక్ష్యం.

దిక్కులకు ఎగబాకుతున్న ఆ దారుణాన్ని .... నిర్విఘ్నంగా నిర్వహింపబడుతున్న ఆ మారణహోమాన్ని సారథి అలాగే కన్నార్పకుండా చూస్తున్నాడు. ఛీ..ఈ విద్యావంతులకన్నా-సంస్కారం, భాష, నాగరికతలు బొత్తిగా ఎరుగని రాతియుగపు మనుషులే కోటి రెట్లు నయం. వీళ్ళని మనుషులనుకోవడం అజ్ఞానం.

మనుషులమనే విషయాన్ని మరిచిపోయి పరస్పరం చావబాదుకుంటూ వున్న వీళ్ళు విద్యావంతులా? ఇలాంటి అనాగరిక చర్యలకు పాల్పడుతున్న వీళ్ళు.... సంస్కారవంతులా? ఆటవికంగా ప్రవర్తిస్తున్న వీళ్ళు అక్షరాస్యులా? ఛీ ఛీ..సారథి హృదయంలో ఆకాశమంత అసహ్యం పుట్టింది వాళ్ళ మీద.

అయిదు నిముషాల్లో అక్కడికి వేగంగా ఓ పోలీస్ వ్యాన్ వచ్చి ఆగింది. అందులోంచి పోలీసులు గబగబా కిందికి దిగారు. దూరంగా నిలబడి ఆ పోట్లాటను తిలకిస్తున్న విద్యార్థులంతా పోలీసుల్ని చూడగానే దూరంగా పరుగులు తీశారు.

పోలీసులు రంగ ప్రవేశం చెయ్యడంతో...అక్కడి పరిస్థితి కొంతవరకు అదుపులోకి వచ్చింది. పోలీస్ వ్యాన్




వెంబడి అక్కడికి అంబులెన్స్ కూడా వచ్చింది. ఆ దెబ్బలాటలో పాల్గొన్న కొంతమంది విద్యార్థులు పోలీస్ కస్టడీలోకి తరలింపబడ్డారు. దెబ్బలకు గురయిన విద్యార్థుల్ని హాస్పిటల్‌కు తరలించారు.

హాస్పిటల్‌కు వెళ్ళి గాయపడిన విద్యార్థుల్ని పరామర్శించిన యూనివర్సిటీ ప్రిన్స్‌పాల్ అర్జంటుగా తన ప్రగాఢ మయిన సానుభూతిని అక్కడే హాస్పిట ల్లోనే ప్రకటించేశాడు. తర్వాత మరో చోట పోలీస్ కస్టడీలో వున్న విద్యార్థుల్ని విడుదల చేయించేందుకు ఆయన ప్రయత్నాలు ప్రారంభించాడు.

దెబ్బలుతిన్న వర్గానికి సంబంధించిన విద్యార్థులూ, కొందరు అధ్యాపకులూ రహస్యంగా సమావేశమై ఒక నిర్ణయానికి వచ్చారు. తమ కులంవాళ్ళపై దాడి చేసిన విద్యార్థులనునలభైఎనిమిది గంటల లోగా చితకగొట్టి అదే హాస్పిటల్‌కు పంపించాలి. ఇదే వాళ్లు తీసుకున్న నిర్ణయం యొక్క సారాంశం.

ఈ విషయం ఎలాగో మధ్యాహ్నం అయ్యేసరికి యూనివర్సిటీలో పొగలా అల్లుకుపోయింది. ఏం జరుగుతుందో ఏమోనని ప్రిన్స్‌పాల్, వైస్‌ఛాన్సలర్ భయపడ్డారు. చివరకు వాళ్లూ ఓ నిర్ణయా నికి వచ్చారు. రిసెర్చ్‌స్కాలర్స్ తప్ప తక్కినవాళ్ళంతా హాస్టల్స్ ఖాళీచేసి వాళ్ళ సొంతవూళ్ళకు వెళ్లిపోవాలి. యూనివర్శిటీని నిరవధికంగా మూసేస్తు న్నారు. ఇది వీళ్ల నిర్ణయంలోని సారాంశం.

"ఇన్‌డెఫనెట్‌గా మేము యూనివ ర్సిటీని క్లోస్ చేస్తున్నాం. కనుక వెంటనే ఫస్ట్‌యియర్ అండ్ ఫైనలియర్‌స్టూడెంట్స్ సాయంత్రం నాలుగు గంటలలోగా హాస్టల్ రూమ్స్ ఖాళీచేసి లగేజ్‌తోపాటు వారివారి ఊళ్ళకు వెళ్లిపోవాలి. ఎవరైనా ఖాళీ చెయ్యని పక్షంలో పోలీసుల్ని తీసుకు వచ్చి మేమే ఖాళీ చేయిస్తాం"

హాస్టల్ నోటీస్ బోర్డ్‌మీద అతికించ బడ్డ ఆ నోటీస్‌ను చదువుకున్న స్టూడెంట్స్ వెంటనే తమ గదులకు వెళ్లి సామాన్లు సర్దుకోసాగారు. తనకంటూ ఒక సొంత వూరు లేదు గనుక ఇప్పుడు హఠాత్తుగా హాస్టల్ రూం ఖాళీచేసి తనెక్కడికి వెళ్ళడమా—అని ఆలోచిస్తున్నాడు సారథి.

"సారథీ! చాలారోజుల నుండి మా వూరికి నిన్ను తీసుకువెళ్దామని అను కుంటూనే ఉన్నాను. నీ గురించి మా ఇంట్లో అందరికీ తెలుసు. నిన్ను తీసుకు రమ్మని అమ్మనాన్న కూడా నాతో చాలా సార్లు అన్నారు. ఇన్నాళ్లకు అవకాశం దొరికింది. కమాన్.... వెంటనే బట్టలు సర్దుకుని బయల్దేరు" అన్నాడు రాజు.

"నేనెందుకులే రాజూ"

"నోనో... అలా అనకు. నువ్వు నాతో పాటుగా ఇప్పుడు మా వూరు వస్తున్నావు. అంతే!"

"అది కాదు రాజూ..."

"సారథీ! నీ మాటలు ఇక నేను వినదలుచుకోలేదు. రెండున్నరకు బస్సుంది.ఆ బస్‌ను మనం అందుకోవాలి. కనుక వెంటనే బయలుదేరు" బలవంతం చేశాడు రాజు.

సారథి ఇక బదులు మాట్లాడకుండా తన సూట్‌కేస్ సర్దుకోసాగాడు. తను వెళ్లి ఓ వారంరోజులు తలదాచుకొన డానికి తనకెక్కడా చోటు లేదు గనుక... ఇప్పుడి పరిస్థితులలో రాజుతో పాటు వాళ్ళ వూరెళ్ళడమే మంచిదన్పించింది సారథికి.




ఇద్దరూ సామాన్లు సర్దుకుని ఓ రిక్షాలో బస్టాండు చేరుకున్నారు. సరిగ్గా అప్పుడే బస్ కదులుతోంది. రిక్షాదిగి సూట్ కేస్‌లు పట్టుకుని బస్‌లోకి జొరబడ్డారు సారథి, రాజు. కిటకిటలాడే జనంతో నిండు గర్భిణిలా మెల్లలా ముందుకు సాగింది ఆ బస్.



9

సుమారు రెండు గంటలసేపు వేగంగా ప్రయాణించిన ఆ ఆర్టీసీ బస్సు ఓచోట సడెన్‌గా ఆగిపోయింది. ఆ బస్‌కు వెనుక నున్న చక్రాలలో ఒకటి రాజకీయ నాయకులు చేసిన వాగ్దానాల్లా తుస్సుమంది. 'చక్రం పంచరైంది. అందరూ దిగండి' అంటూ స్టీరింగువద్దనుండి కిందికి దిగాడు డ్రైవర్.

'ఈ ఆర్టీసీ డిపార్ట్‌మెంట్ ఇంతే నండి' అంట్లూ ఆ డిపార్ట్‌మెంట్‌ను దుమ్మెత్తిపోశారు కొందరు. డ్రైవర్‌పై తీవ్రమైన విసుగును ప్రకటించారు మరికొందరు. అయిదునిమిషాల్లో బస్‌లోని ప్రయాణీకులంతా కిందికి దిగి రోడ్డు మీద నిలబడ్డారు. చక్రాన్ని మార్చే ప్రయత్నంలోపడ్డారు డ్రైవర్, కండక్టర్.

సారథి, రాజు ఓ చెట్టునీడలో నిలబడ్డారు. సిగరెట్ వెలిగించి గాల్లోకి పొగను రింగులు రింగులుగా వదలసాగాడు రాజు. సారథికి దాహం వేస్తోంది. అతడి నాలుక పిడచకట్టుకుపోయింది. తాగడానికి నీళ్లు ఎక్కడ దొరుకుతాయా అని అటూ ఇటూ చూస్తున్న సారథికి రోడ్డుకు పడమటగా నాలుగిళ్లు కన్పించాయి.

"రాజూ! నాకు నీళ్ళ దప్పిక వేస్తూ వుంది. అక్కడ నాలుగిళ్ళు కన్పిస్తున్నాయి. నేను వెళ్ళి నీళ్ళు తాగేసి వెంటనే వచ్చేస్తాను. నువ్విక్కడేవుండు. నేను వచ్చేలోగా బస్‌గానీ బయలుదేరేటట్లయితే డ్రైవర్తోచెప్పి బస్సు నిలబెట్టు'' అంటూ సారథి రోడ్డుకు పడమటగావున్న ఆ ఇళ్ళవేపు నడిచాడు.

రైతులెవరో తమ పొలాలదగ్గరే ఇళ్ళను కట్టుకున్నట్టున్నారు. అందుకే అక్కడ నాలుగిళ్ళకంటే ఎక్కువ ఇళ్లు అగుపించడంలేదు. ఆ ఇళ్ళ దగ్గరకు వచ్చి ఓ ఇంటిముందు నిలబడి 'ఏవండీ' అంటూ పిలిచాడు సారథి. ఓ మధ్యవయస్కుడు ఇంట్లోంచి వెలుపలికొచ్చి సారథి వేపు ప్రశ్నార్థకంగా చూశాడు.

"మంచినీళ్ళుంటే ఓ గ్లాస్ ఇస్తారా! చాలా దప్పిక వేస్తోంది'' అన్నాడు సారథి.

"బయట ఎండలో నిలబడ్డారు. లోపలికి రండి'' సారథిని ఆహ్వానించాడాయన.

ఆయన పిలిచినా లోపలికి వెళ్ళడానికి కొంత తటపటాయించాడు సారథి.

"మీ కులమేమిటో నేనడగలేదు. నా కులమేమిటో నేను చెప్పలేదు. కారణం నాకు కులమతాల పట్టింపుల్లేవు. మా ఇంటికి ఎవరొచ్చినా నేను లోపలికి ఆహ్వానిస్తాను. అభ్యంతరం లేకపోతే, మీకూ ఆ పట్టింపుల్లేకుంటే లోపలికి రావచ్చు'' సారథి వేపు చూస్తూ అన్నాడాయన.

వెంటనే సారథి లోపలికి అడు

గెట్టాడు. మనిషిని చూస్తే చదువుకున్న వాడిలాలేదు. అయినా అతడు తనకు కులాల పట్టింపు లేదన్నాడు. ఈ మాట హృదయపూర్వకంగా అనాలంటే వ్యక్తికి ఎంత సంస్కారముండాలి! ఎంత సహృదయం, ఎంత మానవతా దృక్పథ ముండాలి!

ఒక పల్లెటూరి రైతులో ఏ విశ్వ విద్యాలయాలలోనూ ఉన్నత చదువులు చదువుకోని ఒక జానపదుడిలో ఇంత గొప్ప సంస్కారముంటుందా? ఇంత మానవతాదృష్టి వుంటుందా! ఆయనను చూస్తుంటే సారథికి చాలా ఆశ్చర్యం వేసింది.

మేధావుల జాబితాలో చేరిన ప్రొఫెసర్లూ, రీడర్లూ, ఉన్నత విద్యను అభ్యసిస్తున్న విద్యార్థులూ విశ్వ విద్యాలయాలలో కులాలకోసం కుమ్ములాడుకుంటూ అనాగరీక చర్యలకు పాల్పడుతున్నారు. కానీ ఈ జానపదుడు, మట్టిని నమ్ముకుని జీవించే ఈ రైతు కులమత భేదాలను పట్టించుకోవడం లేదు. ఎంత గొప్ప విషయమిది.

అలా ఆలోచిస్తూ తను చదువుకుంటున్న యూనివర్సిటీ లోని విద్యావంతులతో ఈ పల్లెటూరి మనిషిని పోల్చి చూసిన సారథికి ఈ పల్లెటూరి మనిషి పట్ల అంతులేని గౌరవం, అభిమానం ఏర్పడింది. నిరక్షరాస్యుడైన ఈ పల్లెటూరి మనిషిలో గొప్ప సంస్కారం మానవత్వాలు దర్శనమిచ్చాయి సారథికి.

ఉన్నట్టుండి దూరంగా రోడ్డుమీది నుండి బస్ హారన్ విన్పించేసరికి ఉలిక్కిపడ్డాడు సారథి. వెంటనే మంచినీళ్ళు తాగి ఆ జానపదుడి వేపు కృతజ్ఞత నిండిన కళ్ళతో ఓసారి చూసి తిరిగి బస్ వద్దకు వచ్చేశాడు సారథి. అతడు బస్‌లోకి అడుగుపెట్టగానే డ్రైవర్ ఇంజన్ స్టార్ట్ చేశాడు.

చీకటి పడకముందే ఊరు చేరుకున్నారు రాజు, సారథి. రాజు ఇంట్లోని వాళ్ళు కూడా మంచి కలుపుగోలుతనం గలవాళ్లు. అందుకే సారథి వాళ్ళతో బాగా కలిసిపోయాడు. ఆ ఇంట్లోని మనుష్యులతో మాట్లాడుతుంటే తన కుటుంబ సభ్యులతో మాట్లాడుతున్న అనుభూతి కలిగింది సారథికి.

వారం రోజులు గడిచాయి.

సారథికి ఆ వూరూ, ఆ వూళ్లోని మనుషులూ బాగా నచ్చారు. కొంత మందితో సారథికి పరిచయం కూడా ఏర్పడింది. ఆ వూళ్ళో 'ఇంద్రసేన' అనే ఓ యువకుడున్నాడు. అతడెప్పుడూ జోక్స్ వేసి సారథిని బాగా నవ్విస్తుంటాడు. బాగా చదువుకున్న వాళ్లు ఆ వూళ్లో తక్కువేనని గ్రహించాడు సారథి.

"రాజూ! మనం మీ వూరొచ్చి వారం పైగా అయిపోయింది" అన్నాడు సారథి.

"అవును... అయితే ఏం?''

"మనం యూనివర్సిటీకి వెళ్ళే పని లేదా?!'

"ఎందుకు వెళ్ళం. తప్పనిసరిగా వెళ్తాం. కానీ ఆ యూనివర్సిటీ తెరిస్తేగా మనం వెళ్ళడానికి''

"ఎప్పుడు తెరుస్తారో?''

''అదే మనకు తెలియదు"

"మరి తెలుసుకోకుండా మనం ఇక్కడే వుండిపోతే ఎలా రాజూ?" అడిగాడు సారథి.

''నిరవధికంగా యూనివర్సిటీ మూసేశారుగా. కనుక ఎప్పుడు రీ ఓపెన్ చేసేది ఆ డేట్‌ని న్యూస్ పేపర్స్‌లో




తప్పకుండా ప్రకటిస్తారట'' చెప్పాడు రాజు.

"మరి మనకు న్యూస్ పేపర్..."

"దొరుకుతుంది.మా వూరి ఎలిమెంటరీ స్కూల్ టీచర్ రోజూ వచ్చేటప్పుడు తీసుకొస్తాడు''

మరో మూడు రోజులు గడిచాయి.

అవాళ రాత్రి తొమ్మిది గంటల ప్రాంతంలో ఆవూరి కోదండరామాలయం ముందు జనం గుంపులు గుంపులుగా కూర్చుని చాలా శ్రద్ధగా పురాణం వింటున్నారు. రామనాథశాస్త్రి వరండాలో తిన్నెపై కూర్చుని పురాణం చదువుతూ వివరించి చెబుతున్నాడు.

పౌరోహిత్యంతో ఈరోజుల్లో ఎవరూ మిగిలించుకోలేరనేది చాలా వాస్తవం. ఆ వూళ్ళో చాలామంది తమకు కాలక్షేపం కోసం రామనాథశాస్త్రి దగ్గర పురాణం చదివించుకుని వింటూవుంటారు.

అలా చదివించుకున్నందుకు ఫలితంగా ఆ రైతులు శాస్త్రికి బియ్యం, పప్పు మొదలైనవి ఇస్తుంటారు. పురాణ పఠనానికి ఆ వూళ్ళో కోదండరామాలయమే వేదిక.

అవాళ రామనాథశాస్త్రి మహాభారతంలోని పాండవ జననం గురించి చెబుతాడని ఎవరో చెబితే ఆయన వ్యాఖ్యానం ఎలా వుంటుందో విందామని సారథి కూడా ఆ ఆలయంలోకి వచ్చి మరో తిన్నెమీద కూర్చున్నాడు. రామనాథశాస్త్రితో కూడా ఈ పదిరోజుల్లో సారథికి పరిచయం ఏర్పడింది.

కోదండరామాలయం ముందు కూర్చున్న ఆ పల్లెటూరి జనం... ఆయన చెబుతున్నది ఆసక్తిగా వింటున్నారు. అర్జునుని జననం గురించి చెబుతూ రామనాథశాస్త్రి అర్జునుడు తెల్లని వర్ణము గలవాడని చెప్పాడు.

"శాస్త్రిగారూ! మీరు నన్ను క్షమిస్తానంటే ఒక్కమాట" అంటూ లేచాడు సారథి.

"ఏమిటి నాయనా?" ప్రశ్నించాడు శాస్త్రి.

"అర్జునుడు తెల్లనివాడు కాదండీ! అతడు నల్లని దేహ వర్ణం గలవాడు. ఈ విషయంగా ఇరవై సంవత్సరాల క్రితం పత్రికలలో పండితుల మధ్య వాదోపవాదాలు కూడా జరిగాయి"

"ఏమో నాయనా! నాకు తెలిసినంత వరకు అర్జునుడు తెల్లనివర్ణం గలవాడేననుకుంటాను. అయితే నా అభిప్రాయం పొరబాటు కూడా కావచ్చు. ఇప్పుడిక్కడ నేను చదువుతున్నది వచనభారతం. ఇందులో అర్జునుని రంగుకు సంబంధించి వివరణ లేదు. సరే...నీ అభిప్రాయానికి ఆధారమేమిటి?" అడిగాడు శాస్త్రి.

"వ్యాసుని సంస్కృత భారతంలోని కొన్నిశ్లోకాలవల్ల, నన్నయ్య భారతంలోని ఆదిపర్వంలోవున్న కొన్ని పద్యాలవల్ల అర్జునుడు నల్లనివాడని స్పష్టంగా తెలుస్తూనే వుంది"

"అలాగా నాయనా?"

"అవును శాస్త్రిగారూ! అంతేకాకుండా వ్యాసుడు విరాటపర్వంలో అర్జునుని వర్ణం గురించి 'కృష్ణావదాతః' అని అన్నాడు. చివరకు 'విజయవిలాసం'లో కూడా చేమకూర వెంకటకవి 'మృగమదముచెంత గుంకుమరేఖవలె'అంటూ అర్జునుడు నల్లనివాడేనని చెప్పడం జరిగింది" అన్నాడు సారథి.

"టీకాలు రాయబడిన భారతాలను నేను చదివాను నాయనా! అయితే వాటిల్లో

కూడాను అర్జునుడు తెల్లనివాడే అని రాసి వున్నట్లు గుర్తు" అన్నాడు శాస్త్రి.

"మీ మాట నిజమే శాస్త్రిగారూ! భారతానికి టీకాలు రాసినవారిలో కొందరు అర్జునుడు తెల్లనివాడని పొరబాటున రాశారు. అవి చదివినవాళ్లు అదే నిజమని అనుకున్నారు. 'అవదాతః' అనే శబ్దానికి అర్థం కేవలం తెలుపు వర్ణమని వాళ్లు అనుకోవడం వల్లే ఈ పొరబాటు జరిగింది"

"అయితే 'అవదాతః' శబ్దానికి అర్థమేమిటి? అమరకోశంలో ఏమని వుంది?" అడిగాడు శాస్త్రి.

"అమరకోశంలో 'అవదాతః సితే పీతే శుద్ధే' అని వుంది. అంటే ఇక్కడ అవదాతః శబ్దానికి కల్తీలేనటువంటి స్వచ్ఛమైన రంగు అనేకదా అర్థం"

"అవును నాయనా...కల్తీలేనటువంటి స్వచ్ఛమైన రంగు తెలుపే కదా"

"అని ఎందుకనుకోవాలి శాస్త్రిగారూ! అక్కడే మనవాళ్లు పప్పులో కాలేశారు. స్వచ్ఛమైన రంగు తెల్లనిదే ఎందుకు కావాలి? నలుపుకూడా స్వచ్ఛంగా ఉండవచ్చుకదా. ఒకవేళ అర్జునుడు తెల్లనివాడైతే బహుశా వ్యాసుడు 'కృష్ణావదాతః' అని ప్రయోగించేవాడు కాదేమో"

బదులు చెప్పలేదు శాస్త్రి.

"శాస్త్రిగారూ! అసలు అర్జునుడికి ఆ పేరు అతడి దేహవర్ణం బట్టి వచ్చింది కాదు"

"అవునా?"

"అవునండీ. కార్తవీర్యార్జునుని కంటే అతడు ఎక్కువ పరాక్రమశాలి అవుతాడు గనుక అతడికి అర్జునుడనే పేరు చెల్లుతుందని ఆకాశవాణి చెప్పినట్లుగా




ఆదిపర్వంలో స్పష్టంగా వుంది" అన్నాడు సారథి.

"నువ్వు చెప్పింది నిజమే కావచ్చు నాయనా! సంస్కృత భారతాన్ని ఎప్పుడో చదివాను. కానీ ఈ విషయాన్ని నేను అంతగా పట్టించుకోలేదు. చిన్నవాడివైనా నాకు తెలియని ఒక కొత్త విషయాన్ని చెప్పి నా తప్పును సరిదిద్దావు. నిన్నెలా అభినందించాలో తెలియడం లేదు. మనిషి విజ్ఞానానికి వయస్సు ఎప్పుడూ కొలతబద్దకాదు నాయనా! ఇంత చిన్న వయస్సులో నువ్విన్ని విషయాల్ని తెలుసుకున్నావంటే..నిన్ను కన్న తల్లి దండ్రులెవరో అదృష్టవంతులు" అంటూ రామనాథశాస్త్రి సారథిని అభినందించాడు.

"శాస్త్రిగారూ! ప్రాచీన సాహిత్యానికి సంబంధించి పుష్కలమైన పరిజ్ఞానంగల మీముందు నేనెంత? మీరు నన్నిలా పొగుడుతుంటే నాకు సిగ్గుగావుంది. ఏదో ఒక్కవిషయం తెలిసినంత మాత్రాన నన్ను విజ్ఞులకింద పరిగణించడం బాగు లేదు" అంటూ అక్కడినుండి ఇంటికి వచ్చేశాడు సారథి.

అప్పటికే మంచంమీద పడుకుని గాఢంగా నిద్రపోతున్నాడు రాజు. పక్కనే ఖాళీగావున్న మంచంపై సారథి వెల్లికిలా పడుకున్నాడు. అతడికి నిద్ర పట్టడంలేదు. రామనాథశాస్త్రి తనను అనవసరంగా పొగిడినట్లనిపించింది సారథికి.

ఎం.ఏ. క్లాస్ జరుగుతున్నప్పుడు.. రీడర్ కఠోపనిషత్ అనే ఖండికను బోధిస్తూ..కొన్ని పంక్తులకు వక్రభాష్యం చెప్పడం..తను పైకిలేచి రీడర్ చేసిన పొరబాటును సరిదిద్దడం..ఆయన అప్పుడు తన పొరబాటును ఒప్పుకోకుండా తనను హేళన చెయ్యడం..అదంతా సారథి

స్మృతిపథంలో ఒక్కసారి కదిలింది.

రామనాథశాస్త్రి తనకన్నా తెలివైన వాడు. వృద్ధుడు, మంచి పండితుడు. ప్రాచీన సాహిత్యానికి సంబంధించి ఆయనకున్న పరిజ్ఞానంలో తనకు పదో వంతు కూడాలేదు. అయినప్పటికీ ఆయన చెప్పిన పొరబాటును తను సరిదిద్దితే ఆయన చాలా సంతోషించాడు. తనను అభినందించాడు.

కానీ...అవాళ క్లాస్‌లో రీడర్ చేసిన పొరబాటును తను సరిదిద్దితే..ఆయనది సహించలేకపోయాడు. తనకు తెలియని విషయం తన శిష్యుడికి తెలిసినందుకు సంతోషించడానికి బదులు ఆయన కుళ్ళుకున్నాడు. తన తప్పును ఒప్పుకోలేకపోయాడు. తనను అభినందించడానికి బదులు ద్వేషించాడు.

ఈ రామనాథశాస్త్రి ఆ రీడర్‌లాగా ఒక ఉన్నతమైన ఉద్యోగంలో లేడు. ఆ రీడర్‌కున్నట్టు 'డాక్టర్ ఆఫ్ ఫిలాసఫీ' డిగ్రీ ఈ శాస్త్రికిలేదు. రీడర్‌లా పరిశోధక విద్యార్థులకు పర్యవేక్షకుడుగా వ్యవహరించడంలేదు. అయినా ఆ రీడర్‌లోలేని సభ్యత సంస్కారాలుశాస్త్రిలోవున్నాయి.

అవి వుండబట్టే ఎదుటి మనిషి తన పొరబాటును ఎత్తిచూపెడితే శాస్త్రి సరిదిద్దుకోగలిగాడు. ఆ సభ్యతసంస్కారాలు లేకపోవడం వల్లే ఆ రీడర్ తన పొరబాటును సరిదిద్దుకోకుండా తనను హేళనచేశాడు. యూనివర్సిటీలో సంచరించే రీడర్‌కూ, పల్లెటూళ్ళోబతికే శాస్త్రికీ ఎంత తేడా!

అలా ఆలోచిస్తూనే సారథి మెల్లగా నిద్రలోకి జారిపోయాడు. నిద్రలో అతడికో స్వప్నం వచ్చింది. సారథి ఎక్కడో ఒక కారడవిలో క్రూరమృగాల మధ్య ఇరుక్కుపోయినట్టు, తప్పించుకుపోవడానికి అతడు శతవిధాలా ప్రయత్నిస్తున్నట్టు అన్పించి..వెంటనే ఆ కల చెదిరిపోయింది.

"రాజూ... రాత్రి నాకో పీడకల వచ్చింది" అంటూ ఆ ఉదయం రాజుతో కల గురించి చెప్పాడు సారథి.

"నువ్వుంటున్నది అడవిలో కాదు... మా వూళ్లో" అన్నాడు నవ్వుతూ రాజు.

"ఎంతమాట రాజూ! మీవూరు అడవి కాదు"

"మరి?"

"నందనవనం"

"పోలిక బాగానే వుందిగానీ నువ్వు రాత్రి రామనాథశాస్త్రిని ఏదో అదరగొట్టేశావట"

"ఎవరు చెప్పారు?"

"మా నాన్న"

"నేనేం అదరగొట్టలేదులే! ఏదో సరిదిద్దానంతే" అన్నాడు సారథి.

"అందుకాయన మండిపడలేదుగదా"

"పాపం ఆయనకా స్వభావం లేనట్టుంది"

"అన్నట్టు సారథీ....యూనివర్సిటీ రీఓపెన్ చేస్తున్నారు" చెప్పాడు రాజు.

"అవునా...ఎప్పుడు?"

"పదిహేనో తారీఖున"

"ఎవరు చెప్పారు?"

"ఇవాళ పేపర్లో వేశారు" అంటూ అవాళ్టి పేపర్ని సారథికి అందించాడు రాజు.

"అయితే మనం తొందరగా వెళ్లబోతున్నామన్నమాట" సంతోషంగా అన్నాడు సారథి.

"ఏం... తొందరగా వెళ్లిపోవాలని వుందా?"

"అని లేదుకానీ..వెళ్ళిపోతే మంచిది"

"ఏమిటో అంత తొందర"

"పిల్లలకు చెప్పవలసిన పాఠాలు చాలా మిగిలిపోయివున్నాయి. ట్యూషన్ చెప్పడం ఒప్పుకున్న తర్వాత..వాళ్ళకు చెప్పవలసిన పాఠాలన్నీ చెప్పి తీరాలిగా" అన్నాడు సారథి.

"సరే..నువ్వెళ్లి ముఖం కడుక్కొని స్నానంచేసేయ్.టిఫిన్‌తిందాం" అన్నాడు రాజు.

ఆరోజు మధ్యాహ్నం...

భోంచేసిన తర్వాత కాసేపు పడుకుని నిద్రపోయి..మూడు గంటలకు లేచి ముఖాలు కడుక్కొని, కాఫీలు తాగేసి పొలంవేపు బయలుదేరారు సారథి, రాజు.

రాజువాళ్ల పొలం ఆ వూరికి పడమటి వేపున అరకిలోమీటరు దూరంలో వుంది.

ఆ పొలంలో పెద్ద నిమ్మతోట కూడా ఉంది. ఆ నిమ్మతోట చూద్దామని వచ్చారు వాళ్లు.

ఆ నిమ్మతోట చుట్టూ ఆరడుగుల ఎత్తున పెద్ద ముళ్ళకంచె వెయ్యబడివుంది. లోపలికి వెళ్ళాలంటే ఒకే దారి వుంది. అక్కడ ఇనుపగేటు వుంది. ఆ గేటుకు తాళంవుంది.

"సారథీ! నేను తాళంచెవి తీసుకు రావడం మరిచిపోయాను. తాళం తియ్యకుండా తోట లోపలికి వెళ్ళాలంటే దారి లేదు. నువ్విక్కడేవుండు...ఇంటికెళ్లి కీ తీసుకొస్తాను" అంటూ ఇంటిదారి పట్టాడు రాజు.

ఆ నిమ్మతోటకు ఆనుకుని తూర్పు దిక్కులో ఏపుగా పెరిగిన చెరకుతోట వుంది. ఆతోట గట్టుచుట్టూ కానుగచెట్లు వున్నాయి. రాజు వచ్చేలోగా అలా చెరకు తోట చుట్టూ తిరిగి వద్దామని అక్కడి నుండి కదిలాడు సారథి. చెరకు తోట మీదుగా వస్తున్న గాలి అతడి శరీరాన్ని చల్లగా తాకుతోంది.

ముందుకు నడుస్తున్న సారథి... ఎదురుగా కన్పించిన దృశ్యాన్ని చూసి చటుక్కున ఆగిపోయాడు. అక్కడ.. కొద్ది దూరంలో ఓ కానగచెట్టు నీడలో వెల్లికిలా పడుకుని ఓ పాతికేళ్ళస్త్రీ నిద్ర పోతోంది. ఆమెకు కుడిచేతివేపు ఒక ఖాళీ తట్ట, ఒక కొడవలి వుంది. ఆమె పైట కొంగు దూరంగా పడివుంది.

ఆమె చీర మోకాళ్ళవరకు గాలికి లేచిపోయివుంది. స్థానభ్రంశం చెందిన ఆ బట్టలు... ఆమె యవ్వనపు పొంగుల్ని బయటకు ప్రకటిస్తున్నాయి. ఇవేమి పట్టనట్టు ఆ స్త్రీ చల్లగాలికి గాఢంగా నిద్రపోతూవుంది. నలభైయేళ్ళు నిండిన ఓ మగాడు మెల్లగా అటువేపువస్తున్నాడు.

సారథి వెంటనే ఆమగమనిషికికన్పించకుండా ఓ పొదచాటున దాక్కున్నాడు. సారథి అక్కడ దాగివున్నట్లు ఆ మగమనిషికి తెలియదు. స్పృహలేకుండా చెట్టునీడన పడుకుని నిద్రపోయే ఆ స్త్రీని అతడేంచేస్తాడో చూద్దామనే ఉద్దేశంతో సారథి అలా పొదచాటునదాక్కున్నాడు.

గట్టుమీదుగా నడిచివస్తున్న అతడు చెట్టునీడన నిద్రపోయే ఆస్త్రీని చూసి హఠాతుగా ఆగిపోయాడు. రెండుక్షణాలు అలాగే నిలబడి..మెల్లగా గట్టుమీదినుండి కిందికి దిగి ఆమె నిద్రపోతున్న కానగ చెట్టువేపు అడుగులు వెయ్యసాగాడు. సారథి మనస్సులో అమాంతంగా ఓ అనుమానం పుట్టింది.

ఒంటరిగా పడుకునివున్న ఆ స్త్రీని అతడు బలాత్కారించడుగదా! ఆ ఉద్దేశం అతడిలో లేకపోతే అతడు అలా





ఎందుకు ఆమె దగ్గరకు వస్తున్నట్టు? బయటకు స్పష్టంగా అగుపించే ఆమె యవ్వనపు పొంగుల్ని చూసి అతడు ఉద్రేకపడతాడు. అతడిలోని కోరిక నాగుపాములా పడగవిప్పి ఆమె శీలాన్ని కాటేసుందేమో.

కానగచెట్టు నీడకు చేరుకున్న అతడు ఆమెకు ఎదురుగా నిలబడ్డాడు. ఆ క్షణంలో... అతడి కళ్ళలో ఏ భావం తొణికిసలాడుతోందో దూరంగావుండటం చేత సారథి ఆ భావాన్ని చదవలేక పోతున్నాడు. ఆమె కాళ్ళ దగ్గరగా నిల బడిన ఆ మగమనిషి మెల్లగా ఆమె మీదికి వంగసాగాడు.

అవును....అవును... తన అనుమానం నిజం. అతడు ఆ దారుణానికి పూను కుంటున్నాడు. తన కళ్ళముందు... పట్ట పగలు... ఇంత అన్యాయం జరగ బోతుంటే... దాన్ని చూస్తూ తనెలా సహించడం? మనిషి మృగంగా మారే ఆ భయంకర క్షణాలను ఎలా నివారిం చడం? తను...తనిప్పుడేమిటి చెయ్యడం

సారథి ఆలోచనలు హఠాత్తుగా స్తంభించిపోయాయి. అతడు అలాగే శిలా ప్రతిమలా నిలబడిపోయాడు. కారణం... ఇప్పటివరకు అతనిలో ఉవ్వెత్తుగా లేచిన అనుమానం అంతరించిపోయింది. ఏ అన్యాయం...ఏ దారుణమైతే అక్కడ జరగబోతుందని సారథి అనుకున్నాడో దానికి భిన్నమైన దృశ్యాన్నతడు చూస్తు న్నాడు.

నిద్రబోతున్న ఆ స్త్రీ మీదికి కొద్దిగా వంగిన అతడు... దూరంగా పడివున్న ఆమె పైటకొంగును కుడిచేత్తో అందుకుని ఆమె ఎదమీద కప్పాడు. గాలికి మోకాళ్ళ వరకు లేచి పడివున్న ఆమె చీరను మెల్లగా తీసి ఆమె పాదాల వరకు సర్దేసి.... అక్కడినుండి అతడు మళ్ళీ గట్టువేపుగా నడిచాడు.

ఛీ....తనెంత దారుణంగా ఊహిం చాడు! ఆ పల్లెటూరి మనిషిని అంతకన్నా ఉన్నతంగా అంచనా వెయ్యలేకపోయాడు తను. మనిషి మనిషిగా జీవించే క్షణాలే తప్ప....అవి మనిషిని మృగంగా మార్చే క్షణాలు కావు. ఆ క్షణాల్ని తను మరీ నీచంగా అంచనా వేశాడు. ఆ పల్లెటూరు మనిషి గురించి అంతకన్నా గొప్పగా అంచనా వెయ్యగల సంస్కారం తనకు లేకపోయింది.

తనమీద తనకే అసహ్యం కలిగింది సారథికి. ఒకరోజు...ఆర్టీసీ బస్‌స్టాండ్‌లో ఒక స్త్రీ తన బిడ్డకు స్తన్యం అందించి పాలిస్తూ వుండటం... ఆ దృశ్యాన్ని చూస్తూ ముగ్గురు రీసెర్చ్ స్కాలర్లు గుస గుసలాడుతూ నవ్వుకోవడం... అదంతా గుర్తుకొచ్చింది సారథికి.

వాళ్ళు ముగ్గురూ యు. జి. సి ఫెలోషిప్స్‌ను సంపాదించుకుని ప్రత్యేక అంశాలమీద పరిశోధనలు చేస్తూవున్న రీసెర్చ్ స్కాలర్లు. త్వరలో డాక్టర్ ఆఫ్ ఫిలాసఫీ డిగ్రీని కూడా అందుకుని మేధావుల జాబితాలో చేరబోయేవాళ్ళు.

అలాంటి నాగరికులు .... ఉన్నత విద్యను అభ్యసించినవాళ్ళు....ఒక తల్లి తన బిడ్డకు స్తన్యాన్ని ఇచ్చిన దృశ్యం చూసి సంస్కారహీనంగా ఆటవికుల్లా ప్రవర్తించారు. మనిషంటే ఏవగించుకొనే దానికి సరిపోయే అసహ్యాన్ని కలిగించారు ఆ ముగ్గురూ.

కానీ...ఈ పల్లెటూరి మనిషి నిర్జన ప్రాంతంలో చెట్టునీడన ... ఒంటి మీది నుండి తొలిగిపోయిన బట్టలతో నిద్ర





పోతున్న ఒక స్త్రీని చూసి... ఉద్రేకపడ లేదు. కోర్కెల్ని రెచ్చగొట్టుకోలేదు. మనిషైనవాడు ఎలా ప్రవర్తించాలో అలాగే ప్రవర్తించాడు.

కానీ... ఈ పల్లెటూరి మనిషి ఏ యూనివర్సిటీలోనూ చదువుకోవడంలేదు. ఏ అంశంమీదా పరిశోధన చెయ్యడంలేదు. ఏ మేధావుల జాబితాలోనూ చేరబోవడం లేదు. అయినా ఇతనిలో ఎంత సంస్కార ముంది! ఎంత మానవత్వముంది!

అది యూనివర్సిటీ. ఇది ఒక పల్లె టూరు. వాళ్ళు నాగరీకులు. వీళ్లు అనాగ రీకులు. వాళ్ళు అక్షరాస్యులు. కానీ వీళ్ళు నిరక్షరాస్యులు. అయినా ఈ రెండు ప్రపంచాల మధ్య...ఈరెండు ప్రపంచాల్లో సంచరించే మానవుల మధ్య ఎంత వైవిధ్యం!

అక్షరాస్యతకు అర్థం... కేవలం రాయ గలగడం, చదవగలగడం మాత్రమేనా? అంతకుమించి మరేమీలేదా? విద్యలేనివాడు వింత పశువా? ఇది నిజంగా అంగీకార యోగ్యమేనా?-సారథి మనసులో ఇలా ఎన్నో ప్రశ్నలు బయలుదేరాయి.

"సారథీ! ఇక్కడున్నావా?" అంటూ రాజు సారథి దగ్గరకు వచ్చాడు. తను చూసిన దృశ్యం గురించి, ఒకనాడు తను బస్టాండులో చూసిన దృశ్యం గురించి రాజుకు చెప్పాడు సారథి.

"అలాంటి ఆటవికులు లెక్చరర్లలో కూడా వున్నారు సారథీ! పరీక్షహాల్లో అమ్మాయిలు పరీక్షలు రాస్తూవుంటే... దొంగచాటుగా వాళ్ళ అవయవ సౌంద ర్యాన్ని చూసే ఇన్విజిలేటర్స్ కూడా వున్నారోయ్" అన్నాడు రాజు.

* * * *

యూనివర్సిటీ మళ్ళీ తెరిచారు. ఆహార సముపార్జనకోసం ఉదయాన్నే నివాసాలు వదిలి వెళ్ళిపోయి చీకటిపడే సమయానికి కిలకిలమంటూ గూళ్ళకు చేరుకునే పక్షుల గుంపుల్లా ఇరవై రోజులక్రితం ఇళ్ళకు వెళ్ళిపోయిన విద్యార్థినీ విద్యార్థు లందరూ మళ్ళీ యూనివర్సిటీ హాస్టళ్ళకు చేరుకున్నారు.

ఇరవై రోజులనుండి ఎడారిలా పడి వున్న ఆ యూనివర్సిటీ ఆవరణ పెళ్ళి పందిరిలా కళకళలాడసాగింది. యూని వర్సిటీ తెరవగానే పరీక్షల తేదీ ప్రకటిం చారు. ప్రతి సంవత్సరమూ అలా యూని వర్సిటీలో పరీక్షల తేదీ ముందుగానే ప్రకటించడం జరుగుతుంది. అయితే పరీక్షలు మాత్రం ఆ తేదీన జరగవు.

పరీక్షలను పోస్ట్‌పోన్ చెయ్యడమనేది యూనివర్సిటీల సాంప్రదాయం. ఏ సంవత్సరమూ ప్రకటించిన తేదీలలో పరీక్షలు జరగవు. పదిమంది విద్యార్థులు కలిసి నినాదాలుచేస్తూ అడ్మినిస్ట్రేషన్ బిల్డింగ్‌వద్దకు వెళితే చాలు... వెంటనే పరీక్షలు పోస్ట్‌పోన్ అయిపోతూవుంటాయి.




రాత్రి ఎనిమిది గంటలు దాటుతోంది. గదిలో బెడ్‌మీద పడుకుని 'మృచ్ఛ కటికం' చదువుకుంటున్నాడు రాజు. రెఫరెన్స్ పుస్తకాలను ముందేసుకుని రంగనాథ రామాయణ కర్తృత్వానికి

సంబంధించిన వ్యాసం తయారుచేస్తున్నాడు సారథి. సరిగ్గా అప్పుడే వాళ్ళ రూంలోకి ప్రవేశించాడు దామోదరం.

"ఎప్పుడొచ్చావోయ్ దామోదరం?"

"ఊరినుండి సాయంత్రం వచ్చాను గురూ"

"ఈ శెలవురోజులు ఎలా గడిచాయ్?"

ఎస్సె రాయడం ఆపి అడిగాడు సారథి.

"బోర్ కొట్టకుండా గడిచిపోయాయి గురూ! అబ్బ... ఇరవై రోజులు ఇరవై క్షణాల్లా గడిచిపోయాయనుకో"

"అంతే దామోదరం! కాలమనేది చిల్లుపడిన ఒక మట్టికుండ. దివారాత్రులు చిందిపోతూనే వుంటాయి మనకోసం నిమిషమైనా నిలవకుండా. దామోదరం... ఎలావుంది మన కొటేషన్?" అడిగాడు రాజు సిగరెట్ వెలిగించుకుంటూ.

"అద్భుతంగా వుందిగురూ! మళ్ళీ చెప్పు... పేపర్లో రాసుకుంటాను" అన్నాడు దామోదరం.

"నోనో... గోల్డెన్ వర్డ్స్ ఆర్ నాట్ రిపీటెడ్" అన్నాడు రాజు నవ్వుతూ.

"అయితే ఇంకెప్పుడూ గోల్డెన్ వర్డ్స్ చెప్పకు. సిల్వర్ వర్డ్స్ చెప్పు... రాసుకోడానికి అవకాశముంటుంది"

"ఇంకేమిటి దామోదరం విశేషాలు?" ఫ్యాన్ స్పీడ్ పెంచుతూ అడిగాడు సారథి.

"విశేషాలు సశేషాలేగానీ మీరిద్దరింకా ఇక్కడేవున్నారేంటి బయలుదేరకుండా?"

"ఎక్కడికి?" అడిగాడు రాజు.

"లైబ్రరీముందుకు"

"ఇప్పుడా! ఇప్పుడు లైబ్రరీవద్దకెందుకు ఇంత రాత్రివేళ?" ప్రశ్నించాడు సారథి.

"అయ్యో! అసలు విషయం తెలిసినట్టులేదు. ఇవాళరాత్రి ఎనిమిదిన్నరకు యూనివర్సిటీ లైబ్రరీ ముందు విద్యార్థులంతా సమావేశమవుతున్నారు. ఎన్నికలకు సంబంధించిన విషయాల గురించి ఏదో చర్చిస్తారట. ఆ చర్చలో పాల్గొనడానికి స్టూడెంట్సంతా పోతున్నారు. మీరూ బయలుదేరండి వెళ్దాం" అన్నాడు దామోదరం.

యూనివర్సిటీ లైబ్రరీ ముందు విశాలమైన స్థలముంది. ఆ ఖాళీ స్థలానికి రెండు వేపులా లాన్స్ వున్నాయి. ఎప్పుడైనా విద్యార్థులు తమ సమస్యల గురించి అందరి ముందూ చర్చించుకుని సమ్మెలు లాంటివి చెయ్యాలంటే ముందుగా రాత్రి పూట ఆ లైబ్రరీ ముందు సమావేశమవుతుంటారు.

హాస్టల్ నుండి సారథి, రాజు, దామోదరం మాట్లాడుకుంటూ లైబ్రరీ ముందుకు వచ్చారు. అప్పటికే అక్కడ సుమారు అయిదు వందల మంది విద్యార్థులు సమావేశమై వున్నారు. ఉపన్యాసం పిచ్చివుండే విద్యార్థులు ఈ సమావేశాల్ని తమ శాయశక్తులా సద్వినియోగపరుచుకుంటూ వుంటారు.

లైబ్రరీలోకి ప్రవేశించడానికి అక్కడ ఎత్తుగా మెట్లున్నాయి. విద్యార్థి నాయకులు ఉపన్యసించాలంటే ఆ మెట్లమీద నిలబడతారు. వాళ్ళకదే వేదిక. కింద వున్న విద్యార్థుల గుంపులోంచి ఆ మెట్లమీదికి వెళ్ళి నిలబడ్డాడు రాజేంద్ర. కులం ప్రాతిపదికగా ఎన్నికల్లో పోటీచేసే వాళ్ళలో అతనూ ఒకడు.

"విద్యార్థి మిత్రులారా! మనమంతా ఇక్కడ యూనివర్సిటీలో జరగవలసిన ఎన్నికల్ని గురించి మాట్లాడటానికి





సమావేశమయ్యాం. ఈ సమావేశానికి ఇంతమంది హాజరు కావడమే మన విజయాన్ని సూచిస్తోంది. యూనివర్సిటీ పాలకవర్గాలు ఈ ఏడు ఎన్నికల్ని పెట్టరట. అంటే ఏమిటి? ఒక రకంగా మన హక్కులను కాలరాయడానికి ప్రయత్నిస్తున్నారన్నమాటే.

కానీ... ఎన్నికలను జరిపించాలని మనం డిమాండ్ చెయ్యాలి. మనమంతా ఏకమై మన హక్కుల్ని రక్షించుకోవాలి. ఎన్నికల్ని జరిపించవలసిందిగా మనం అంతా అధికారులకు రేపొక మెమొరాండం సమర్పిస్తాం. మన డిమాండ్‌కి వాళ్ళు ఒప్పుకుంటే సరి. లేకుంటే మనం క్లాసులకు వెళ్ళేది లేదు. నిరాహారదీక్షలు చేస్తాం. మన కోర్కెల్ని సాధించుకునేందుకు మనం పోరాటానికి సిద్ధపడాలి. ఓవేళ యూనివర్సిటీ క్లోజ్ చేసినా సరే వెనుకంజ వేయకూడదు మనం. ఇది మన ప్రణాళిక. దీనికి సంబంధించి మీలో ఎవరైనా మీ అభిప్రాయాల్ని చెప్పదలిస్తే వేదికపైకి రండి"

అలా మాట్లాడి రాజేంద్ర తన ఉపన్యాసం ముగించాడు. అక్కడ సమావేశమై వున్నవారిలో చాలామందికి అతని మాటలు నచ్చలేదు. ఎన్నికల పట్ల వాళ్ళలో చాలామంది ప్రస్తుతం సుముఖంగాలేరు. తన అభిప్రాయం చెప్పదలిచి సారథి ఆ గుంపులోంచి లేచి వేదిక పైకి వచ్చాడు.

"మిత్రులారా! ఎన్నికల కోసం డిమాండ్ చెయ్యడం గొప్ప విశేషమే... కాదనను. కానీ ఇప్పుడు సెకండ్ టర్మ్ కూడా అయిపోతూవుంది. సిలబస్ మాత్రం ఎవరికీ ఇంకా పాతిక భాగం కూడా పూర్తికాలేదు. ఎన్నికల కోసం మనం సమ్మె చేస్తే యూనివర్సిటీని మళ్ళీ మూసేస్తారు. తర్వాత ఎప్పుడో తెరుస్తారు. అప్పటికి వేసవి సెలవులొస్తాయి. పరీక్షలూ వస్తాయి. మన సిలబస్ అలాగే మిగిలివుంటుంది. మనం ఇక పరీక్షలు ఎలా రాయగలం ? ముఖ్యంగా సైన్సు స్టూడెంట్స్ నాశనమైపోతారు. కనుక మనం సమ్మెలుచేస్తే నష్టపోయేది ఎవరో మీరే ఆలోచించండి.

పైగా ఇంకో విషయం. ఇక్కడ ఎన్నికలంటే రెండు వర్గాల మధ్య పోరాటమని మీ అందరికీ తెలుసు. ఈ ఎన్నికల వల్ల... గెలిచే నాయకుల వల్ల విద్యార్థులకెలాంటి న్యాయమూ జరగదు. కనుక ఈ పోరాటంలో మేము భాగం పంచుకోలేం. పోరాటానికి సిద్ధపడలేం. మమ్మల్ని మాత్రం ఇబ్బందిపెట్టకండి. మేం క్లాసులకు వెళ్ళి తీరుతాం" అంటూ వేదిక దిగేశాడు సారథి.

సారథి మాటలకు చాలామంది చప్పట్లు కొట్టారు. సైన్సువాళ్ళు అతడిని అభినందించారు. సారథి చెప్పిందే సబబు అంటూ వాదించారు. థర్డ్‌టరం కూడా వచ్చేస్తూవుంది గనుక ఇక ఎన్నికలు అనవసరం అన్నారు. ఎన్నికల పట్ల విముఖత చూపి చాలామంది లేచి వెళ్ళిపోయారు. నాయకులు సారథిపై మండిపడ్డారు. చివరకు నిరుత్సాహపడ్డారు. ఎన్నికల తతంగం అంతటితో ముగిసింది.

ఉదయం తొమ్మిదిన్నర కావస్తోంది. సైరన్ మోగడానికి ఇంకా అరగంట వ్యవధివుంది. సారథి, రాజు మెస్‌కి వెళ్ళి టిఫిన్ తిని క్లాస్‌కు వెళ్ళడానికి రెడీ అవుతున్నారు. దామోదరం అప్పుడే రెడీ అయి బుక్స్ పట్టుకుని రాజు వాళ్ళ రూంకొచ్చాడు.


చతుర ... 99

"ఏమిటి గురూ...ఇంకా బయలుదేర లేదా?"

"రెడీ అవుతున్నాం" చెప్పాడు సారథి.

"అన్నట్టు దామోదరం..యూనివర్సిటీ తెరిచి పదిరోజులు అవుతోంది. మన క్లాస్‌లో పరిమళ ఇంకా రాలేదెందుకని?" తలదువ్వుకుంటూ అడిగాడు రాజు.

"పరిమళ ఇక రాదు" దామోదరం అన్నాడు.

"అదేమిటి?"

"అవును ... డిస్‌కంటిన్యూ చెయ్యవచ్చు"

"ఎందుకని?"

"అదో కథలే"

"మినీకథా... పెద్దకథా?" నవ్వాడు రాజు.

"రెండూ కాదు...సీరియల్లాంటిది"

"వెరీగుడ్! అయితే దామోదరం ... ప్రస్తుతానికి మొదటిభాగం విన్పించు" అడిగాడు రాజు.

"మొదటిభాగం కాదు. అన్ని భాగాలూ అయిదు నిమిషాల్లో సంక్షిప్తంగా విన్పించేస్తాను"

"అయితే ప్రారంభించు మరి"

"పరిమళ ఓ ఇంజనీరింగ్ అబ్బాయిని లవ్ చేసింది" ప్రారంభించాడు దామోదరం.

"ఏం? యూనివర్సిటీలో ఎవరూ దొరకలేదా?"

"దొరక్కకాదు. ఆ ఇంజనీరింగ్ అబ్బాయి బాగా డబ్బున్నవాడట" దామోదరం అన్నాడు.

"పరిమళ కూడా బాగా డబ్బున్న[illegible]గా"

"నువ్వు చెప్పింది నిజమే రాజూ... పరిమళ మన దృష్టిలో డబ్బున్న అమ్మాయే. కానీ ఆ అమ్మాయి దృష్టిలో ఆ ఇంజనీరింగ్ అబ్బాయి డబ్బున్నవాడై వుంటాడు" అన్నాడు సారథి.

"అదీ సంగతి. 'అందుకని పరిమళ వాడి వెంటపడిందట. వాడి ప్రేయసిలలో పరిమళ సీరియల్ నంబర్ పదికి పైనేసట. వాడు పరిమళను తన వెంట సినిమాలకూ షికార్లకూ బాగా తిప్పేసుకుని... ఉన్నట్టుండి ఓరోజు మరో అమ్మాయిని పెళ్లిచేసేసుకున్నాడట"

"బహుశా ఆ అమ్మాయి వాడి దృష్టిలో బాగా డబ్బున్న ఆడపిల్లయి వుంటుంది" అన్నాడు సారథి.

"ఉండొచ్చు. లవ్‌లో డిజప్పాయింట్ అయి మరవలేని బాధతో...యూనివర్సిటీ మొన్న గలాటాల్లో మూసెయ్యడానికి ముందే పరిమళ ఊరెళ్ళిపోయిందట" చెప్పాడు దామోదరం.

"మరువలేని బాధకన్నా మధురమే ముందని అన్నారు. అది సరేగానీ దామోదరం...నువ్వు ఈ డీటెయిల్స్ ఎప్పుడు సేకరించావు?" అడిగాడు రాజు.

"మొన్న...మన క్లాస్‌మేట్ సీత చెప్పింది"

"ఓహో..నువ్వక్కడ రికార్డ్ చేసుకుని ఇక్కడ ఆన్ చేశావన్నమాట. అన్నట్టు నువ్వీమధ్య ఉమెన్స్ హాస్టల్‌కి ఎక్కువగా వెళుతున్నట్టు, సీతతో మాట్లాడుతున్నట్లు తెలిసింది"

"అబ్బే..అదేం లేదుగురూ! నోట్సులు కావాలంటే రెండు మూడుసార్లు వాళ్ళ హాస్టల్‌కెళ్లానంతే. సరే...బయల్దేరండి. టైం అవుతోంది" అన్నాడు దామోదరం టాపిక్ మార్చేస్తూ.

తనకన్నా బాగా డబ్బున్నవాడని




పరిమళ ఆ ఇంజనీరింగ్ అబ్బాయి వెంట పడిందన్నమాట. ఈ నాగరికతా ప్రపంచంలో చివరకు ప్రేమకూడా వ్యాపారపు రంగును పులుముకొన్నదన్న మాట - ఆలోచిస్తూ నడుస్తున్నాడు సారథి.

హాస్టల్లోంచి బయటపడుతుంటే ... అక్కడ నోటీస్ బోర్డులో అతికించిన పేపర్ మీద పడ్డాయి సారథి చూపులు. అందులో 'విద్యార్థులకు మనవి' అని హెడ్డింగ్ వుంది.

"డియర్ ఫ్రెండ్స్! ఇవాళ ఉదయం ఏడు గంటలకు స్నానంచేసి... నేను బాత్‌రూమ్స్ దగ్గర నా సోప్ అండ్ ప్లాస్టిక్ మగ్‌ను మరచిపోయాను. వెళ్ళి చూస్తే అక్కడవి లేవు. పొరబాటున ఎవరైనా తీసుకు వెళ్ళివుంటే...దయచేసి సలభయ్యో నంబర్ గదికి తెచ్చి ఇవ్వ వలసిందిగా మనవి. ఇట్లు

రవికుమార్".

"ఈ రవికుమార్ ఎవరోగానీ..పాపం గొప్ప అమాయకుడిలా వున్నాడు సారథీ! బాత్‌రూమ్స్ వద్దనుంచి తీసుకెళ్ళినవాడు పొరబాటుగా తీసుకెళ్ళి వుండడు. కావాలనే దొంగిలించి వుంటాడు. ఇలాంటి కేసులను మనం ఎన్ని చూళ్ళేదు" అన్నాడు రాజు.

కేవలం సోప్‌బాక్సులేగాదు...రేజర్లనూ బయట ఉతికి ఆరేసిన బనియన్లనూ, కట్ డ్రాయర్లనూ చాలామంది అక్కడ చాలాసార్లు పోగొట్టుకున్నారు. 'ఛీ..వీళ్ళ కన్నా..బయట బజార్లలో జేబులుకొట్టే దొంగలు నయం' అనుకుంటూ ముందుకు నడిచాడు సారథి.

"గురూ! మీరిద్దరూ రెండు నిముషాలు ఇక్కడే చెట్టుకింద నిలబడి వుండండి. నేనిప్పుడే ఈ బుక్‌ని లైబ్రరీలో రిటన్ చేసి వచ్చేస్తాను" అన్నాడు దామోదరం లైబ్రరీ ముందు ఆగుతూ.

"ఏం పుస్తకమది?" అడిగాడు రాజు.

"గోర్కీది. అమ్మ"

"బాగుందా?"

"బాగుందని చాలామంది చెబితే తీసుకెళ్ళి చదివాను. నాకు నచ్చలేదు. భలే బోర్ కొట్టింది" అన్నాడు దామోదరం.

"చాలా పొరబాటు దామోదరం! ఇంకెప్పుడూ అలా అనకు. పనికిమాలిన కొన్ని తెలుగు నవలలు చదవడానికి అలవాటుపడిన నీకు అది బోర్‌గానే అన్పిస్తుంది. ప్రపంచంలోని పాఠకులను గొప్పగా ఆకర్షించి కోటానుకోట్ల జన జీవితంపై బలీయమైనటువంటి ప్రభావాన్ని చూపిన 'అమ్మ'లాంటి నవల నీకు చెత్తగా అన్పించిందా?

"దామోదరం! జనజీవితంపై అంత గొప్ప ప్రభావాన్ని చూపిన నవల విశ్వ నవలా సాహిత్యంలోనే మరోటిలేదు. గోర్కీ ఖ్యాతిని సకల ప్రపంచానికి ప్రకటించిన ఆ నవల ఇప్పటికి నూట ఇరవైఏడు విదేశీ భాషలలోకి అనువదింప బడింది. చరిత్ర నేపథ్యంనుండి పిండిన వజ్రఖండం ఆ నవల" అన్నాడు సారథి.

"ఏమిటో గురూ! నీకర్థమైనట్లు నాకర్థమై చస్తేగదా. సరే ... ఇప్పుడే వచ్చేస్తాను" అంటూ లైబ్రరీలోకి నడిచి ఆ బుక్‌ని అక్కడ రిటన్ ఇచ్చేసి వచ్చాడు దామోదరం. అక్కడినుండి వాళ్ళు ఉత్తరాల కోసం యూనివర్సిటీ పోస్టాఫీసు వద్దకు వచ్చారు.

సారథిని చూడగానే పోస్ట్‌మాన్ కిటికీ లోంచి ఒక ఉత్తరాన్ని అందించాడు. మాధవరావు నుండి వచ్చిన ఉత్తరమది.

"ప్రియమైన సారథీ! నెల్రోకితం సీతాపురంనుండి 'కోయిలకుంట్ల'కు నన్ను బదిలీచేశారు. ఇప్పుడు నేను కోయిల కుంట్ల హైస్కూల్లో పనిచేస్తున్నాను. ఇక్కడ మేమంతా క్షేమం. నువ్వూ క్షేమమే అని తలుస్తాను.

నీకు వీలుంటే ఓసారి ఎప్పుడైనా తప్పక కోయిలకుంట్లకు వచ్చివెళ్ళు. నిన్ను చూడాలనివుంది. రాత్రి కలలో నువ్వు కన్పించావు" అంటూ ఇలా ఎంతో ఆప్యాయతతో రాయబడింది ఆ ఉత్తరం. మాధవరావుకు తనపైగల అభిమానానికి పులకరించిపోయాడు సారథి. ఉత్తరాన్ని జేబులో పెట్టుకుని కదిలాడు సారథి.

"గురూ...! గురూ! ఈ కరపత్రాన్ని చూశావా?" అంటూ దామోదరం ఒక పాంప్లెట్‌ను తీసుకొచ్చి సారథి, రాజులకు చూపాడు. అలాంటి కరపత్రాలు ఇంకా అక్కడక్కడా కొన్ని పడివున్నాయి. కొంతమంది విద్యార్థులు ఆ కరపత్రంలో వున్న విషయం గురించి గుంపుగా చేరి రకరకాలుగా చర్చించుకుంటున్నారు.

ఒక డిపార్ట్‌మెంట్‌లో ఒక లెక్చరర్.. తనకింద ఎం.ఫిల్ చేసే విద్యార్థిని నాలుగు వేలరూపాయలు అడిగాడని..అందుకు ఆ విద్యార్థి ఇవ్వటానికి ఒప్పుకున్నాడని.. దానికి ప్రతిఫలంగా ఆలెక్చరర్ ఆవిద్యార్థికి యం.ఫిల్ థీసిస్ తనే రాసియిస్తానని చెప్పినట్లు ఆ కరపత్రంలోవుంది. దీనికి సంబంధించిన ఉత్తరాలనుకూడా త్వరలో బయటపెడతామని కూడా అందులో రాసివుంది.

ఏ కులానికీ సంబంధించని.. ప్రత్యేక మైన ఒక రాజకీయ దృక్పథంగల విద్యార్థిసంఘం ఒకటి ఆ యూనివర్శిటీలో ఇప్పుడిప్పుడే పుడుడు పోసుకుంటోంది. ఆ విద్యార్థిసంఘం ఆ కరపత్రాన్ని ప్రచురించి యూనివర్సిటీ ఆవరణలో వెదజల్లింది.



థీసిస్ రాయగల శక్తి సామర్థ్యాలున్న లెక్చరర్లు కొందరు...యం.ఫిల్ డిగ్రీపై మోజున్న విద్యార్థులకు తామే థీసిస్ రాసిచ్చి డబ్బులు తీసుకుంటున్నారు. అంతా ఫ్రాడ్ అనుకుంటూ క్లాస్‌వేపు నడిచాడు సారథి.

* * * *

అవాళ ఆదివారం. సాయంత్రం సమయాల్లో సరదాగా షికార్లు కొట్టేందుకు ఆదివారం మాత్రమే సారథికి అవకాశం వుంటుంది. మిగిలిన రోజుల్లో ట్యూషన్స్ చెప్పడంతోటే సాయంత్రాలన్నీ గడిచి పోతుంటాయి. ఆదివారం సాయంకాలం బజార్లో ఫ్లాట్‌ఫారంమీద పాత పుస్తకాలు తక్కువ రేటుకు అమ్ముతుంటారు. పాత పుస్తకాలను కొనడం సారథికి ఓ పెద్ద వ్యసనం.

సారథి, రాజు, దామోదరం మాట్లాడు కుంటూ బజార్లో నడుస్తున్నారు. ఆదివారం కనుక షాప్స్ అన్నీ మూతబడి వున్నాయి. అయినా.... వచ్చేపోయే వాహనాలతో బజారు చాలా రద్దీగా వుంది. మెల్లగా నడుస్తున్న సారథి ఓ దృశ్యాన్ని చూసి చటుక్కున ఆగిపోయాడు. రాజు, దామోదరం కూడా ఆగి సారథి తిలకిస్తున్న ఆ దృశ్యం వేపు తమ దృష్టిని కూడా సారించారు.

అక్కడ ఓ హోటల్ ముందు... సిమెంట్‌తో చేయబడిన ఒక చెత్తకుండీ వుంది. ఆ కుండీ దగ్గర ముగ్గురు పిల్లలు చేరి కుండీలోంచి ఎంగిలాకుల్ని బయటకు లాగి, అందులోని అన్నం మెతుకుల్ని చేతులతో దేవుకుంటూ ఆరాటంతో తింటున్నారు. దూరంగా నిలబడిన కుక్కలు వాళ్లవేపు అసూయగా చూస్తు న్నాయి.

ఆ దృశ్యం చూసిన సారథికి మనసు వికలమైపోయింది. ఆ పిల్లలు భావి భారత పౌరులు. భావితరానికి నిర్మాతలు. రాతి యుగంనుండి రాకెట్ యుగం వరకు విశ్వంలో వేగంగా పరిణమించిన జీవి మానవుడే. బక్కచిక్కిన డొక్కలతో ఎంగిలి విస్తళ్ల చుట్టూ వెంపర్లాడుతున్నదీ మానవుడే. సామాజిక వ్యవస్థలో ఇలాంటి దారిద్ర్యంలో పడి కొట్టుకుంటున్న వాళ్లందరికీ జీవితం ఎప్పుడూ ముళ్లబాటే.

"గురూ! ఆ పిల్లలు ఆ ఎంగిలి విస్తళ్లలోని ఆ మెతుకుల్ని ఎలా తినగల్గు తున్నారు? అసలు తినడానికి ఎలా సయిస్తుంది? వాళ్లకి అసహ్యం అన్పించదూ? రోత పుట్టదూ? ఎలా రుచిస్తుంది?" సారథివేపు చూస్తూ ప్రశ్నిం చాడు దామోదరం.

దామోదరం..చాలాకాలం క్రితంఓ కథ చదివాను. ఆ కథ నాకు ఇప్పటికీ గుర్తుంది. ఆ కథలో రచయిత ఓచోట జీవితానికి సంబంధించి ఒక గొప్ప సత్యాన్ని చెప్పారు" సారథి ఆగాడు.

"ఏమిటది?" అడిగాడు దామోదరం ఆత్రంగా.

"ఒకానొక వస్తువు మానవుడికి రుచించడంగానీ.రుచించకపోవడంగానీ ఆ వస్తుధర్మంపైన ఆధారపడి వుండదు. ఆ వస్తువు యొక్క అవశ్యకతపైన ఆధార పడి వుంటుంది– అని అన్నారు రచయిత. కనుక నువ్విప్పుడు అడిగిన ప్రశ్నకు సమాధానం ఇక నేను ప్రత్యేకంగా చెప్ప వలసిన పని లేదనుకుంటాను" అన్నాడు సారథి.

"నువ్వూ రచయితవే గదా దామో దరం! రచయితైనవాడు బయట ప్రపంచంలో ఏం జరుగుతూ వుందో





చూసి స్పందించి బాధపడి రాయాలి. అంతేగానీ ప్రపంచాన్ని పట్టించుకోకుండా గదిలో కూర్చుని టన్నులకొద్దీ సాహిత్యం ఉత్పత్తిచేస్తే ప్రయోజనం ఏమిటి? ప్రపంచాన్ని చూడకుండా మంచి రచయితవి ఎలా అవుతావు?" అన్నాడు రాజు.

"రచయిత అంటే గుర్తుకొచ్చింది గురూ! ఎల్లుండి సాయంత్రం నాలుగ్గంటలకు యూనివర్సిటీఆడిటోరియంలో మన తెలుగుడిపార్ట్ మెంట్ వాళ్లుఒకసాహితీసమావేశాన్ని ఏర్పాటు చెయ్యబోతున్నారు. తెలుగు సాహిత్యం గురించి ఓ ఉపన్యాసం ఇవ్వడానికి ముఖ్య అతిథిగా ఓ రచయిత రాబోతున్నాడు"

"ఎవరు దామోదరం ఆ రచయిత? బాగా రాస్తాడా?"

"చెత్త" అంటూ పెదవి విరిచాడు సారథి.

"మరి ఆ చెత్తనంతా నువ్వెందుకు చదివినట్టు?" సారథి వేపు చూసి ప్రశ్నించాడు దామోదరం.

"ఎవరెంత గొప్పగా రాస్తున్నారో, ఎవరెంత చెత్తగా రాస్తున్నారో తెలుసుకోవాలంటే చదవాలిగా మరి"

"శ్రీనాథ్" అనే ఆ రచయిత తెలుగులో పరిశోధనచేసి ప్రస్తుతం ఉన్నతమైన ఒక ప్రభుత్వోద్యోగం చేస్తున్నాడు. తనకొక గొప్ప జాతీయ దృక్పథం వున్నట్టూ, దేశభక్తి అపారంగా వున్నట్టూ పరోక్షంగా ఆయన తన నవలల ద్వారా ప్రకటించుకుంటూ వుంటాడు. అందుకు నవలా ప్రక్రియను సాధనంగా పట్టుకున్నాడాయన.

శ్రీనాథ్ గతంలో రాసిన నవలలన్నింటినీచదివాడు సారథి. అవి అతనికి నచ్చకపోగా వాటిమీద అతడికి భలే రోత కూడా పుట్టింది. సమాజం ఒక జడ పదార్థమైపోయినట్టూ, దానికొక శాశ్వత స్వభావముండి అది ఎప్పటికీ మారనట్టూ, అంతా విధి విలాసం లలాట లిఖితం అన్నట్టుగా వుంటాయి అతని నవలలు.

దేనికీ ఎవరూ బాధ్యులుకాదు. ఈ కష్టాలూ, కన్నీళ్లు, ఆకలీ, దారిద్ర్యం అంతా పూర్వజన్మ దుష్కృత ఫలమని, దానికి ఎవరూ ఏమీ చెయ్యలేరని శ్రీనాథ్ అభిప్రాయం. సారథి గొప్ప ఆస్తికుడు గానీ నాస్తికుడుగానీ కాదు. కానీ ఈ మిథ్యావాదాలూ, కర్మసిద్ధాంతాలంటే ఒళ్ళు మండిపోతుంది.

పతనమైపోతున్న సంప్రదాయాలను పరిరక్షించడానికి కంకణం కట్టుకున్న వాడిలా శ్రీనాథ్ నవలల ముసుగులో వచన పురాణాలు రాస్తుంటాడు. మత తత్వాన్ని రెచ్చగొట్టే ధోరణి కూడా కొన్ని నవలల్లో అగుపిస్తుంది. అందుకే ఆయన నవలలంటే సారథికి మహాచిరాకు.

ఈ దేశంలోని సగటు మానవుడి జీవితానికీ, శ్రీనాథ్ తన నవలలో చిత్రించే జీవితానికీ ఏమాత్రం పోలికలనేవివుండవు. సాంఘిక ఆర్థిక సమస్యలకు సంబంధించి ఆయనకో స్పష్టమయిన అవగాహనగానీ ఒక దృక్పథంగానీ లేదు. ఆయన ఆలోచనలెందుకోగాని ఆ సమస్యల ఛాయలకు కూడా వెళ్ళవు.

ఈ సమాజంలోని వాసవిక సమస్యల గురించి రాయడం రచయితయొక్క కనీసపు నైతిక బాధ్యత అని అతను ఎప్పుడూ అనుకోలేదు. లోపభూయిష్టమైన ఈ వ్యవస్థను ప్రయత్నిస్తే సరిచేసుకోవచ్చుననే ఆలోచన ఆయనకు రాదు. గానీ పునర్జన్మల గురించి, మంత్రశాస్త్రం.



గురించి పుష్కలంగా నవల్లు రాసేస్తాడు.

రెండ్రోజులు గడిచాయి.

సాయంత్రం నాలుగ్గంటలు కావస్తోంది. యూనివర్సిటీ ఆడిటోరియం జనంతో నిండుతోంది. కేవలం తెలుగు డిపార్ట్‌మెంట్‌కు సంబంధించిన వ్యక్తులే గాకుండా సాహిత్యంపట్ల అభిరుచిగల వాళ్లుకూడా హాజరవుతున్నారు. ఇంకో పావుగంటలో శ్రీనాథ్ అక్కడ ఉపన్యసించబోతున్నాడు.

దామోదరం శుభ్రంగా డ్రస్ చేసుకొని హడావుడిగా సారథివాళ్ళ రూంకొచ్చి, "ఏమిటి గురూ...మీరింకా ఇలాగే వున్నారు? అప్పుడే మన క్లాస్‌మేట్స్ చాలామంది పోయారు'' అన్నాడు.

"ఆ...చాలామంది పోయారా? ఉన్నట్టుండి ఏమొచ్చింది పాపం...కలరాగానీ సోకిందా?'' అన్నాడు రాజు.

"నీకెప్పుడూ వేళాకోళమేగురూ! బయల్దేరండి త్వరగా..మీటింగ్ ప్రారంభమైపోతుంది" దామోదరం అన్నాడు.

"ఫర్వాలేదులే. మనం వెళ్ళేలోగా ఆయనగారేమీ అపూర్వమైన అంశాల గూర్చి మాట్లాడెయ్యడులే. అది సరేగానీ దామోదరం! నువ్వీమధ్య భలే స్మార్ట్‌గా తయారైపోతున్నావోయ్''

"అబ్బే..అదేంలేదు. నేను మామూలుగానే వున్నానే"

"అని నువ్వనుకుంటున్నావు. చూసే వాళ్ళకు మాకు తెలుస్తుందిగా.అన్నట్టు... ఆ రమేష్‌గాడిని చూశావా? ఎం.ఏలో చేరిన కొత్తరోజుల్లో వాడి తల్లోంచి కారుతూ వుండేది''

"ఏమిటది?"

"ఆముదం జిడ్డు. తలకు అరలీటర్ పెట్టేవాడు. అలాంటివాడు ఇప్పుడు హేర్ ఆయిల్ పెడుతున్నాడు. సెంటు కూడా కొట్టుకుంటున్నాడు. గొప్ప డెవలప్‌మెంటే"

"డెవలప్‌కాక చస్తాడా? రోజూ సాయంత్రం కోళ్ళ ఫారానికి వెళుతున్నాడుగా"

"కోళ్ళఫారానికా..ఎందుకూ?"

"కోళ్ళఫారమంటే, ఐ మీన్ ఉమెన్స్ హాస్టల్. ఆ రమేష్‌గాడీమధ్య సాయంత్రాలన్నింటినీ ఉమెన్స్‌హాస్టల్‌కు పక్కన వుండే చింతచెట్లకిందే గడిపేస్తున్నాడు"

"ఏ సుందరీమణితో?"అడిగాడురాజు.

"మన క్లాస్‌మేట్ లీలాప్రియదర్శినితో"

"ఆ యల్.పి.డి.తోనా?"

"యల్.పి.డి. ఏమిటి?"

"యల్.పి.డి. అంటే లోకల్ పాల డిపో. అంటే లీలాప్రియదర్శిని అన్నమాట" అన్నాడు రాజు నవ్వుతూ.

"ఆహా... సూటబుల్ నిక్‌నేమ్. గొప్పగా వుంది. ఎవరు పెట్టారు గురూ?" అడిగాడు దామోదరం.

"ఇలాంటి నిక్‌నేమ్స్ పెట్టడంలో ఎక్స్‌పెర్ట్ మన క్లాస్‌లో ఇంకెవరున్నారు? రాజే" అన్నాడు సారథి.

"గొప్ప పేరు పెట్టావు గురూ! నేనే గానీ యూనివర్సిటీ వైస్‌ఛాన్సలరైతే అర్జంటుగా నీకిచ్చేద్దును"

"ఏమిటి... టీసీనా?"

"కాదు ... గౌరవ డాక్టరేట్ డిగ్రీ"

"అదెందుకు నాకు? ఈమధ్య సినిమా యాక్టర్స్ మొదలుకొని పైరవీలవ్యాపారం చేసేవాళ్ళ దాకా యూనివర్సిటీలు వాటిని దానం చేస్తున్నాయి. సరే... కమ్ టు ది పాయింట్. అయితే ఆ రమేష్‌గాడు లీలాప్రియదర్శినిని..."





"గొప్పగా ప్రేమించేస్తున్నాడు. అది కూడా వీన్ని ఆ రేంజ్‌లోనే ప్రేమించేస్తోంది. అసలు దానికి..."

"దామోదరం! లీలా ప్రియదర్శిని ఎంతయినా మన సహవిద్యార్థిని. ఆ అమ్మాయిని 'అది ఇది, దానికి దీనికి' అని సంబోధించడం ఏమైనా మర్యాదగా వుంటుందా?" మందలించాడు సారథి.

"ఏం ఫర్వాలేదు. ఉమెన్స్ హాస్టల్లో కూర్చుని అమ్మాయిలు మన గురించి కూడా 'వాడు, వీడు' అనే మాట్లాడుకుంటూవుంటారు. ఆ సునీత లేదూ... చూడ్డానికి తారు డబ్బాలా నల్లగా వుంటుంది. ఆవిడేదో జగదేక సుందరైపోయినట్టు...మన శర్మ అందం గురించి హాస్టల్లో అసభ్యంగా కామెంట్ చేస్తూ వుంటుందట" రాజు అన్నాడు.

"అయ్యయ్యో! మనం మాటల్లోపడి మీటింగ్ విషయం మరిచిపోయాం. త్వరగా బయలుదేరండి గురూ! మనం తప్ప మన క్లాస్‌మేట్స్ అంతా వెళ్ళిపోయారు" దామోదరం అన్నాడు.

"వాళ్ళంతా సాహిత్యం మీద ఒక ఇంట్రెస్ట్ అంటూ వుండి మీటింగ్‌కి వెళ్లారనుకుంటున్నావా? అదేమీ కాదు... అలా వెళ్ళకుంటే ప్రొఫెసర్ బాక్ ఇం!ప్రెషన్ ఏర్పరచుకుంటాడేమోనని భయం వల్ల కొందరు... రకరకాల డిపార్ట్‌మెంట్స్ అమ్మాయిలొస్తారు కనుక 'కళాపోషణ' చేద్దామని కొందరు వెళ్తుంటారు" అన్నాడు రాజు.

"అయితే మనం ఎందుకు వెళుతున్నట్టు గురూ?"

"సుత్తి వేయించుకోడానికి" రాజు అన్నాడు.

"అమ్మో! మనం తట్టుకోగలమా?"

"ఏమో...వెళితేగదా ఆయన కెపాసిటీ తెలిసేది"

"పోనీ ఓ పనిచేస్తే?" అన్నాడు దామోదరం.

"ఒకటేమిటి వంద చేదాం....చెప్పు"

"మనమే రివర్స్ వేసేస్తే"

"ఆ ఛాన్సు వాళ్లు మనకు ఇవ్వాలి గదా"

"తప్పకుండా ఇస్తారు. వాళ్లు ఇవ్వకుంటే మనమే ఇప్పించుకుందాం" అన్నాడు సారథి బట్టలు తొడుక్కుంటూ.

"ఏమో బాబూ! రివర్స్ సుత్తి కోర్సులో మాలో నువ్వే డిప్లొమా హోల్డరువి. ఓవేళ వాళ్లు ఛాన్స్ ఇస్తే... ఆ ఛాన్స్‌ని సద్వినియోగపరుచుకోవాల్సిన వాడివి నువ్వే" నవ్వాడు రాజు.

"ఇవాళ అవకాశం వచ్చింది గదా అని శ్రీనాథ్ బహుశా తన ఉపన్యాసంలో పాత సంప్రదాయాలకు పట్టం కట్టొచ్చు. సరే..బయలుదేరండి. ఆయన గానీ ఆ పని చేస్తే నేను తగులుకుంటాను'' అంటూ వెళ్ళడానికి రెడీ అయ్యాడు సారథి.

''ఎందుకైనా మంచిది-ఆడిటోరియంలోకి నేను అమృతాంజనం బాటిల్ తెచ్చుకుంటాను. ఓవేళ బుర్ర వేడెక్కిపోతే అప్పుడు ఉపయోగపడుతుంది'' అన్నాడు దామోదరం.

"అవసరం లేదులేవోయ్! ఆడిటోరియం పక్కనే వాటర్ టబ్ వుంది. బుర్ర వేడెక్కితే అందులో ముంచేయవచ్చు''

వాళ్లు ముగ్గురూ ఓ అయిదు నిమిషాల్లో హాస్టల్ నుండి ఆడిటోరియం చేరుకున్నారు. సరిగ్గా అప్పుడే శ్రీనాథ్ తన ఉపన్యాసం ప్రారంభించాడు.

"నేడు రచనలు చేస్తున్న యువ

రచయితలకు ఏదో రాసెయ్యాలనే యావ తప్ప... అందుకు తగ్గ పరిజ్ఞానం లేదు. ఏ విషయానికీ సంబంధించిన ప్రత్యక్ష అనుభవం లేదు. అనుభవం లేకుండా చేసే రచనలు పేలవంగానూ, రసహీనం గానూ వుంటాయి'' అంటూ శ్రీనాథ్ యువ రచయితలను దుమ్మెత్తి పొయ్య సాగాడు.

"ఏ శాస్త్రజ్ఞుడూ కొత్త సిద్ధాంతాలను కనిపెట్టేశానని భుజాలెగరేసుకోనవసరం లేదు. ఇతరులంతా వాళ్ళకి బ్రహ్మరథం పట్టి భజనలు చెయ్యాల్సిన అవసరం అంత కన్నా లేదు. మనం జాగ్రత్తగా పరిశీలించి చూసినట్లయితే శాస్త్రజ్ఞులు చెబుతున్న చాలా సిద్ధాంతాలకు మన వేదాల్లో మూలం ఆధారాలు అగుపిస్తాయి"

శ్రీనాథ్ ఆ మాట అనేసరికి ఆడిటోరియంలో ఓ పక్కగా కూర్చున్న వాళ్ళంతా హర్షధ్వానాలు కురిపించారు.

"గురజాడ అప్పారావుగారు ఎనభై నాలుగేళ్ళ క్రితమే ఇలాంటి ఛాందసుల ముఖాలమీద ఉమ్మేసినా ఇంకా ఈ రకం మనుషులకు బుద్ధిరావడంలేదు" అన్నాడు సారథి మెల్లగా రాజు చెవిలో.

మరోపక్కన కట్టుగా కూర్చున్న విద్యార్థులు శ్రీనాథ్ అభిప్రాయాల్ని విని 'బుస్‌బుస్'అంటూ నోటితోగాలివూదిగోల చెయ్యసాగారు. ఆయూనివర్సిటీలో 'బుస్' అనేది ఒక పారిభాషికపదం. 'వట్టిగ్యాస్' అని దానర్థం. వాళ్ళంతా అలా 'బుస్' అని గోలచేశారంటే 'ఆ కోతలు ఆపు బాబూ' అని భావం.

"సమాజంమీద సాహిత్యంవేసేముద్ర అత్యల్పం. భార్యలకి స్వేచ్ఛ ఇవ్వకుండా బానిసల్లా చూసే భర్తలెందరో వున్నారు. అలాంటి వాళ్ళంతా చలం పుస్తకాల్ని చదివివుంటే వాళ్లలో ఒక్కడయినా తన స్వభావాన్ని మార్చుకొని వుంటాడని అనుకోవడం కేవలం భ్రమ. ఓవేళ అలాంటి భర్త ఎవరయినా వుంటే ఆ మార్పు అతడి వ్యక్తిగత టెంపర్‌మెంట్ కారణం గాని చలం పుస్తకాల్ని చదవడం కారణం గాదు" అంటూ శ్రీనాథ్ విజృంభించాడు.

కొందరు చప్పట్లుకొట్టేసరికి ఆయనలో ఉత్సాహం పెల్లుబికింది. హద్దూ పద్దూ లేకుండా మాట్లాడేస్తున్నాడు. మార్క్సిస్టు కవులమీద,రచయితలమీద బురదచల్లి తన రచనలకు డబ్బా వాయించుకున్నాడు.

"శ్రీనాథ్‌గారు ఇచ్చిన ఉపన్యాసంలో వారు వెలిబుచ్చిన అభిప్రాయాలకు సంబంధించి ఎవరయినా ప్రశ్నలుగానీ వెయ్యదలుచుకుంటే ఒక్కొక్కరేలేచి అడగవచ్చు" అంటూ ప్రొఫెసర్ లేచి చెప్పి మళ్ళీ తన సీట్లో కూర్చున్నాడు.

ఆ అవకాశంకోసమే ఎదురుచూస్తున్న సారథి చటుక్కునలేచి నిలబడ్డాడు. కొందరు లెక్చరర్లు సారథి వేపు చికాకుగా చూశారు. 'ఏమిటి నువ్వడగదలుచుకున్నది?' అన్నట్టుగా చూశాడు శ్రీనాథ్.

"సార్! ఇందాక మీరు యువరచయితలకు ఏ విషయంపట్లా ప్రత్యక్ష అనుభవం లేదన్నారు. అనుభవం లేకుండా చేసే రచనలు పేలవంగా వుంటాయన్నారు. అంటే మీ అభిప్రాయం– రచయిత ఏ విషయాన్ని రాస్తాడో దానికి సంబంధించి ఆ రచయితకు తగు అనుభవం తప్పక వుండాలంటారు... అంతేనా?" అడిగాడు సారథి.

"ఖచ్చితంగా"

"అయితే ఒక రచయిత స్త్రీ ప్రసవ వేదనగూర్చి ఓ కథ రాయాలని అనుకుంటే....ఆ ప్రసవవేదనను ఆ రచయిత




అనుభవపూర్వకంగా ఎలా తెలుసుకో గలడు? సృష్టిలో అది సాధ్యమా? అంతే గాక ఓ పాతికేళ్ళ రచయిత ఎనభైఏళ్ళ వృద్ధుడి జీవితంగూర్చి రాయాలని అనుకుంటే ఆ రచయిత వృద్ధుడయ్యేవరకు దాని గూర్చి రాయడం ఆపేయాలా?"

సారథి అలా రెండు ప్రశ్నలు అడిగే సరికి ఆడిటోరియంలోవున్న కొందరు విద్యార్థులు పెద్దగా చప్పట్లు కొట్టేశారు.

"మరో విషయం సార్! ఏ శాస్త్రజ్ఞుడయినా సరే ఒక సిద్ధాంతాన్ని కనుక్కున్న తర్వాతే ఇది వేదాల్లోవుంది అంటున్నారుగానీ అతడా సిద్ధాంతాన్ని కనిపెట్టకముందు అది వేదంలో వున్నట్టు చెప్పడం లేదు. రేపొక శాస్త్రజ్ఞుడు ఒక కొత్త సిద్ధాంతాన్ని కనిపెడితే అదీ వేదాల్లో వుంది అంటారు మీలాంటివారు. కనుక వేదాల్లో ఇంకా ఏమేమి వుందో ముందే తెలుసుకుని చెప్పేస్తే బాగుంటుంది గదా?"

శ్రీనాథ్‌కు గొంతులో వెలక్కాయ పడ్డట్టయింది.

"ఇకపోతే భార్యల్ని బానిసల్లా ట్రీట్ చేసే భర్తలు పుస్తకాలు చదువుకుని అందులో ఏ ఒక్కడయినా తన స్వభావం మార్చుకుని వుంటే అందుకు కారణం అతడి వ్యక్తిగత టెంపర్‌మెంటేగానీ పుస్తకాల్ని చదవడంవల్ల కాదని అన్నారు. ఆలెక్కన మీరు చెప్పిన మాట రామాయణ భారతాది పురాణాలకు కూడా వర్తించి తీరాలి. అంటే రామాయణ భారతాది పురాణాల్లోని పాత్రల ప్రభావం, అందులోని ధర్మం, న్యాయం మొదలయినవాటి ముద్రలు జనహృదయం పైపడలేదంటారు. ఒప్పుకుంటారా?"

నీళ్ళు నమిలాడు శ్రీనాథ్.

"సమాజం భ్రష్టుపట్టిపోకుండా వుంచాలని పాపపుణ్య భీతితో ప్రజలంతా ధార్మికులై ధర్మమార్గంలో నడవాలనే ధ్యేయంతో, ధర్మప్రబోధాలతో నింపి రచింపబడినవి రామాయణ, భారతాది గ్రంథాలు. సాహిత్యంయొక్క ప్రభావం సమాజంమీద అత్యంత స్వల్పమని మీరన్నదే నిజమైతే..ప్రాచీనకాలంనుంచి ఇప్పటివరకు సృష్టించబడిన ప్రపంచ సాహిత్యమంతా నిరుపయోగమేనని అనుకోవాలి"

సారథి అలా మాట్లాడుతుంటే..ఏం చెప్పాలో తెలియక స్టేజిమీద డైలాగ్స్ మరిచిపోయి ప్రాంప్టింగ్ అందక అవస్థ పడే నటుడిలా ముఖం పెట్టాడు శ్రీనాథ్.

"ఎవడ్రా వీడు? లింగులింగుమంటూ లేచి పనికిమాలిన ప్రశ్నలు అడుగుతున్నాడు. సంతోషించాంగానీ ఇక కూర్చోవోయ్" అంటూ అవతలి పక్కన వున్న విద్యార్థుల గుంపులోంచి ఒకతను లేచి సారథిమీద కేకలేశాడు.

"ఎందుకు కూర్చోవాలిరా బోడిలింగా? అతడేమీ పనికిమాలిన ప్రశ్నలడగడం లేదు గానీ నువ్వే నోరు మూసుకుని కూర్చో" అన్నాడు ఇవతలి గుంపులోంచి మరొకడు.

"ఏమిట్రా నోరుమూసుకోమంటావు.. ఇడియట్"

"ఎవడురా ఇడియట్ .... నువ్వే ఇడియట్‌వి"

"ఆ మాట ఇంకోసారంటే తంతాను"

"తన్ను చూద్దాం...మీ బాబుకు పుట్టి వుంటే..తన్నుమరి"

"తంతాన్రా... ఏంచేస్తావు?"

ఆడిటోరియం అంతా గోలగోలగా తయారైంది. రెండు విభిన్న విద్యార్థి







సంఘాల సభ్యులమధ్య పెద్ద వివాదం తలెత్తింది. వాళ్లు పరస్పరం తన్నుకుంటారని ఊహించి అమ్మాయిలంతా ఆడిటోరియంలోంచి గబగబా బయటకు వెళ్ళిపోయారు.

"సైలెన్స్ ప్లీజ్!" అంటూ వేదికపైనున్న ప్రొఫెసర్ అరిచాడు. కానీ లాభం లేకపోయింది. పరిస్థితి అదుపు తప్పుతోందని భావించిన ప్రొఫెసర్ శ్రీనాథ్‌ను వెంట పెట్టుకుని వెళ్ళిపోయాడు. చివరకు ప్రేక్షకులంతా చెల్లాచెదురైపోయారు. సారథి అడిగిన ప్రశ్నలు అలాగే మిగిలాయి.

మరుసటి రోజు ఉదయం పది గంటలకు భాషాశాస్త్రానికి సంబంధించిన బుక్‌ను తీసుకువద్దామని హాస్టల్లోంచి డిపార్ట్‌మెంట్‌కు బయలుదేరాడు సారథి. తెలుగు డిపార్ట్‌మెంట్‌లో సారథి బాగా ఇష్టపడే ఒక లెక్చరర్ ఉన్నాడు. ఆ నరసయ్యగారికి కూడా సారథి అంటే అభిమానమే.

భాషాశాస్త్రాన్ని బోధించడంలో ఆయన ఆ డిపార్ట్‌మెంట్‌లోనే ఎక్స్‌పర్ట్. పైగా కొంత ప్రగతిశీల దృక్పథంగలవాడు. సమకాలీన సామాజిక వ్యవస్థపట్ల ఆయనకు చాలా అసంతృప్తి వున్నట్లు సారథి గ్రహించాడు. స్టూడెంట్స్‌తో ఏ అరమరికలూ లేకుండా మామూలుగా వుంటాడాయన. అందుకే ఆయనంటే సారథికి ఇష్టం.

"ఏమిటి సారథీ! ఇలా వచ్చావు. రా..కూర్చో" తనగదిలోకి వచ్చిన సారథికి కుర్చీ చూపెట్టాడు నరసయ్య.

"ఓ పుస్తకం కావాలి సార్" కుర్చీలో కూర్చుంటూ తను వచ్చిన పనిగురించి చెప్పాడు సారథి.

"అన్నట్టు కంగ్రాచ్యులేషన్స్ సారథీ!

నిన్న నువ్వు ఆడిటోరియంలో ఆ శ్రీనాథ్‌ని బాగా అడిగావు. అదృష్టంకొద్దీ అక్కడ స్టూడెంట్స్ ఘర్షణపడటంతో తప్పించుకున్నాడుగానీ లేకుంటే నీ ప్రశ్నలకు సమాధానం చెప్పలేక నవ్వులపాలయ్యేవాడే"

"భలే ఛాందసుడిలా వున్నాడు సార్! ఆయనగారి నవలలు చదివినప్పుడే అలా అన్పించిందిలెండి. ఆయన ధోరణి చూస్తుంటే..మార్క్సిజం కూడా వేదాల్లోనే వుంది అని వాదించేటట్లున్నాడు"

నరసయ్యగారితో ఓ అరగంట మాట్లాడి తనకు కావలసిన పుస్తకం తీసుకుని గది లోంచి బయటకొచ్చాడు సారథి. హాస్టల్‌కు వెళ్ళి చదువుకుందామనుకుంటూ వరండాలో నడుస్తున్న సారథిని "సార్" అంటూ పిలిచి, "మిమ్మల్ని ప్రొఫెసర్ గారు రమ్మంటున్నారు" అంటూ ప్రొఫెసర్ వుండే గదివేపు చూపెట్టాడు ఆ డిపార్ట్‌మెంట్ అటెండర్.

"గుడ్ మార్నింగ్ సార్" ప్రొఫెసర్ గదిలోపలికి ప్రవేశించగానే విష్ చేశాడు సారథి. ప్రతి నమస్కారంగా కనీసం ఆయన తల కూడా ఊపలేదు. సారథి మనసు చివుక్కుమంది. 'కూర్చో' అంటాడేమోనని ఎదురుచూశాడు సారథి. కానీ గంభీరంగా ముఖం పెట్టివున్న ఆయన ఆ మాట అనలేదు. అందుకే నిలబడ్డాడు సారథి.

"నీ పేరు సారథిగదూ"

అవునన్నట్టు తలాడించాడు సారథి.

"ఎం.ఏలో చేరిన కొత్తలో నువ్వు తెలివైనవాడివి అనుకున్నాను" సిగరెట్ అందుకుంటూ అన్నాడు ప్రొఫెసర్.

'ఇప్పుడు తెలివితక్కువవాడినని మీరు అనుకుంటున్నారా?' అని అడగాలన్పించింది సారథికి.

"నిన్న ఆడిటోరియంలో శ్రీనాథ్ గారిని ఏవో పిచ్చి పిచ్చి ప్రశ్నలడిగావు"

'ఓహో ... విషయం ఇదన్నమాట. ఇప్పుడు తనను ప్రొఫెసర్ మందలించబోతున్నాడన్నమాట' అనుకున్నాడు సారథి.

"ఇంతకీ నువ్వు ఏ స్టూడెంటు ఆర్గనైజేషన్‌కి సంబంధించినవాడివి?"

"అలాంటిదేమీ లేదు సార్ ... నేను ఏ స్టూడెంట్ యూనియన్‌లోనూ మెంబర్ని కాను"

"ఎందుకని? నువ్వు ఏదో ఒక యూనియన్‌లో చేరలేకపోయావా?" వ్యంగ్యంగా అన్నాడు ప్రొఫెసర్.

"ఏ యూనియన్‌లోనైనా చేరాలంటే అందుకు చాలా నిజాయితీ వుండాలి. నాకంత నిజాయితీ లేదని నా నమ్మకం"

"అంటే యూనియన్స్‌వున్న విద్యార్థులకంతా ఒక నిజాయితీ ఏడ్చిందని నువ్వనుకుంటున్నావా?"

"అనుకోవడంలేదు సార్. కానీ కొందరుండవచ్చు"

"ఓకే! శ్రీనాథ్‌గారు మంచి మేధావులు. ఆయన్ను మనం గెస్ట్‌గా పిలిపించాం. కానీ అవమానం చేసి పంపించాం. సమావేశం మధ్యలోనే అల్లరి జరిగింది. ఆ అల్లరికి కారణం నువ్వు. ఏవో పిచ్చి పిచ్చి ప్రశ్నలు అడగబట్టే విద్యార్థుల్లో ఆ ఘర్షణ పుట్టింది" అంటూ సిగరెట్ వెలిగించుకున్నాడు ప్రొఫెసర్.

"శ్రీనాథ్‌గారి ఉపన్యాసం తరువాత వారిని ప్రశ్నలడిగే అవకాశాన్ని మీరే కల్పించారు. వారు వెలిబుచ్చిన అభిప్రాయాలతో నేను ఏకీభవించలే

 

పోయాను. అందుకే వారిని కొన్ని ప్రశ్నలు అడగవలసి వచ్చింది. నేను అడిగినవి పిచ్చి పిచ్చి ప్రశ్నలు కావు సార్"

"అంటే తెలివైనవాడు అడగదగిన ప్రశ్నలే నువ్వు అడిగానంటావు... అంతేనా? మేధావుల్ని పట్టుకుని దులిపేస్తే తెలివైనవాడని అందరూ అనుకుంటారని కొందరి భ్రమ. సారథీ..జీవితంలో నువ్వు పైకి రావలసినవాడివి. మేధావుల్ని అలా ఇష్టమొచ్చినట్టు ప్రశ్నించకూడదు"

"అంటే మీ అభిప్రాయం-ఇంతవరకు జీవితంలో పైకివచ్చిన ప్రతివాడూ మేధావుల్ని ప్రశ్నించనివాడేననా? ఒకరి చేత ప్రశ్నింపబడని మేధావిని మేధావి అని ఎలా గుర్తించడం? ప్రశ్నించరాదని అనుకున్నప్పుడు మీరా అవకాశాన్ని కల్పించకుండా వుంటే బాగుండేది.''

తనముందు నిలబడి తొణుకూ బెణుకూ లేకుండా ధైర్యంగా తనతో అలా మాట్లాడిన స్టూడెంట్‌ను తన సర్వీస్‌లో ప్రప్రథమంగా చూస్తున్నాడు. ప్రొఫెసర్. తనపట్ల విద్యార్థిగా అతనికి భయం లేకపోవడాన్ని ఆ ప్రొఫెసర్ ఏమాత్రం భరించలేకపోయాడు.

"మిస్టర్ సారథీ! ఇది డిగ్రీకాలేజి కాదు మీ ఇష్టమొచ్చినట్లు తోకలు తిప్పడానికి. ఇది యూనివర్సిటీ. మీరు తోకలు తిప్పితే అవి ఇక్కడ కత్తిరించెయ్యబడుతాయి. ఇక్కడ స్టూడెంట్స్ జీవితాలు మా చేతుల్లో వున్నాయని గుర్తుంచుకో" ప్రొఫెసర్ కంఠంలో కరకుతనం ధ్వనించింది.

"స్టూడెంట్స్ జీవితాలు మార్కుల రూపంలో మీలాంటివారి దగ్గరున్నాయని నాకు తెలుసు సార్! అందుకే గురు శిష్యుల మధ్య ఉండవలసిన పవిత్రమైన సంబంధం యూనివర్సిటీల స్థాయిలో యజమాని బానిసలమధ్య వుండే సంబంధంలా తయారైంది" ధైర్యంగా అనేశాడు సారథి.

"వాట్ నాన్సెన్స్ యు ఆర్ టాకింగ్? జీవితంలో నీకు బాగుపడాలనే ఆలోచన లేనట్టుంది...బి కేర్‌ఫుల్"

"ఇది హెచ్చరించడమా లేక భయపెట్టడమా సార్"

"ఓహో...అంతదూరం వచ్చావా? విప్లవం బాగా ఒంటపట్టినట్టుందే. ఇది హెచ్చరించడమా లేక భయపెట్టడమా అని కదూ అడిగావు. ప్రస్తుతానికి ఈ రెండింటి మధ్య నా దృష్టిలో బేధంలేదు" అన్నాడు ప్రొఫెసర్ కోపంగా.

"సార్! మీరేమీ అనుకోకపోతే ఒక్క మాట. మీలాంటి ప్రొఫెసర్ల చేతిలో అధికారముంది. 'కన్యాశుల్కం' నవలో లేక అది నాటకమో తెలియనివాడికి... 'రంగాజమ్మ' అంటే అదో యక్షగానం పేరు అని రాసేవాడికి అనుకుంటే మీరు ఫస్ట్‌క్లాస్ ఇవ్వగలరు. పనికిమాలినదద్దమ్మలకు ఫస్ట్‌క్లాసులిచ్చుకోండి...అభ్యంతరం లేదు. కానీ వ్యక్తిగతమైన కారణాలతో ఏ మెరిట్ స్టూడెంటుకూ అన్యాయం చెయ్యకండి''

"స్టుపిడ్ అండ్ గెటవుట్. నా పాతికేళ్ళ సర్వీసులో తలపొగరు గల నీలాంటివాళ్ళను చాలామందిని చూశాను. కొంపల్లో వుంటే తిండికి గతిలేక చస్తారని ఇక్కడైతే వెల్‌ఫేర్ స్కాలర్‌షిప్స్ వచ్చి రెండేళ్ళయినా తిండి తిని బతికేస్తారని దయతలచి మీలాంటివాళ్ళకి యూనివర్సిటీలో సీట్లు ఇస్తున్నాం. ఆ తిండితో కండకావరం పట్టుతోంది.

నీకన్నా వయస్సులో ముప్పయ్యేళ్లు పెద్ద వాడిని. నీలాంటి కుర్రకుంకలా నాకు నీతి ప్రభోదం చేసేది?" అంటూ రెచ్చి పోయాడు ప్రొఫెసర్.

"సార్! నాకు దయతలచి మీరు ఎం.ఏలో సీట్ ఇవ్వలేదు. అది మీరు ఇచ్చిన సీట్ కాదు. మెరిట్ వుండటం వల్ల అది నాకు వచ్చిన సీటు. అంతేకాదు- తిండికి వాచిపోయి నేనీ ఊబిలోకి రాలేదు .... గుర్తుంచుకోండి" అంటూ వేగంగా ఆ గదిలోంచి బయటకు వచ్చేశాడు సారథి.

# 11



హాస్టల్ వేపు నడుస్తున్నాడు సారథి. అతడి మనసు కలతబారిపోయింది. 'కొంపల్లో వుంటే తిండికి గతిలేక చస్తారని ఇక్కడైతే వెల్‌ఫేర్ స్కాలర్ షిప్స్ వచ్చి... రెండేళ్ళయినా తిండితిని బతికేస్తారని దయతలచి మీలాంటివాళ్ళకు యూనివర్సిటీలో సీట్లు ఇస్తున్నాం' అని ప్రొఫెసర్ అన్న ఆ మాట సారథి హృదిని సూదిలా పొడుస్తోంది.

యూనివర్సిటీలో చదువుకునే స్టూడెంట్స్‌మీద ఎంత చులకన అభిప్రాయం వుంది వీళ్ళకు. ఛీ... అనవసరంగా ప్రొఫెసర్‌తో సంభాషణ పెంచి తను మనసు పాడుచేసుకున్నాడు.

ఇదొక మానసిక క్షోభ. నరకయాతన. ఇంత దుర్భరమైన జీవితాన్ని గడుపుతూ యూనివర్సిటీలో తను వుండకపోతేనేం?

అలా ఆలోచిస్తూ హాస్టల్లోకి ప్రవేశించి వరండాలో నడుస్తున్న సారథికి ఓ రూం లోంచి తన గురించిన మాటలు విన్పిం చాయి.

"అయితే బాసూ! ఆ సారథిగాడికి ఫస్టియర్‌లో లింగ్విస్టిక్స్ సబ్జెక్టులో నూటికి ఎనభై మార్కులు వస్తాయంటావు"

"రాక చస్తాయా? ఆ నరసయ్యని సారథిగాడు బాగా కాకాపట్టేశాడు. కనుక ఆయన వీడిమీద కృప చూపకమానడు.

"ఈమధ్య ఆయనతో సారథి చాలా క్లోజ్‌గా వుంటున్నాడు. అయితే అసలు విషయం ఇదన్నమాట"

"ఇంకేమిటనుకున్నావు? పుస్తకాల కోసమని వీడు నరసయ్య ఇంటికి కూడా పోతున్నాడు"

"బాగా పరిశీలించి చూస్తే.. మార్కులు తెచ్చుకునేందుకు యూనివర్సిటీలో మూడే మార్గాలున్నాయి బాసూ"

"ఏమిటవి?"

"కులం, కృప, కృషి"

"అయితే కృషికి లాస్ట్ ప్లేస్ నన్న మాట"

"అంతేగా మరి. లెక్చరర్ల కులంగానీ, వాళ్ళ కృపకానీ లేనివాడికి ఇక మూడో మార్గమే శరణ్యం"

"అన్నట్లు బాసూ! ఈమధ్య మన క్లాస్‌మేట్స్ సారథి అండ్ సుగుణ ఎక్కడబడితే అక్కడ..."

"ఎక్కడబడితే అక్కడ కొంపదీసి"

"నీ అనుమానం పాడుగానూ. ఇంకా బెడ్‌రూం సీన్స్‌దాకా రాలేదులే. డ్యూయెట్స్ పాడుకునే స్టేజిలోనే వున్నారుట"

"అంటే పిక్చర్ ఇంకా ఇంటర్‌వెల్‌కు ముందే రన్ అవుతోందన్నమాట...ఎవరు చెప్పారిదంతా"

"మన క్లాస్‌మేట్ సునీత"

"అదో గొప్ప పతివ్రతైపోయినట్టు"

"ఏమిటి బాసూ! అక్కడా హిస్టరీ వున్నట్టుందే?"

"బోలెడంత వుంది. ఆ కామర్స్ డిపార్ట్‌మెంట్‌లో రాజేంద్ర అని ఫైనలియర్ వాడొకడు వున్నాడులే"

"ఆరాజేంద్ర ప్లస్ తారుడబ్బా అనబడే ఈ సునీతా కలసి పిక్చర్‌లో బెడ్‌సీన్స్ కూడా అయిపోయాయి. లాస్ట్‌రీల్ రన్నవుతోంది"

"అంటే కడుపు రావడం...."

అంతలో పకపకలు.

వాళ్ళ సంభాషణ ఇక వినలేక ఆ గది వేపు ఈసడింపుగా ఓ సారిచూసి అక్కడి నుండి కదిలాడు సారథి. తన కులానికి సంబంధించిన లెక్చరర్‌తో ఏ స్టూడెంట్ అయినా కొంత సన్నిహితంగావుంటే ఆ స్టూడెంట్‌కు కులపిచ్చి అని ప్రచారం చేస్తారు కొందరు.

పోనీ తన కులానికి సంబంధించని లెక్చరర్‌తో సన్నిహితంగా వుంటే వూరుకుంటారా అంటే అదీలేదు. వాడు కాకాలు పడుతున్నాడని ప్రచారం చేస్తారు. స్టూడెంట్సే కాదు...కొందరు లెక్చరర్లూ అంతే! తనతో మాట్లాడే ప్రతి స్టూడెంటూ మార్కులకోసం కాకాలు వెయ్యడానికే మాట్లాడుతున్నాడని అనుకుంటూ వుంటారు.

సుగుణతో తను కాస్త సన్నిహితంగా వుండటం వాస్తవమేకానీ..సునీత ప్రచారం చేసినంతగా తమ నడుమ ప్రణయ సంబంధం ఏమీలేదు. అలాగని తమ మధ్య సోదర సోదరీబంధం వుందని చెప్పడానికీ వీల్లేదు. తామిద్దర్లూ క్లాస్‌మేట్స్. మంచి స్నేహితులు. అంతే.. అంతకుమించి మరేమీలేదు.

సారథి రూంలోకి అడుగుపెట్టగానే-రాజు ఓ ఇన్‌లాండ్‌లెటర్ అతడి చేతికి అందించాడు.ఉత్తరాన్ని ఛించాడు సారథి.

'డియర్ ఫ్రెండ్ సారథీ! ఈ ఉత్తరం అందిన వెంటనే రాజుతో కలిసి మా హాస్టల్‌కు రండి. సునీత మనిద్దరి గురించి చాలా చెడుప్రచారం చేస్తోంది. ఆ విషయం గూర్చి మాట్లాడుదాం ... సుగుణ'

"ఎక్కడినుండి సారథీ?" అడిగాడు రాజు.

"సుగుణనుండి. వెంటనే బయల్దేరు... మనం ఉమెన్స్ హాస్టల్‌కు వెళ్ళాలి" అంటూ తమ గురించి సునీత పుట్టించే పుకార్ల విషయం రాజుతో చెప్పాడు సారథి.

"ఆ తారు డబ్బాకు మరో పనేమీ లేనట్లుందే!ఓ అబ్బాయీ అమ్మాయీ కాస్త సన్నిహితంగా వుంటేచాలు..సునీతలాంటి వాళ్లు ఓ సినిమాకు సరిపోగల స్టోరీని అల్లేసి ప్రచారంచేసేస్తారు. ఆ సునీతనీ, ఆ నిర్మలనీ చూస్తే నాకు భలే మంట సారథీ" అన్నాడు రాజు.

"ఎందుకని?"

"అబ్బాయిలకంటే..తమ కులాన్ని సూచించేపదం వాళ్ళ పేరు చివరన వుంటుంది. ఇది మామూలు విషయమే. కానీ అమ్మాయిలకు ఏం పోయేకాలం వచ్చిందో? నిర్మలారెడ్డి, సునీతానాయుడు అని పేరు చివరన ఆ కులాన్ని సూచించే తోకనుకూడా తగిలించుకుంటున్నారు. కొన్నాళ్లుపోతే..ఈ పిచ్చి ముదిరి ఇంట్లోని కుక్కపిల్లలక్కూడా టామీరెడ్డి, జానీ

నాయుడు,అంటూ తోకలు తగిలిస్తారేమో" అన్నాడు రాజు.

పావుగంటలో సారథి, రాజు హాస్టల్ లోంచి బయటపడి ఉమెన్స్‌హాస్టల్ చేరుకున్నారు. ఆ ఉమెన్స్‌హాస్టల్ గేటుకు లోపల ఉత్తరంవేపునగల విజిటర్స్ వెయిటింగ్‌రూంలో కూర్చున్నారిద్దరూ. సుగుణ రూం నంబర్‌చెప్పి ఆ అమ్మాయిని పిలవమని ముందే వాచ్‌మన్‌తో చెప్పారువాళ్లు.

"నాగరికత వెర్రితలలు వేస్తోంది. యూనివర్సిటీలో చదువుకుంటున్న అమ్మాయిల్లో కొందరికి ఎవడినో ఒకడిని ప్రేమించడం అనేది మినిమమ్ క్వాలిఫికేషన్ అయిపోయింది. బాయ్‌ఫ్రెండ్స్ వుండటం ఒక డిప్లొమా అయినట్లు... బాయ్‌ఫ్రెండ్స్‌గల అమ్మాయిలు బాయ్‌ఫ్రెండ్స్‌లేని అమ్మాయిల్ని అసమర్థుల్లా చూస్తున్నారు"అన్నాడు సారథి.

ఇంతలో సుగుణ వచ్చింది.

"లెటర్ అందలేదేమో అనుకున్నాను"

"నీ లెటర్ని ఇప్పుడే చూశాను పావుగంటక్రితం"

"సరే...సునీతనికూడా పిలుచుకురా. బ్రెయిన్ వాష్‌చేసి పంపిద్దాం" అన్నాడు రాజు.

"సుగుణా! ఆ సునీత మనిద్దరిమీద అల్లినకథ మా హాస్టల్‌క్కూడా పాకింది" అన్నాడు సారథి.

"ఈ పుకార్లకు భయపడుతున్నావా సారథీ?" అంటూ సారథివేపు చూస్తూ అడిగింది సుగుణ.

"అవును సుగుణా...నేను భయపడుతున్నాను. అయితే నా గురించి కాదు- నేను తెగిన గాలిపటంలాంటివాడిని. నా భయమంతా నీగురించే. ఈ లోకంలో మనుషుల్ని మించిన ప్రమాదకరమైన జంతువుల్లేవు" అన్నాడు సారథి.

"సారథీ...నేను చాలా మొండిదాన్ని, చాలా ధైర్యంగలదాన్ని! ఇలాంటి పుకార్లకు జడిసేదాన్నికాదు. నీ భయం నా గురించే అయితే...నువ్వు నిర్భయంగా వుండొచ్చు. నేను వెళ్ళి ఇప్పుడే సునీతని పిలుచుకొస్తాను"అంటూ వెళ్ళింది సుగుణ.

"సారథీ! ఆ తాచు దబ్బాను అంత సులభంగా వదిలిపెట్టకు. మళ్ళీ జన్మలో అది ఇలాంటి పుకార్లు ఎవరిమీదా లేపదియ్యకూడదు" అన్నాడు రాజు. అయిదు నిమిషాల్లో హాస్టల్లోంచి సుగుణా, సునీతా వచ్చి వెయిటింగ్‌రూంలో సారథికెదురుగా కూర్చున్నారు.

"ఏమండీ సునీతగారూ! నా గురించి, సుగుణ గురించి మీరు హాస్టల్లో ఏవేవో చెప్తున్నారట"

."అని ఎవరు చెప్పారు మీకు?"

"ఎవరైతే ఏంలెండి. నేనడిగేది మీరు అలాంటి ప్రచారాలు మామీద చేశారాలేదా అని"

"అలాంటి పాడు ప్రచారాలు నేనెందుకు చేస్తానండీ? నాకేమైనా కండకావరమా?" అంది సునీత బుద్ధిమంతురాలిలా.

"మీరు కండకావరంచేత చేశారో లేక ఇంకో దానివల్ల చేశారో అది మాకెలా తెలుస్తుంది?'' అన్నాడు రాజు.

"రాజుగారూ! మైండ్ యువర్ బిజినెస్"

"నా బిజినెస్ ఇలా అడగడమే. ఇంగ్లీషు నేనూ మాట్లాడగలను. మనిషిగా పుట్టగానేసరా... సభ్యత కూడా వుండాలి"

"రాజూ! నువ్వూరుకో. నేను మాట్లాడుతున్నాగా. సునీతగారూ! మేము ఎప్పుడైనా మీ ప్రసక్తి ఎత్తామా?అలాంటప్పుడు మా గురించి మీరెందుకలా ప్రచారం చెయ్యాలి?"

"నోటి తీటతీరాలని" అన్నాడు రాజు.

"సారథీ! మీ గురించి నేను ఎక్కడగానీ ఏవిధంగాగానీ ప్రచారం చెయ్యలేదు ఆ నోటి తీట ఇంకెవరికైనా ఉందో లేదో తెలియదు కానీ నాకు మాత్రం లేదు" అంది సునీత.

"సునీతగారూ! మీరు మా గురించి అలా ప్రచారం చెయ్యనప్పుడు...క్లాసులో అంతమంది అమ్మాయిలువుండగా మీపేరు మాత్రమే ఎందుకు బయటికొస్తుంది? నాకు తెలుసు...ఈ పుకార్లు మీరే పుట్టించారు. మన క్లాస్ అబ్బాయిలక్కూడా మీ పేరు" సారథి అన్నాడు.

"మీరలా అనుకుంటే నేనేమీ చెయ్యలేను"

"కానీ నేను చెయ్యగలను"

"ఏమిటి?"

"మీమీదా, మిమ్మల్ని వెంట తిప్పుకునే ఆ రాజేంద్రమీదా ప్రచారం" అన్నాడు సారథి.

"చేసుకోండి... నాకేం భయంలేదు"

"అంత ధైర్యస్తులా మీరు? అంత గుండెధైర్యంగలవారైతే అవాళ రాత్రి రాజేంద్రతో లాడ్జిరూంలో పోలీసులకు పట్టుబడిపోయినప్పుడు...మీ చేతి బంగారు గాజును పోలీసులకు లంచంగా ఇచ్చి వదిలిపెట్టమని భయంతో గడగడలాడి పోయారెందుకని? మీ గుండె ధైర్యం అప్పుడేమైంది?"

సారథి అలా ముఖాన అడిగెయ్యగానే సునీత అవాక్కైపోయింది. ఈ విషయం సారథికెలా తెలిసిపోయిందా అని ఆవిడ అనుమానం. ఇన్నాళ్ళూ ఈ విషయాన్ని తమకి చెప్పకుండా దాచినందుకు సారథిపై సుగుణకు, రాజుకు కోపం వచ్చింది.

"వ్యభిచార గృహాల్లో పట్టుబడిన మీరు...మా గూర్చి లేనిపోని కథల్ని ప్రచారం చేస్తారా? మీమీద నేను ప్రచారంగానీ చెయ్యాలనుకుంటే...మీలా కథలు అల్లాల్సిన పనిలేదు – వాస్తవం గురించి చెబితే చాలు. సరే... జరిగిందేదో జరిగింది. ఇకనుంచైనా మీ నాలుకను కంట్రోల్లో పెట్టుకోండి. లేదా గుట్టు రట్టయి రచ్చనబడటానికైనా సిద్ధంగా వుండండి. ఓకే...యుకెన్ గో" సారథి అలా అనడంతో సునీత అవమానంతో తల వంచుకుని హాస్టల్లోకి వెళ్ళిపోయింది.

"సారథీ! ఇన్నాళ్లూ ఈ విషయం మాకు చెప్పకుండా దాచావేం? అసలా కథేమిటో చెప్పు" అడిగాడు రాజు.

ఆరోజు సబ్ఇన్‌స్పెక్టర్ తనకు చెప్పిన కథనే చెప్పాడు సారథి. అంతే గాక ఓరోజు బజార్లో వెళుతున్న రాజేంద్రనూ,సునీతనూ చూపెట్టిఆ జంటే లాడ్జిలో పట్టుబడిన మూడు జంటల్లో ఒక జంటని, వదిలిపెట్టెయ్యమని అడుక్కుంటూ చేతికున్న బంగారుగాజును లంచంగా ఇవ్వడానికిసిద్ధపడిన అమ్మాయి ఈవిడేనని ఆయన తనతో చెప్పిన మాటలను కూడా చెప్పాడు సారథి. ఈ విషయాన్ని బయటపెట్టకండని హెచ్చరించాడు.

ఆ మరుసటి రోజు సాయంత్రం....

ఇరానీ హోటల్లో టీ తాగి రోడ్డుమీది కొచ్చి నిలబడ్డాడు సారథి. ఎవరో తెలిసిన వాళ్ళుంటే వాళ్ళింటికెళ్ళాడు రాజు. ఒంటరిగా నిలబడిన సారథికి 'ఏయ్... సారథీ' అనే పిలుపు వినిపించడంతో చటుక్కున తలతిప్పి చూశాడు.

వాళ్లు ముగ్గురు సారథి దగ్గరకు వేగంగా వచ్చి నిలబడ్డారు. అందులో ఒకడు రాజేంద్ర, మిగిలిన ఇద్దరూ అతని



చేసిందనీ, అందుకుగానూ సమ్మెలైనాచేసి ఎన్నికల్ని జరిపించుకోవాలనీ రాజేంద్ర ఉపన్యాసం ఇవ్వడం జరిగింది.

కానీ సారథి వెంటనే పైకిలేచి కుల ప్రాతిపదికపై జరిగే ఎన్నికలు అనవసరం అంటూ సహేతుకంగా మాట్లాడటం, అందుకు విద్యార్థులంతా హర్షించి ఎన్నికలపట్ల విముఖత చూపడం, ఫలితంగా రాజేంద్రకు యూనివర్సిటీ ఛైర్మన్ పదవి చేతికి అందకుండా జారిపోవడం జరిగింది.

సారథి మాటలవల్లే విద్యార్థులంతా ఎన్నికలపట్ల విముఖత చూపారనీ... సారథి వల్లే తన ఛైర్మన్ పదవి పోయిందనీ రాజేంద్రకి మంట. మంచి అవకాశం వస్తే సారథిని తన్నాలని రాజేంద్ర కోరిక.

ఆ అవకాశం ఇప్పుడతనికి రానే వచ్చింది.

"ఒరేయ్! నువ్వూ, నీ ఫ్రెండు ఆ రాజుగాడూ నిన్న మధ్యాహ్నం ఉమెన్స్ హాస్టల్‌కెళ్ళి మా సునీతని ఏదో బెదిరించారట... మీరు పెద్ద దాదాలా?" రాజేంద్ర అడిగాడు.

అతడు 'ఒరేయ్' అని సంబోధించడంతో సారథికి కోపం వచ్చింది. "మర్యాదగా మాట్లాడండి మిస్టర్" అన్నాడు సారథి.

"నీతో ఏమిట్రా మర్యాదగా మాట్లాడటం? అలా మాట్లాడకుంటే ఏంచేస్తావురా?" అన్నాడు రాజేంద్ర.

ఫ్రెండ్సు.

సారథి కంటబడితేచాలు గుండె కుతకుతలాడిపోతూ వుంటుంది రాజేంద్రకి. అందుకు కారణం లేకపోలేదు. ఓ రాత్రి యూనివర్సిటీ లైబ్రరీముందు విద్యార్థులంతా సమావేశమై ఉన్నప్పుడు యూనివర్సిటీ పాలకవర్గం ఎన్నికల్ని రద్దు

"ఏమీలేదు. నేనుకూడా అసభ్యంగా మాట్లాడవలసి వస్తుందని చెబుతున్నాను.. అంతేరా" అన్నాడు సారథి.

"ఒరేయ్...వాడితో మాట్లెందుకు. నాలుగు తగిలించుమరి. సునీతను భయ పెట్టాడా?" అన్నాడొకడు.

"మన తడాఖా వీడికి తెలిసినట్లులేదు పాపం. దేహశుద్ధి ప్రారంభించు...షేపులు మారిపోవాలి" అన్నాడింకొకడు.

ఈ ముగ్గురినీ సునీత తనపైకి ఉసి కొల్పి పంపించిందని గ్రహించాడు సారథి.

"సునీత ఎవరనుకున్నావురా? నా ఫ్రెండు. నాలుకను కంట్రోల్లో పెట్టుకో మని ఏదేదో కూశావట"

"నేనేం కుయ్యలేదు. కారుకూతలు కూసేవాళ్ళని హెచ్చరించాను అంతే! ఇక అవిడ నీకు ఫ్రెండు అయినా ఉంపుడు గత్తెఅయినా నాకు అనవసరం" అన్నాడు సారథి నిర్లక్ష్యంగా.

"ఏమిట్రా..నువ్వు వాగింది" అంటూ రాజేంద్ర సారథి చొక్కాను ఎడంచేత్తో పట్టుకున్నాడు.

"చేయి తీయ్ మర్యాదగా"

"తియ్యను. ఏంచెయ్యగలవు? నిన్ను ఇక్కడే బజార్లో పట్టుకుని తంతాను. వాట్ కెన్ యుడూ?"

"అయ్‌కెన్ డు ఎనీథింగ్"

"సరే...అదే చూద్దాం" అంటూ రాజేంద్ర సారథి చెంపమీద ఛెళ్లుమంటూ కొట్టాడు. అంతే! సారథి ఉగ్రుడై పోయాడు. అతడిలోని ఆత్మాభిమానం పాములా బుసలుకొడుతూ పడగెత్తింది.

"యూ బాస్టర్డ్" అంటూ సారథి రాజేంద్రను తన్నడానికి కుడికాలు పైకె త్తాడు. సరిగ్గా అప్పుడే 'మిస్టర్ సారథీ' అంటూ గట్టిగా పిలవడంతో తలతిప్పి చూశాడు సారథి.

మోటార్‌బైక్‌కు స్టాండువేసి గబ గబా వచ్చి "వాట్ హేపెండ్ సారథీ?" అని అడిగాడు సబ్‌ఇన్‌స్పెక్టర్ హర్ష వర్ధన్.

వాళ్ల ముగ్గురూ తనమీదికి రావడం గురించి హర్షవర్ధన్‌కు వివరించాడు సారథి. యస్.ఐని చూడగానే ఆ ముగ్గురూ వెనుకంజ వేశారు. వాళ్ళలో రాజేంద్రని సులభంగా గుర్తుపట్టాడు హర్షవర్ధన్. అతడు సారథికి పరిచయస్తుడని తెలియ గానే వాళ్ళు భయపడ్డారు.

"వాట్ మిస్టర్! ఈమధ్య లాడ్జి రూములో ఎక్కడా దిగటంలేదా?" రాజేంద్రని చూస్తూ అన్నాడు హర్షవర్ధన్. అతడు అలా అడగ్గానే తల వాల్చేశాడు రాజేంద్ర.

"అయితేమీరుముగ్గురూ సారథిషేపులు మార్చడానికి రెడీ అయ్యారన్నమాట. అయితే ఇంకేం... కానియ్యండి. ఒరేయ్! హాస్టల్లో పందికొక్కుల్లా తిని కొవ్వు పట్టిందిరా మీకు. మీరు పెద్ద రౌడీలా? ఇంకొక్కసారి సారథి పైకి వచ్చారా... స్టేషన్‌లో పడేసి ఒంట్లోవుండే పార్టులన్నీ ఊడిపోయేలా చితకకొడతాను...బి కేర్"

హర్షవర్ధన్ వాళ్ళ ముగ్గురినీ అలా దులిపిపారేశాడు. వాళ్ళు అక్కడినుండి వెళ్ళిపోయారు. వాళ్ళగురించి భయపడ వద్దని, ఎవరయినా ఏమైనా అంటే తనతో చెప్పమని సారథికి ధైర్యం చెప్పి ఖాకీ దుస్తుల్లోవున్న హర్షవర్ధన్ మోటార్‌బైక్ మీద స్టేషన్‌వేపు వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి...సారథి భోజనం ముగించి తన గదిలో వుండగా బిలబిలమంటూ పదిమంది యువకులు సారథి గదిలోకి





వచ్చారు. వాళ్ళందరూ ఒక కులానికి సంబంధించిన విద్యార్థి నాయకులు. రాజేంద్ర వర్గానికి వ్యతిరేకవర్గంలోని ప్రముఖ వ్యక్తులు వాళ్ళు.

"ఏమిటి బాసూ! ఆ రాజేంద్ర ఇవాళ బజార్లో నీమీద దాడిచెయ్యబోయాడట. మాకంతా తెలిసిందిలే. ఈమధ్య వాడు కాలుదువ్వుతున్నాడు. సరే... వాళ్ళ సంగతేమిటో ఇవాళే తేల్చుకుందాం. వాడి రూంకెళ్ళి ఈ రాత్రే అటాక్‌చేద్దాం" అన్నాడొకడు.

"సారథికి వెనకాముందూ ఏ బలమూ లేదని వాడు అనుకుని వుంటాడు. రాత్రికి సారథి కూడా మనతోపాటే వస్తాడు. సారథి బలమేమిటో ఈ రాత్రికే తెలుస్తుంది వాడికి"

తనమీద అభిమానంతోగానీ...తనని వాడు లెంపకాయ కొట్టాడు ... అది అన్యాయం. ఆ అన్యాయాన్ని ఎదుర్కోవాలి అనే ఉద్దేశంతోకానీ వాళ్ళు తన దగ్గరకు రాలేదు. వ్యతిరేకవర్గాన్ని అటాక్‌చేసే అవకాశందొరికింది గనుక తనవద్దకొచ్చారు అని అర్థం అయింది సారథికి.

"పోనీలెండి ... జరిగిందేదో జరిగిపోయింది. దాన్ని మళ్ళీ కలబెట్టి కొండంతలు చేసుకోవడం నాకిష్టం లేదు. అంతేగాక ఇది నా వ్యక్తిగత విషయం. అతడిక నా జోలికి రాడు. కనుక మీరు ఈ విషయం వదిలెయ్యండి" అన్నాడు సారథి.

"నువ్వలా అంటే లాభంలేదు బాసూ! మేమంతా నీకు అండగా వుంటాం. నీకేం భయంలేదు. వాడినీరాత్రికి ఓ చూపు చూసేద్దాం. ఆ మొనగాడు ఎంతమందిని కొట్టగలడో తేల్చుకుందాం. దెబ్బకు దెబ్బే సమాధానం..బి రెడీ" అన్నాడు మరొకడు ఆవేశంతో. తర్వాత వాళ్ళంతా శతవిధాలా సారథికి నచ్చజెప్పడానికి ప్రయత్నించారు. రాజేంద్రని దెబ్బతియ్యడానికి ప్రణాళికలు వేశారు. అందులో వాళ్ళ అంతర్యమేమిటో సారథికి బాగా తెలుసు. అందుకే ఆఖరికి సారథి 'ఈ విషయం వదిలెయ్యండి' అనేశాడు.

అతడలా అనడంతో రాజేంద్రని దెబ్బతీసే అవకాశం జారిపోతున్నందుకు ఆ విద్యార్థి నాయకులకంతా సారథిపై బోలెడంత కోపం వచ్చింది. మండిపడ్డారు వాళ్ళంతా.

"ఇట్లా భయపడితే ఎలా బాసూ?"

"వట్టి పిరికివాడిలా వున్నాడే"

"అందుకేగా వాడిచేత దెబ్బతిన్నది"

"పిరికివాళ్లు పోట్లాటకు వెళ్ళకూడదు"

"పోతేమాత్రం దెబ్బతిని ఊరుకోవడమా?"

"అసమర్థులైతే ఊరుకోక చేసేదేముంది?"

"మనిషన్నాక రోషం వుండితీరాలి"

"అది లేని బతుకు ఓ బతుకేనా?"

"నేనయితే ఆ రాజేంద్ర రక్తాన్ని కళ్ళచూడకుండా నిద్రపోను"

ఈ విధంగా ఆ విద్యార్థి నాయకులు అందరూ సూదులలాంటి మాటలతో సారథి హృదయాన్ని పొడిచి బాధించి, అవహేళనలతో వేధించి ఆ గదిలోంచి వెళ్ళిపోయారు. సారథి వెంటనే తలుపు మూసి బెడ్‌మీద వెల్లకిలా పడుకున్నాడు.

యూనివర్సిటీలో చేరేముందు ఇక్కడుండే స్టూడెంట్స్ గురించి, లెక్చరర్ల గురించి, ప్రొఫెసర్ల గురించి ఎంతో ఉన్నతంగా ఊహించాడు తను. కానీ.. తన ఊహలన్నీ ఉచ్చులు బిగించుకుని ఊపిర్లు వదిలేశాయి. తన అంచనాలు

తలకిందులైపోయాయి. తన కలలు తగలబడిపోయాయి. ఇక్కడి వాస్తవం తనను వెక్కిరిస్తోంది.

ఇంటర్వ్యూ రోజే .... తన హృదయం చివుక్కుమనే విధంగా మాట్లాడాడు ఆ రీడర్. అదే రీడర్ క్లాసులో అందరి ముందూ తనని అవహేళన చేశాడు. పరిమళ తన బెదరికాన్ని ఎత్తిపొడిచింది. తిండికోసమే యూనివర్సిటీలో చేరినట్లు నీచంగా మాట్లాడాడు ప్రొఫెసర్. కేవలం సన్నిహితంగా వున్నందుకే సుగుణతో తనకు అక్రమ సంబంధం అంటగట్టబడింది.

బజార్లో, అందరి ముందు తనపై చెయి చేసుకున్నాడా రాజేంద్ర. కులపిచ్చి పట్టుకున్న ఈ విద్యార్థి నాయకులు ఇప్పుడు తనను అసమర్థుడని,పిరికివాడని, రోషం లేనివాడని తమ ఇష్టంవచ్చినట్లు మాట్లాడి పోయారు.

ఇది విశ్వవిద్యాలయం కాదు...ఇదో ఊబి. ఈ ఊబిలో ఇరుక్కుపోయి తను ఎన్నో అవమానాలను ఎదుర్కొన్నాడు. ఎంతో మానసిక చిత్రవధను భరించాడు. ఇప్పుడూ భరిస్తున్నాడు. రేపూ భరించి తీరాలి. కానీ ఇక తనకు ఆ శక్తిలేదు. తను ఈ నరకయాతనను అనుభవించ లేడు.

ఈ మృగాల మధ్య వ్యక్తిత్వాన్నీ, ఆత్మాభిమానాన్నీ చంపుకుని జీవించలేడు అలాగని వాళ్ళతో తను సర్దుకోనూ లేడు. తను ఏ బాధల్ని, ఏ అవమానాల్ని, ఏ అవహేళనల్ని భరించలేక తన మామయ్య ఇంట్లోంచి వచ్చేశాడో...ఆ బాధలు, ఆ అవమానాలు మరో రూపంలో ఇక్కడా ప్రత్యక్షమై తనను పీడిస్తున్నాయి.

"ఏదేశమేగినా..." అంటూ కవిగారు పొగడమన్న దిఇలాంటి దేశం గురించేనా? ఈ దేశం ఇలా అవుతుందని వారు ఊహించివుంటే అలా రాసేవారు కాదేమో! ఇలాంటి యూనివర్సిటీలు సంస్కార హీనుల్ని, అవినీతిపరుల్ని దేశానికి పుష్కలంగా సమర్పిస్తున్నాయి.

ఈ విషపూరిత వాతావరణం నుండి విముక్తిపొంది వెళ్ళిపోతే ఎంత బాగుం టుంది. ఈ చిత్రవధ, మానసిక వ్యధల నుండి బయటపడితే ఎంత హాయిగా వుంటుంది! అలా ఆలోచిస్తూ నిద్రలోకి జారిపోయాడు సారథి.

* * *

రోజులు గడిచిపోతున్నాయి.వర్కింగ్ డేస్ అయిపోవడంతో యూనివర్సిటీ మూసేశారు. పరీక్షలకి ప్రిపరేషన్ సెలవు లిచ్చేశారు. మార్కులు సంపాదించుకో డానికి విద్యార్థులందరూ ఎవరి మార్గాల్లో వారు 'కృషి' చేస్తున్నారు. పదకొండు గంటలకు సారథి లైబ్రరీ నుండి హాస్టల్ రూంకి తిరిగొచ్చాడు.

"సారథీ... కంగ్రాచ్యులేషన్స్" అంటూ గట్టిగా అరుస్తూ సారథిని పైకెత్తేశాడు రాజు.

"ఏమిటి రాజూ! దేనికి కంగ్రాచ్యు లేషన్స్?"

"ఎందుకో చెబుతాంగానీ... గురూ అర్జంటుగా నువ్వొక వంద రూపాయలు సర్దుకో" అన్నాడు దామోదరం.

"ఎందుకూ?"

"మాకు పార్టీ ఇవ్వడానికి"

"దామోదరం! సస్పెన్స్‌తో చంపక నువ్వయినా అసలు సంగతి చెప్పు" బతిమాలాడు సారథి.

"ఓకే...చెప్పేస్తున్నా. నువ్వు మాత్రం పార్టీ..."

"ఇస్తాన్లే... చెప్పు"

 

"బ్యాంక్‌లో నీకు అపాయింట్‌మెంట్ వచ్చింది"

"వ్వాట్!" నమ్మలేకపోయాడు సారథి.

"అవును సారథీ! ఇవిగో ఆర్డర్స్" అంటూ సారథికి కాగితాల్ని అందించాడు రాజు.

ప్రసవించిన తరువాత మొట్టమొదటగా కళ్ళు తెరిచి తన పసికందు వేపు చూసే మాతృమూర్తిలా... సారథి కళ్ళలో అంతులేని ఆతృత... ఆరాటం.

అవును... ఇది... ఇది కలకాదు... వాస్తవమే. తనకు ఉద్యోగం వచ్చింది. పలుకుబడీ లంచం లాంటివేమీ లేకుండా తనకు ఉద్యోగం వచ్చింది. తను చదివిన నవలల్లో, చూసిన సినిమాలలో కథా నాయకులు అనుభవించిన నిరుద్యోగ యాతనను అనుభవించకనే తనకు ఉద్యోగం వచ్చింది.

"రాజూ...ఇంకో నాలుగైదు రోజులలో నేను జాయినింగ్ రిపోర్ట్ ఇవ్వాలి. కనుక నేను ఇవాళ సాయంత్రమే బయలుదేరుతాను. మాధవరావు మాస్టారువాళ్ళ ఊరెళ్లి అక్కడో రెండుమూడు రోజులుండి అటే వెళ్ళి జాయినౌతాను. రాజూ! నాకీ జాబ్ రావడానికి కారణం నువ్వు. ఇంటర్‌వ్యూకి బాగా ప్రిపేర్ కమ్మని నన్ను బలవంతం చేశావు" కృతజ్ఞతగా రాజు వేపు చూశాడు సారథి.

"సర్లే... ముందు నీ లగేజ్ సర్దుకో" రాజు అన్నాడు.

ఆ సాయంత్రం సారథి, రాజు, దామోదరం, సుగుణ, సీత ఈ అయిదుగురూ ఒక ఎ.సి హోటల్లో టేబుల్ చుట్టూ కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. ఉద్యోగం వచ్చిన శుభ సమయంలో సారథి వాళ్ళందరికీ అక్కడ పార్టీ ఇస్తున్నాడు.

"రాజూ! హాస్టల్లో ఆ రూంని నేను ఖాళీచేసి వచ్చేస్తుంటే... నాకు చాలా బాధన్పించింది" అన్నాడు సారథి.

"ఆ హాస్టల్ గదుల్లో గతంలో ఎంతమంది చదువుకున్నారో, భవిష్యత్తులో ఎంతమంది చదువుకోబోతారో! ఒక్క మాటలో చెప్పాలంటే హాస్టల్లో ప్రతి గదీ ఒక పాంథశాల. ప్రతి విద్యార్థీ ఒక పాంథుడు. దామోదరం! ఎలా వుంది మన కొటేషన్?" నవ్వాడు రాజు.

"బందర్ లడ్డులా వుంది"

"అన్నట్టు సుగుణా! నువ్వు నా గ్రామర్ నోట్సు అడిగావు కదూ... రాజు దగ్గరిచ్చాను. తీసుకో" సారథి అన్నాడు.

"నువ్వు పరీక్షలు రాయవా సారథీ! శెలవులు పెట్టి వచ్చి రాసి పోవచ్చుగా" అంది సుగుణ.

"యూనివర్సిటీలో చేరక ముందు ఎం.ఏ అంటే నాకు మోజుండేది సుగుణా! ఇప్పుడలాంటి భ్రమలేవీ లేవు"

అరగంటతర్వాతఅందరూహోటల్లోంచి బయటపడి బస్ స్టాండుకు చేరుకున్నారు. అందరినీ వదిలిపోవాలంటే సారథికి చాలా బాధగా వుంది. సారథిని వదిలి వుండాలంటే వాళ్ళకూ బాధగానే వుంది. సారథి ఎక్కిన బస్ కదిలింది.

కిటికీలోంచి చూస్తూ చేయి ఊపాడు సారథి. స్నేహితుల్ని విడదీస్తూ బస్ వేగాన్ని అందుకుంది. యూనివర్సిటీ ముందున్న తారురోడ్డు మీద వెళుతోంది బస్సు. తల తిప్పి యూనివర్సిటీ ఆవరణంలోకి చూశాడు సారథి. ఆ ఆవరణంలోంచి అతడి ఆలోచనలు వదిలి రావడం లేదు.

ఆ యూనివర్సిటీ ఆవరణలో సుమారు

తను పదినెలలు - అంటే మూడువందల రోజులు, ఏడువేల రెండువందల గంటలు జీవించాడు. యూ ని వ ర్సి టీ గురించి ఒకప్పుడు తను ఊహించినవన్నీ కేవలం భ్రమలేనని తనకు స్పష్టంగా తెలిసి పోయాయి.

నిజానికది యూనివర్సిటీ కాదు. అది ఒక దట్టమైన విద్యారణ్యం. ఆ అరణ్యంలో సింహాలున్నాయి.పచ్చినెత్తురుతాగేపులులు వున్నాయి. తోడేళ్ళూ, గుంటనక్కలూ వున్నాయి. అందమైన రామచిలుకలూ, నెమళ్ళూ వున్నాయి.

కేవలం క్రూరమృగాలేగాక ఆ దండ కారణ్యంలో ఎవరికీ ఎటువంటి హాని చేయకుండా తమ బతుకేదో తాము బతుకు తున్న కొన్ని సాధు జంతువులు కూడా ఉన్నాయి.

ఆ అరణ్యంలో సభ్యత,సంస్కారాలు, నైతికవిలువలు, మానవత్వం పుష్కలంగా ఉన్నట్లు చూపరులను భ్రమింపచేస్తుం టాయి. కాని అక్కడ అవన్నీ కేవలం కాంచనమృగాలే. అక్కడ అన్నీ మారీచ మాయలే.

ఆ అరణ్యంలో చాలా తెలివైనవాళ్ళు ఉన్నారు. కానీ ప్రపంచాన్ని మోసంచేసే ఆ తెలివైనవాళ్ళకన్నా ప్రపంచంగూర్చి ఏమీ తెలియని తెలివితక్కువవాళ్ళే గొప్ప వాళ్ళు.

ఆ అరణ్యంలో చాలామంది మేధావు లున్నారు. కానీ నైతికవిలువలు బొత్తిగా నశించిన ఆ మేధావులకన్నా అంతో ఇంతో నీతిగల అమాయకులే ఉత్తములు.

ఆ అరణ్యంలో నాగరీకులున్నారు.కానీ రక్తంలో కులతత్వాన్ని రంగరించుకుని కులంకోసంకుమ్ములాడుకునే ఆ నాగరీకుల కన్నా ఆ వైషమ్యాలులేని అనాగరికులే ఉన్నతులు.

ఆ అరణ్యంలో అక్షరాస్యులున్నారు. కానీ మానవత్వం ఏ కోశానాలేని నిజాయితీ లోపించిన ఆఅక్షరాస్యులకన్నా నిజాయితీ, మానవతగల నిరక్షరాస్యులే గొప్పవాళ్ళు.

అక్షరాస్యతకు అర్థం కేవలం రాయ గలగడం,చదవగలగడం మాత్రమేకాదని, సభ్యత, సంస్కారం, మానవతాదృష్టిని కలిగివుండటంకూడా అని మనం అను కుంటే ఆ దండకారణ్యంలో చాలామంది నిరక్షరాస్యులున్నారు. వాళ్లకు తెలిసింది కేవలం రాయడం, చదవడం మాత్రమే.. వాళ్ళంతా ఒకరకంగా లి ట ర రీ ఇల్లిటరేట్స్. ఇది వా స్తవం. ఆ అరణ్యంలో అడుగుపెట్టితేచాలు...ఈ వాస్తవం కళ్ళముందు కరాళ నృత్యం చేస్తుంది.

'విద్య లేనివాడు వింత పశువు' అనేది నిన్నటిమాట. 'విద్య వున్న వాడూ కొంత పశువు' అనేది ఈనాటి మాట. నిజానికి ఈ దేశానికీ ఈ వ్యవస్థకూ నేడు బాగా చదువుకున్నవాడివల్లఉన్నంత ప్రమాదం చదువుకోనివాడివల్ల లేదు.

దేశానికి హానిచెయ్యడానికి, మానవ జాతికి ద్రోహం చెయ్యడానికి ... బాగా చదువుకున్న వాడికి తెలిసినన్ని ఎక్కువ మార్గాలు ఏమీ చదువుకోనివాడికి తెలియవు. సమాజోద్ధరణకు ఉపయోగ పడవలసిన మానవమేధ వినాశనానికే నేడు వినియోగపడుతోంది.

అయితే ... దేశంలో వున్న యూనివర్సిటీలన్నీ ఇలాగే లేకపోవచ్చు. విద్యావంతులంతాఇలాగే ఉండకపోవచ్చు. కానీ తను జీవించిన విశ్వవిద్యాలయం మాత్రం ... నిస్సందేహంగా దండకా రణ్యమే. అందులోని విద్యావంతులు

ద్విపాద మృగాలే.

తన కులానికి చెందిన విద్యార్థులందర్నీ సంఘటితపరిచి మరో కులంవాళ్ళను దెబ్బ తీయడంకోసం ఉసికొల్పే తను చూసిన ప్రొఫెసర్‌లాంటివాళ్లూ...

డాక్టరేట్ డిగ్రీని ఆశచూపి లొంగ తీసుకుని లేడీ రీసెర్చ్‌స్కాలర్‌తో లైంగిక సంబంధాలు పెట్టుకుని లాడ్జిల్లో పోలీసు లకు పట్టుబడుతున్న లెక్చరర్‌లాంటి వాళ్ళూ...

తనకన్నా తెలివైన విద్యార్థిని చూసి ఎంతో సంతోషంతో అభినందించడానికి బదులు అసూయతో కుళ్ళిపోయే నీచ ప్రవృత్తిగల రీడర్‌లాంటివాళ్ళూ...

డబ్బులిస్తే యం.ఫిల్.థీసీస్ తనే రాసి ఇచ్చేస్తానని చెప్పి విద్యార్థులదగ్గర వేలకు వేలు డబ్బుల్ని గుంజుకుంటూ సిద్ధాంత వ్యాసాలను రాసిచ్చే అధ్యాపకులూ...

తన అవయవాల సొంపుల్ని ఎరగా లెక్చరర్‌కి చూపి సులభంగా ఫస్ట్‌క్లాస్ తెచ్చుకుందామనుకునే శశికళ లాంటి వాళ్ళూ...

ఆకలిగొన్న తన బిడ్డకు తల్లి స్తన్యం అందించి పాలిస్తున్న దృశ్యాన్ని చూసి కామాన్ని రెచ్చగొట్టుకునే పరమ నీచమైన స్వభావంగల రీసెర్చ్ స్కాలర్స్ లాంటివాళ్ళూ..

కష్టపడి చదవకుండా,'కలం బలాన్ని' ప్రదర్శించకుండా కేవలం 'కులం బలం' తోనే గోల్డ్‌మెడల్స్‌ను సంపాదించుకుందా మని ప్రతిక్షణం ప్రయత్నించే విద్యార్థులూ

పొరపాటున బట్టలమీద నీళ్ళు ఒలక బోసినందుకు క్షమించకుండా సర్వర్‌పై దయారహితంగా చేయిచేసుకున్న సంస్కారహీనులైన దినకర్‌లాంటి వాళ్ళూ...

ప్రేమ విషయంలో కూడా ఖాతాలు వేసుకుని, లాభనష్టాలను బేరీజువేసుకుని డబ్బున్న అబ్బాయిని ప్రేమించ ప్రయత్నించే వర్తకపుదృష్టిగల పరిమళలాంటి వాళ్ళూ.

ప్రొఫెసర్లకూ, యూనివర్సిటీ పాలక వర్గాలకూ భట్రాజుల్లా భజనలుచేసి... బానిసల్లా ఊడిగంచేసి తద్వారా యు.జి.సి. ఫెలోషిప్పులను సంపాదించుకునే పరి శోధక విద్యార్థులూ...

బంధుప్రీతి, లంచగొండితనం, కుల తత్వం- వీటి ఆసరాతో ఏనాటికయినా యూనివర్సిటీలో లెక్చరర్ ఉద్యోగాన్ని సంపాదించాలని పట్టువదలని విక్ర మార్కుల్లా తమ డిపార్ట్‌మెంట్స్‌ను అంటి పెట్టుకుని ఉండే వయసుడిగిన డాక్టరేట్ డిగ్రీ హోల్డర్లూ....

ఇలాంటివారందరి వ్యక్తిత్వంలో మార్పు తప్పనిసరిగా రావాలి. ఇలాంటి వారంతా మానసికంగా ఎదిగితీరాలి. నైతికవిలువల్ని సంతరించుకోవాలి. మానవతా దృక్పథాన్ని అలవరుచు కోవాలి ... మానవాభ్యుదయానికి కృషి చేయాలి.

అప్పుడే ఇలాంటి వారంతా విద్యా వంతులుగా గుర్తింపబడతారు. అప్పుడే ఇలాంటి దండకారణ్యం ఒక పవిత్రమైన విశ్వవిద్యాలయంగా పరిగణింపబడు తుంది. అప్పుడే విద్యకూ, విద్యావంతు లకూ, విద్యావంతులను తీర్చిదిద్దే విద్యా లయాలకూ ఒక అర్థం...ఒక పరమార్థం ఉంటుంది.

అలా ఆలోచిస్తూ బస్‌లో కూర్చున్న సారథి బరువు దించుకున్నవాడిలా ఓ నిట్టూర్పు విడిచాడు.



# చతుర కతలు

## పార్టీ ఫండ్

అది ఒక ప్రయివేటు ఫాక్టరీ. మూడు సమ్మెలు, ఆరు లాకౌట్లతో దిగ్విజయంగా నడుస్తోంది. ఆ ఫాక్టరీ మేనేజర్ సమ్మెలూ గట్రా వచ్చినప్పుడు అటు వర్కర్స్‌కి చెప్పలేక, ఇటు యాజమాన్యం వారికి చెప్పలేక నలిగిపోతూంటాడు పాపం.

ప్రతి సంవత్సరంలాగానే ఆ సంవత్సరం కూడా సమ్మె మొదలయింది. అందుకు పెద్ద కారణమేమీ లేదు. ఆ ఫాక్టరీ మేనేజింగ్ డైరెక్టర్ కారులో వస్తుంటే ఒక వర్కర్ ఎదురుపడి చిరునవ్వు నవ్వాడట పలకరింపుగా. ఏవో ఆలోచనలతో వున్న ఎం.డి. ఆ వర్కర్‌ని పట్టించుకోలేదట. దాంతో సమ్మె మొదలు.

సమ్మె ప్రారంభం అయిన రెండవరోజు మేనేజర్‌కి పిలుపు వచ్చింది. హడావుడిగా ఎం.డి. ఛాంబర్‌లోకి వెళ్ళాడు.

"నీ సర్వీసు ఎన్నేళ్ళు?" తీక్షణంగా ప్రశ్నించాడు ఎం డి.

"పదమూడేళ్ళు సార్" వినయంగా బదులిచ్చాడు మేనేజరు.

"పదమూడేళ్ళ నీ సర్వీసులోనూ ఇరవై మూడు సమ్మెలు జరిగాయి. ఏ ఫాక్టరీ చరిత్రలోను, ఏ మేనేజరు హయాంలోను ఇన్ని సమ్మెలు జరిగినట్టు ఆధారాలు లేవు. మరొక్క సమ్మె జరిగితే గిన్నిస్ బుక్‌లోకి మన ఫాక్టరీ పేరు ఎక్కుతుంది. ఇన్ని సమ్మెలు జరుగుతున్న నువ్వు ఏం చేస్తున్నావో నాకు అర్థం కావటం లేదు" గద్దించాడు ఎం.డి.

"అది కాదు సార్! మీరు కారులో వస్తూండగా ఎవడో వర్కరు మీవైపు చూసి పలకరింపుగా చిరునవ్వు నవ్వాడట సార్! మీరు అదిపట్టించుకోలేదట. దాంతో సమ్మె ప్రారంభం అయింది సార్. దీనిలో నా తప్పు ఏముందో తెలియటం లేదు సార్!" అయోమయంగా అన్నాడు మేనేజరు.

"తప్పు నాదయినా, నీదయినా నాక అనవసరం. ఇప్పుడు జరుగుతున్న సమ్మె ఆపించు. నువ్వు ఏంచేస్తావో,ఎలా చేస్తావో గానీ ఇప్పుడు మన ఫాక్టరీలో జరుగుతున్న సమ్మె మాత్రం ఆగాలి లేదా నీ ఉద్యోగానికి నీళ్ళు వదులుకోవాలి" అన్నాడు మేనేజింగ్ డైరెక్టర్ కోపంగా.

"వద్దు సార్! అంతపని చేయించకండి. నా శాయశక్తులా ప్రయత్నించి ఈ సమ్మెని ఆపుతాను సార్" అని ప్రాధేయపడ్డాడు మేనేజర్ దీనంగా.

"సరే...ఇంకా ఇక్కడే నిలబడ్డావేం. వెళ్ళు...వెళ్ళి ఆ సంగతి చూడు. సమ్మె ఆగాకే నన్ను కలుసుకో" అని ఫైల్లో తల దూర్చాడు ఎం.డి. విసురుగా.

చేసేదిలేక బయటికివచ్చాడు మేనేజరు. సమ్మె ఆపమని చెబితే వర్కర్సు చితకతంతారు. పోనీ వాళ్ళు సర్దాపడుతున్నారు సమ్మె చేయనివ్వండి అంటే ఉద్యోగం పీకేస్తాడు ఎం.డి. ఏం చేయాలో తెలియక




తన ఛాంబర్‌లోకి వచ్చాడు మేనేజరు. ఇంతలో ప్యూన్ వచ్చాడు లోపలికి.

"సార్! అడ్డగాడిద గుర్తు పార్టీవాళ్లు మీ కోసం వచ్చారు" అన్నాడు.

"లోపలికి పంపించు"

నమస్కారాలు, ప్రతినమస్కారాలు, పరిచయాలు పూర్తి అయ్యాయి.

"ఆ...ఇప్పుడు చెప్పండి" అన్నాడు మేనేజర్ హుందాగా.

"మీ ఫాక్టరీలో సమ్మె ఆగాలంటే మా పార్టీకి ఫండ్ ఇవ్వండి. ఇస్తే సమ్మె ఆపుచేయిస్తాం. లేదా దానిని ఇంకా ఉధృతంచేయించి పేపర్లలోను, అసెంబ్లీలోను అల్లరిచేసేస్తాం" అన్నాడు ఆ పార్టీ లీడర్ గంభీరంగా.

"ఆలోచించుకొని చెబుతాం" అన్నాడు మేనేజర్. వాళ్లు వెళ్ళిపోయారు.

"సార్! కంచరగాడిద పార్టీవాళ్లు వచ్చారు" అంటూ మళ్ళీ లోపలికివచ్చాడు ప్యూన్.

వాళ్ళు చెప్పిందికూడా అదే. "ఓ లక్ష రూపాయలు పార్టీ ఫండ్‌గా ఇస్తే సమ్మె ఆగుతుంది లేదా తీవ్రతరం అవుతుంది" అని.

ఆలోచించి చెబుతానన్నాడు మేనేజర్. వాళ్ళు వెళ్ళిపోయారు.

ఆ తరువాత నిలువుగాడిద పార్టీవాళ్ళు వచ్చారు. వాళ్ళు అడిగినమొత్తం కూడా లక్షరూపాయలే. ఆలోచించి చెబుతానంటే వాళ్ళూ వెళ్ళిపోయారు.

అందరూ వెళ్ళిపోయాక తీవ్రంగా ఆలోచించాడు మేనేజర్.

ఆ తరువాత రెండు కాగితాలుతీసుకొని ఏదో రాసి, ఈలవేసుకుంటూ ప్యూన్‌ని పిలిచి, "ఆ కాగితాలు మేనేజింగ్ డైరెక్టర్ గారికి ఇచ్చేయి" అని చెప్పి హుషారుగా బయటకి నడిచాడు మేనేజర్. అతనికి చాలా ఆనందంగా ఉంద్‌రోజు.



ఫ్యాన్ తెచ్చిన కాగితాలని అందుకొన్నాడు ఎం.డి. "సార్! కంచరగాడిద, నిలువుగాడిద, అడ్డగాడిద పార్టీవాళ్ళకి తలో లక్ష పార్టీ ఫండ్‌గా ఇస్తే సమ్మె ఆగుతుంది. దీనికన్నా వర్కర్సు ఒక్కొక్కళ్ళకి వందరూపాయలు చొప్పున జీతం పెంచటం మంచిది. ఈవిధంగా చేసినా సమ్మె ఆగుతుంది, పైగా ఆర్థిక లాభంకూడా" అని ఉంది.

రెండో కాగితం తీసాడు మేనేజింగ్ డైరెక్టర్.

"మన వర్కర్సు మాటిమాటికి సమ్మె చేస్తూనే వుంటారు. మీరు మాటిమాటికి నన్ను బెదిరిస్తూనే ఉంటారు. దీనికన్నా గాడిదచాకిరీ నయం. ఇచ్చేజీతం తక్కువ చేసేపని ఎక్కువ. అందుకనే నేను మీ ఉద్యోగం వదులుకొంటున్నాను.

చారలగాడిద అని నేను ఒక పార్టీ పెడుతున్నాను. మీ ఫాక్టరీలో ఏదో సమ్మె జరుగుతోందని తెలిసింది. మర్యాదగా ఓ లక్షరూపాయలు మా చారలగాడిద పార్టీ ఫండ్‌గా ఇస్తే సమ్మె ఆగుతుంది. లేదా రేపు పేపర్లలోను, అసెంబ్లీలోను చెలరేగిపోతాను. రేపు వస్తాను. పార్టీఫండ్ రెడీగా ఉంచండి" అని ఉంది.

మేనేజింగ్ డైరెక్టర్ స్పృహతప్పి పడిపోయాడు.

—కాశీభట్ల భానుమూర్తి

# మృతసంజీవని

కోదండరామయ్యను చూస్తే పూర్వంలా ఇప్పుడు "ఒరే....అతనేరా ఎలక్షన్లలో నిలబడి డిపాజిట్ కూడా పోగొట్టుకుంది" అనటంలేదెవరూ.

"ఇన్‌కంటాక్సువాళ్ళు ఇతని ఇంటి మీద దాడిచేశారు తెలుసా?" అని కూడా చెప్పుకోవటం లేదు. పైగా చాలా గౌరవంగా చూస్తూ—

"ఈయన చనిపోయినవాళ్ళను బతికిస్తాడట తెలుసా?" అంటారు భయభక్తులతో.

కోదండరామయ్య ఓ ప్రభుత్వోద్యోగి. భద్రయ్య అతని బాల్యస్నేహితుడూ, కొలీగ్ కూడా! భద్రయ్య ఎప్పుడూ పెరిగే డి.ఎ.ల గురించీ, కట్టవలసిన ఇన్‌కంటాక్సుల గురించీ, పెరగాల్సిన ఇంక్రిమెంట్లగురించి లెక్కలువేస్తుంటాడు.

ఆరోజు ఆర్థికమంత్రి ప్రకటించే బడ్జెట్ వివరాలు రాబోతున్నాయి. ఆఫీసర్లంతా రేడియోలు దగ్గర పెట్టుకొని ఆ వివరాలగురించే చర్చించుకోసాగారు.

బడ్జెట్ ప్రకటించారో లేదో కోదండరామయ్య వద్దకు ఎవరో వచ్చి "భద్రయ్యను హాస్పిటల్‌లో చేర్చారు" అని చెప్పారు. కోదండరామయ్య హడావుడిగా హాస్పిటల్‌కు బయలుదేరాడు. "ఇంకో రెండు నెలలలో రిటైర్ కాబోతున్నాడు. ఇంతలో ఎలాంటి కష్టం వచ్చిందో" అని బాధపడుతూ హాస్పిటల్ చేరాడు.

భద్రయ్యను ఎమర్జెన్సీ వార్డులో వుంచారు. ముక్కుల్లోనూ, నోటిలోనూ ట్యూబ్‌లు బిగించి వున్నాయి. ఆ పరిస్థితిని చూస్తే గుండె బరువెక్కుతోంది. మెల్లిగా భద్రయ్య కొడుకు వద్దకు వచ్చి

"డాక్టర్ ఏమన్నాడు?" అని అడిగాడు కోదండరామయ్య.

"బ్రెయిన్ హెమరేజ్. ఏ విషయం ఇప్పుడే ఏమీ చెప్పలేం" అన్నాడు అతడు బాధగా.





"అరెరె! ఎంత పని జరిగింది" అనుకుంటూ ఆలోచించాడు కోదండరామయ్య. కాసేపు తర్వాత మంచం వద్దకు వెళ్ళి కూర్చొని భద్రయ్య చెవిలో ఏదో గొణిగాడు. కొన్ని క్షణాలకు భద్రయ్య పెదవులు కదిల్చాడు. మరొక నిమిషంలో భద్రయ్య స్పృహలోకొచ్చాడు.

"మార్చి 31 తరువాత రిటైరయిన వాళ్ళకి పెన్షను ఎక్కువ వస్తుంది" అన్నాను. అతనిలో కదలిక కనిపించింది. "ఇన్‌కంటాక్సు రిలీఫ్సు, బోనస్ పెరుగుదలల గురించి చెప్పేసరికి అమాంతం లేచి కూర్చొన్నాడు. ఏమయితేనేం ... ఇప్పుడు వాడు ఆరోగ్యంగా,

అంతా చూస్తున్న భద్రయ్య కుటుంబం 'కోదండరామయ్య' భద్రయ్య చెవిలో మంత్రాలు చదివాడనే నమ్మింది. అదే అందరితోనూ చెప్పి కోదండరామయ్య ఫోటో పెట్టుకుని పూజలు కూడా చెయ్యసాగారు. ఈ కథ మాదాకా వచ్చింది. కోదండరామయ్యకు ఇలాంటి విద్యలు తెలుసని మాకు ఎప్పుడూ చెప్పలేదు. ఇపుడు మాత్రం వత్తిడి చేస్తే, బలవంతం మీద అసలు విషయం చెప్పాడు.

"నాకు మంత్రాలు తంత్రాలు ఏమీ తెలీవు. బడ్జెట్ లోంచి రెండు పాయింట్లు వాడి చెవులో వూదానంతే! హాయిగా బతుకుతున్నాడు. అంతకంటే కావలసినదేముంది" అన్నాడు కోదండరామయ్య చిద్విలాసంగా!

## బహుమతి

పూర్వం కాశ్మీర్‌లో ఓ దర్జీ వుండేవాడు. ఒకరోజు అతను పనిలో వుండగా సైనిక దుస్తుల్లోవున్న ఓ వ్యక్తి లోపలికి దూసుకు వచ్చి, "నేను బాబర్‌ని. నన్ను శత్రువులు తరుముతున్నారు. నన్నెక్కడయినా దాచేయి...తరువాత నీకు మంచి బహుమతి

ఇస్తాను" అన్నాడు. ఆ దర్జీ ఒక్క క్షణం ఆశ్చర్యపోయి, వెంటనే బాబరును పక్క గదిలోకి తీసుకెళ్ళాడు. అక్కడ ఓ చెక్క మంచం, దానిమీద పరుపూ వున్నాయి. ఆ దర్జీ పరుపును చుట్టేసి, బాబరును మంచంమీద పడుకోబెట్టి మళ్ళీ పరుపు అతనిమీద సరిజేసి దానిమీద కత్తిరించిన గుడ్డముక్కలు వగైరా కుమ్మరించి ముందు గదిలోకి వచ్చాడు.

కాసేపటికి ముగ్గురు సైనికులు వచ్చి, "బాబరు వచ్చాడా ఇక్కడికి? నిజం చెప్పు. లేకపోతే చంపేస్తాం" అంటూ బెదిరించారు. దర్జీ ఆ బెదురులోంచి తేరుకునేలోగా వాళ్ళు లోపలికి ప్రవేశించి వెనుక గదిని సోదా చేయటం ప్రారంభించారు. దర్జీకి పైప్రాణాలు పైనే పోయాయి. సైనికులు బెడ్‌వద్దకు వచ్చి ఈటెలతో పరుపును పొడిచి పొడిచి పరీక్షించారు. చివరకు విసుగెత్తి తిట్టుకుంటూ వెళ్ళిపోయారు.

చాలా సేపు తరువాత బాబర్ బయటకు వచ్చాడు. అతనికి వళ్ళంతా చెమటలుపట్టి, మొహం పాలిపోయివుంది. "సైనికులు వెళ్ళిపోయారా?" అన్నాడు. దర్జీ 'వెళ్ళిపోయారని' సమాధానం చెప్పగానే, "హమ్మయ్య! నా ప్రాణాల్ని రక్షించావు. నీకేం కావాలో కోరుకో...అదెంతటి విలువయినదయినా ఇస్తాను" అన్నాడు బాబరు.

దర్జీ తన బీదపరిస్థితి చెప్పి కొద్దిగా బట్టలు, కాసిని తిండిధాన్యాలు అడిగాడు. బాబరు విసుగ్గా, "ఓహో...బాబరు అంతటి వాడు అడిగితే ఇంత చిన్న కోరిక కోరావేమిటి? చారిత్రాత్మకమైన కోరిక కోరు... వాటితోపాటు ఇప్పుడు అడిగినవికూడా ఇస్తాలే!" అన్నాడు.

దర్జీ తలగోక్కుంటూ, "ఒక ప్రశ్న అడుగుతాను సమాధానం చెప్పండి చాలు! ఇంతకీ సైనికులు ఈటెలతో పరుపులో పొడుస్తున్నపుడు మీకేమనిపించింది?" అన్నాడు. బాబరు ముఖం ఎర్రబడింది. కోపంతో ముక్కుపుటాలదిరాయి. "నీకెంత ధైర్యం అలాటి ప్రశ్నలు అడగటానికి? నీ అవివేకానికి తగిన శిక్ష విధిస్తానే" అంటూ బయటికి వెళ్ళిపోయాడు.

మరుసటిరోజు బాబరు సైనికులు వచ్చి ఆ దర్జీని ఈడ్చుకుపోయారు. పెడరెక్కలు విరిచి ఒక చెట్టుకు వేలాడదీశారు. తర్వాత సైనికులు తమ ఈటెలను అతనికి గురిపెట్టి పట్టుకు నుంచున్నారు. దర్జీవాడి గుండె గుబగుబలాడింది...శరీరం చెమటలు పట్టసాగింది. క్షణాలు లెక్కబెట్టసాగాడు. ఒకటి...రెండు...మూడు...నాలుగు

ఇంతలో బాబరు వచ్చాడు. "నిన్ను క్షమించాను. నీవు కోరిన బట్టలూ, ధనమూ ఇవ్వబడతాయి. అన్నిటికన్నా ముఖ్యంగా నీ ప్రశ్నకు జవాబు ఇచ్చాను. మరణానికి దగ్గరలోవున్న మనిషి ఏమనుకుంటాడో నీ స్వానుభవంతో తెలుసుకున్నావుగదా" అన్నాడాయన.

దర్జీ కళ్ళలో నీరు తిరిగింది. అతనికి బాబరులో దేముడు కనిపించాడు ఆ క్షణంలో.

—కస్తూరి రాజశేఖర్

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly
Eenadu Compound, Hyderabad - 500 482.

ఇదిగో

# గ్లూకోన్-డి ® సూపర్‌హీరో







మీరు ఎప్పుడూ కలలలో చూసి మురిసి పోతూంటారే....అలాంటివాడు....మరే పిల్లవాడూ లేనంత చురుగ్గా, చలాకిగా !

మీ సూపర్ హీరో అమితంగా ఇష్టపడే ఈ పానీయం—గ్లూకోన్-డి మీ అబ్బాయికి ఇవ్వండి.

గ్లూకోన్-డి. ఇందులో గ్లూకోస్, విటమిన్-డి మరియు కాల్షియం ఫాస్ఫేట్లు వున్నాయి. ఇవి మీ అబ్బాయి చక్కగా చదువుకోడానికి చలాకీగా ఆడుకోడానికి తగిన తక్షణ శక్తిని అందిస్తాయి.

గ్లాక్సోవారి గ్లూకోన్-డి మూలంగా ఇప్పుడు మీ స్వంత సూపర్ హీరోను చూడండి. గర్వంతో ఆనందించండి.

## గ్లూకోన్-డి ®

సూపర్‌హీరో అమితంగా ఇష్టపడే తక్షణ శక్తినిచ్చే పానీయం

GLL 1842

HATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd.No. H/ HD /402

# ఉన్నతమైన నాణ్యత ప్రియలోనే వుంది




ఎన్నిక చేసిన దినుసులన్నీ సమపాళ్లలో
మేళవించి అద్భుతమైన రుచులతో
రూపొందించినవే ప్రియ పచ్చళ్ళు.
మీ భోజనానికి సంతృప్తి సరిజోడు-ప్రియ
ఈనాడే మీ ప్రియను మీ ఇంటికి తీసుకువెళ్ళండి.

**ప్రియ ఫుడ్స్**
ప్రైవేట్ లిమిటెడ్

Marketed by:
MARGADARSI MARKET
PRIVATE LIMITED

**ఎంతో రుచి... ఎంతో రుచి... ప్రియ**

Kiron/PF/831